ఓమ్ శ్రీర్విజయతే.

---

# స్వరచింతామణి

అనునామాంతరముగల

# స్వరశాస్త్రము.

(ఆంధ్రతాత్పర్యసహితము)

---

ఈ యోగశాస్త్రము

తెన్మఠము - శ్రీరంగాచార్యులచే

ముద్రింపించి - ప్రకటింపఁబడియె.

9. పళ్లియప్పన్ వీధి, సాహుకారుపేట, మద్రాసు.

ఆఱవ కూర్పు.

శ్రీ ఆదిమూల ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

1938



దీని వెల రూ 1-8-0] [పోస్టేజి ప్రత్యేకము.



# ప్రకటన.

ఈ గ్రంథంబును, ఇతరములగు సంస్కృత ఆంధ్రగ్రంథములును వలయువారు క్రిందివిలాసము గలవారికి జాబులు వ్రాసి, వి-పి ద్వారా తెప్పించుకొనవచ్చును.

తే. శ్రీరంగాచార్యులు,
9, పల్లియప్పన్ వీధి, సాహుకార్పేట,
మద్రాసు.



# విషయసూచిక.

ఓం శ్రీర్విజయతే.

---

స్వర చింతామణ్యపరనామక

# స్వరశాస్త్రి

## ప్రథమోఽధ్యాయః.

సర్వేశం సర్వగం సర్వం సర్వభూతహృది స్థితమ్ ।
సర్వకార్యకరం నత్వా సర్వజ్ఞాన ముదీర్యతే ॥
ఉమాయై యచ్ఛివేనోక్తం యోగినా శ్వేతకేతునా ॥ ౧

తా. సమస్తమునకుఁ బ్రభుండును, సర్వవ్యాపకుండును, సర్వమయుండును సకలభూతముల మనస్సున నుండువాఁడును, సర్వకార్య కరుండునునగు భగవంతునికి నమస్కరించి పార్వతికి శివుండు చెప్పిన సర్వజ్ఞానము (సమస్తము నెఱుంగు విధము) ను శ్వేతకేతువను పేరుగల నేను చెప్పుచున్నాను.

యస్మా దుత్పద్యతే విశ్వం పున ర్యస్మిన్ విలీయతే ।
త మహం శాశ్వతం వందే సమీరణపథానుగమ్ ॥ ౨

తా. లోకము, ఎవనివలనఁబుట్టి తిరుగా నెవనియందణఁగుచున్నదో, శాశ్వతుఁడును, వాయుమార్గ సంచారుండునైన యాదేవునికి మ్రొక్కెద.

అవ్యక్త మవ్యయం శాంతం నితాంతం యోగినాం ప్రియమ్ ।
సర్వానందస్వరూపం చ త ద్వందే బ్రహ్మ సర్వగమ్ ॥ 3

తా. స్పష్టముగాని వాఁడును, నాశ రహితుండును, యోగులకు మిక్కిలి ప్రియుండును, సర్వానంద స్వరూపుఁడును, సర్వవ్యాపకుండు నగు పరబ్రహ్మకు మ్రొక్కెద.

ప్రభవం చేత దేవేశం లోకనాథం జగత్పతిమ్ ।
సర్వజ్ఞేశం నమస్కృత్వా దేవీ వచన మబ్రవీత్ ॥ ౪

తా. సర్వకారణ భూతుండును, దేవదేవేశుండును, లోకులచేఁ బ్రార్థింపఁబడువాఁడును జగత్పతియు, సర్వజ్ఞులకుఁ బ్రభువునగు శివునికి మ్రొక్కి పార్వతీదేవి యిట్లనియె.

కరణస్య సవారస్య కాలస్య గుళికస్య చ ।
ఆకారం పాత విధృతి హోరాణాం చ విశేషతః ॥ ౫

యంత్రమంత్ర గ్రహాశ్చైవ సర్వే దైవబలం వినా ।
సర్వసిద్ధికరం జ్ఞానం కథయస్వ మమ ప్రభో ! ॥ ౬

తా. ఓస్వామీ : కరణము వారము కాలము గుళికకాలము వైధృతి వ్యతీపాతము హోరలు వీనిస్వరూపమును, సకలవిధయంత్రమంత్రములు, గ్రహములు దైవబలము ఇవి లేకయే సకల కార్యములు సిద్ధించు విధము నెఱింగెడి జ్ఞానమును నాకు విశేషముగ జెప్పుము, అని పార్వతియడిగెను.

సాధుసాధు మహాభాగే సర్వజ్ఞే చారుభాషిణి ! ।
అతస్త్వాం కథయిష్యామి హే పార్వతి తవప్రియమ్ ॥ ౭

తా. బాగు బాగు? నీవు మహాపతివ్రతవు సర్వజ్ఞురాలవు మనోహరవాక్కు గల దానవును గనుక ఓ పార్వతీ ! నీకుఁ బ్రియమైన దానిని జెప్పెద.

చింతామణీతి విఖ్యాతం చింతితం భువనత్రయం ।
యస్య విజ్ఞానమాత్రేణ కింతపేచ్ఛ? సురాసురైః ॥ ౮

తా. దేనియొక్క జ్ఞానమువలన మూడులోకములును తెలియఁబడుచున్నవో అట్టి చింతామణియనునది ప్రసిద్ధిం జెందినది, దీనిం దెలిసినవాఁడు సురాసురులకును వశ్యుఁడు కాఁజాలఁడు.

సవారకరణ హోరా సకాల గుళికస్య చ ।
పాతస్య విధృతే జ్ఞానం యేన సంబుధ్యతే స్వతః ॥

తా. వారము కరణము హోర కాలము గుళికకాలము ఇవి తెలియుక్రమము ఏచింతామణివలన బాగుగఁ దెలియునో అట్టి చింతామణిని చెప్పుచున్నాను.

యంత్ర మంత్ర సమృద్ధి శ్చ గ్రహాంశగతయ స్తథా ।
భిద్యతే రిపుసంఘాత స్సుస్వరేణ యథాసుఖమ్ ॥ ౧౦

తా. ఏలయనఁగా - స్వరజ్ఞానముచేత యంత్రమంత్రములు గ్రహగతులు వీని ఫలములును, వీనికి విరుద్ధ ఫలములును సుఖముగ దెలియఁదగును,

స్వరే భవే ద్వేదశాస్త్రం స్వరే గాంధర్వ ముత్తమమ్ ।
స్వరే చ వర్తతే లోక స్స్వర మాత్మానురూపకమ్ ॥ ౧౧

తా. స్వరమునందు వేదశాస్త్రములు, గాంధర్వవిద్య, చతుర్దశలోకములును నుండును, స్వరము ఆత్మను తెలియజేయును.

ప్రశంసనం తు ప్రథమే పిండోత్పత్తి ర్ద్వితీయకే ।
తృతీయే తు స్వరోత్పత్తి రధ్యాయే కథయిష్యతే ॥ ౧౨

తా. మొదటి యధ్యాయమున ప్రశంసనము, రెండవ యధ్యాయమున పిండోత్పత్తి, మూడవ యధ్యాయమున స్వరోత్పత్తియుఁ జెప్పఁబడును.

కాలప్రమాణ సంఖ్యా తు చతుర్థే కథయిష్యతే ।
నాడీసంధిః పంచమే తు అజపాలక్షణం తథా ॥ ౧౩

తా. నాలవయధ్యాయమున కాలప్రమాణము, అయిదవయధ్యాయమున నాడీసంధి, అజపా లక్షణమును చెప్పఁబడును.

స్వరకర్మ స్వరూపంచ షష్ఠే వక్ష్యామహే క్రమాత్ ।
స్వరాకస్మిక విజ్ఞానం సప్తమే వక్ష్యతే స్ఫుటమ్ ॥ ౧౪

తా. ఆఱవయధ్యాయమున స్వరకర్మము, ఏడవయధ్యాయమున ఆకస్మిక స్వరజ్ఞానము చెప్పఁబడును.

వారస్వరస్య విజ్ఞానం పక్షస్యాప్యయనస్య చ ।
సంవత్సరస్య విజ్ఞాన మష్టమే నవమే క్రమాత్ ॥ ౧౫

తా. వారస్వరము పక్షస్వరము అయనస్వరము సంవత్సరస్వరము వీని జ్ఞానము ఎనిమిది తొమ్మిది యధ్యాయములయందుఁ జెప్పంబడును.

తత్తత్త్వపరిజ్ఞానం దశమే కథయిష్యతే ।
మూలస్వరస్య విజ్ఞానం వక్ష్యతే రుద్రసంజ్ఞకే ॥ ౧౬

తా. పదియవయధ్యాయమున పంచతత్త్వముల విధానంబును, పదునొకొండవ యధ్యాయమున మూలస్వరవిజ్ఞానమును చెప్పఁబడును.

ధాతో ర్మూలస్య జీవస్య చింతనం ద్వాదశే తథా ।
త్రయోదశే జలక్రీడా అభిషేకస్తు కథ్యతే ॥ ౧౭

తా. పంద్రెండవ యధ్యాయమున ధాతుమూల జీవచింత, పదుమూడవ యధ్యాయమున జలక్రీడ అభ్యంగస్నానము వీనిక్రమము చెప్పఁబడును.

చతుర్దశే భోజనం చ నిర్విషీకరణం తథా ।
త్రిపంచకే తు తాంబూలం సంభోగం షోడశే తథా ॥ ౧౮

తా. పదునాలుగవ యధ్యాయమున భోజనము, నిర్విషీకరణము, పదునైదవ యధ్యాయమున తాంబూలము, పదునాఱవ యధ్యాయమున సంభోగము వీనిక్రమము చెప్పఁబడును.

గర్భజ్ఞానం సప్తదశే తదూర్ధ్వం జీవనాడికా।
ఏకోనవింశాధ్యాయే తు యుద్ధం ద్యూతంచ కథ్యతే॥ ౧౯

తా. పదునేడవ అధ్యాయమున గర్భజ్ఞానము. పదునెనిమిదవ అధ్యాయమున జీవనాడి, పందొమ్మిదవ అధ్యాయమున యుద్ధద్యూత ప్రసంగమును చెప్పఁబడును.

వింశాధ్యాయే వక్ష్యతే చ వృష్టిలక్షణ ముత్తమమ్।
సస్యోత్పత్తే శ్చ విజ్ఞానం తస్మిన్నేన ప్రకథ్యతే॥ ౨౦

తా. ఇరువదియవ యధ్యాయమున వర్షాలక్షణము, సస్యోత్పత్తివిజ్ఞానంబును జెప్పఁబడును.

క్రయ విక్రయకం చైవ ఏకవింశే తు కథ్యతే।
ద్వావింశే తు జలాఖేటో వనాఖేట శ్చ కథ్యతే॥ ౨౧

తా. ఇరువదియొకటవ యధ్యాయమున క్రయము విక్రయము, ఇరువదిరెండవ యధ్యాయమున జలాఖేటము వనాఖేటము వీనిక్రమము చెప్పఁబడును.

త్రయోవింశే పోషయోగం సూర్యచంద్రాతిచారకమ్।
చతుర్వింశే తు స్వప్నస్య విజ్ఞానం శాకునం తతః॥ ౨౨

తా. ఇరువది మూడవ యధ్యాయమున పోషయోగము, సూర్యచంద్రాతిచారములు, కాలజ్ఞానము, ఇరువదినాలవయధ్యాయమున స్వప్నఫలమును చెప్పఁబడును.

పంచవింశేతు శారీరం వశ్యయోగా స్తథైవచ।
పుంస్త్రీసాముద్రికం చైవ స్వరచింతామణేరితమ్।
ఏతచ్ఛాస్త్రం తు యో వేత్తి స యోగీత్యుచ్యతే బుధైః॥ ౨౩

ఇత్యుమామహేశ్వర సంవాదే, స్వరచింతామణౌ ప్రశంసనంనామ
ప్రథమోఽధ్యాయః. *

తా. ఇరువదియైదవ యధ్యాయమున శకునఫలము శారీరము వశ్యమూలికలు స్త్రీపురుషసాముద్రికలక్షణములు చెప్పఁబడును. ఈక్రమమున నిరువదియైదు అధ్యాయములుగలదిగ ఈ స్వరచింతామణి చెప్పఁబడెను ఈశాస్త్రము నెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడే యోగి యని బుధులు చెప్పెదరు

* ఇట్లు ఉమామహేశ్వర సంవాదరూపమైన స్వరచింతామణియందు ప్రశంసనమను మొదటి యధ్యాయము ముగిసెను.

# ద్వితీయోఽధ్యాయః.

---

పింఢోత్పత్తిం ప్రవక్ష్యామి స్వరస్యోదయ కారణమ్ ।
స్వరం ఏక స్త్రిధా చైవ పున స్స్యా త్పంచధా స్ఫుటమ్ ॥
పంచ వా పున రేక స్స్యా త్పంచవింశతితః పునః ॥ ౧

తా. ఓపార్వతీ! స్వరోదయమునకుఁ గారణమయిన పిండోత్పత్తిని చెప్పెద స్వరమొకటియే మూడురూపములుగను అయిదు రూపములుగను అగును. ఆ అయిదును మరల నొక్కరూపమగును. అయిదుచొప్పున తిరుగా ఇరువదియైదు విధములగును.

శరీరే స్వరసంభూతి స్స్వరో నాడీసమాశ్రయః ।
స్వరనాడీ స్వరూపార్థం శరీరం చాత్ర కథ్యతే ॥ ౨

తా. శరీరమునందు స్వరము పుట్టును. స్వరమందు నాడి పుట్టును. స్వరనాడుల స్వరూపము తెలియుటకు శరీరము చెప్పఁబడుచున్నది.

శరీరం పిండ మిత్యుక్తం తతః పిండేన లుప్యతే ।
శుక్లశోణిత సమ్మిశ్రం చైతన్యేన వ్యధిష్ఠితమ్ ॥ ౩

తా. శరీరము పిండమనఁబడును. ఆ పిండమందు శరీరము అణఁగియుండును. శుక్లశోణిత సమ్మిశ్రమగు నాపిండము చైతన్యముతోఁ గూడియుండును.

దినేదినే తు కలలం పంచాహాదపి బుద్బుదమ్ ।
దశాహా చ్ఛోణితం తస్మా న్మాంసపేశీ తు పక్షతః ॥ ౪

తా. ఆ శుక్లశోణితములు నాలుగు దినములవఱకు ప్రతిదినమందును మేళన మగుచుండును. అయిదు దినములకు బుగ్గ వలెనగును. పది దినములకు నెత్తురౌను. పదునేను దినములకు మాంసపు ముద్దయగును.

వాసరాణాం తు వింశత్యా ఘనమాంసం భవేత్తతః ।
దినానాం పంచవింశత్యా తత్సర్వం తులితం భవేత్ ॥ ౫

తా. ఇరువది దినములకు గట్టి మాంసపు ముద్దయగును. ఇరువదియైదు దినములకు సమానరూపమగును.

పంచభూతాన్వితం మాసే ద్వితీయే మేదసాన్వితమ్ ।
తృతీయే తు సమజ్జాస్థి చతుర్థే చాంగసంభవః ॥

తా. మొదటి నెలయందు పంచభూతములు కూడును. రెండవ నెలయందు మేదస్సు గలుగును, మూడవ నెలయందు ఎముకలు మజ్జ గలుగును. నాలవ మాసమున అవయవములు జనించును.

పంచమే మాసి కర్ణాక్షి నాసావక్త్రాది రంధ్రభాక్ ।
కంఠరంధ్రో దరోత్పత్తి ర్మాసే షష్ఠే ప్రజాయతే॥ ౭

తా. అయిదవ మాసమున రంధ్రములతోఁ గూడిన చెవులు ముక్కు కన్నులు నోరు మొదలగునవి జనించును, ఆఱవమాసమున కంఠరంధ్రము ఉదరము ఇవిపుట్టును.

సప్తమే మాసి సంప్రాప్తే సముత్పన్నోఽపి జీవతి ।
అల్పాయు రల్పసత్వ శ్చ క్షీణధాతు శ్చ రోగవాన్ ॥ ౮

తా. ఏడవమాసమున బుట్టిన శిశువు బ్రతుకునుగాని అల్పాయువు అల్పబలము క్షీణధాతువు గలదియు రోగియునగును.

అష్టమే మాసి సంజాతః కథం గర్భోన జీవతి ।
మాతర్యపి స్వదేహే చ చలనం తస్య జాయతే ॥ ౯

తా. ఎనిమిదవ మాసమున బుట్టిన శిశువు ఏ విధముగను బ్రతుకదు. తల్లిదేహమందును శిశువు దేహమందును ప్రాణము తిరుగుచుండును గనుక తల్లిగాని బిడ్డగాని మృతినొందును.

నవమే మాసి సంజాతే స్మరణం తస్య జాయతే ।
నవమే దశమే వాపి ప్రాణతో గర్భ ముత్సృజేత్ ॥ ౧౦

తా. తొమ్మిదవ మాసమునందు గర్భమునకు జ్ఞానము కలుగును. ఈమాసమున గాని పదియవ మాసమునగాని ప్రాణముతోఁ బుట్టును.

షోడశ ర్తు ర్నిశాః స్త్రీణాం తస్మి న్యుగ్మాసు సంవిశేత్ ।
యుగ్మాసు పుత్రా జాయంతే స్త్రియోఽయుగ్మాసు రాత్రిషు ॥

తా. స్త్రీలకు ఋతుదినము మొదలు ౧౬ దినములవఱకు కళరేచ్చి గర్భము నిలుచును కావున సరిదినములయందు స్త్రీతోఁగూడినయెడల పురుషగర్భము, బేసి దినములయందయిన యెడల స్త్రీగర్భమును గలుగును.

తస్మా ద్యుగ్మాసు పుత్రార్థీ సంవిశే దార్తవే స్త్రియమ్ ।
స్త్రియశ్శుక్లాధికా న్నారీ పుంసశ్శుక్లాధికా త్ప్రమాన్ ॥ ౧౨

తా. కాఁబట్టి పుత్రుల గోరినవాఁడు సరిదినములయందు ఋతుస్నానము చేసిన స్త్రీని గూడవలయు. స్త్రీరేతస్సు అధికమయ్యేనేని ఆఁడుదిపుట్టును. పురుషుని వీర్య మధికమయ్యేనేని మగవాఁడు పుట్టును.

చతుర్థరాత్రౌ పుత్రస్తు అల్పాయుర్ధనవర్జితః।
పంచమ్యాం పుత్రిణీ నారీ షష్ఠ్యాం పుత్రస్తు మధ్యమః॥ ౧౩

తా. స్నానదినము రాత్రియందు గర్భము నిలుచుటచేఁ బుట్టిన మగవాఁడు అల్పాయువును దరిద్రుఁడునగును. గర్భమయిదవదినమున అయినయెడల కూఁతురుమంచి పుత్రులుగలదగును. ఆఱవదినమున అయినయెడల కొడుకు మధ్యమగుణము గలవాడగును.

సప్తమ్యాం పుత్రిణీ నారీ అష్టమ్యాం శ్రీయుతః పుమాన్।
పతివ్రతా చ నవమే దశమే శ్రేష్ఠపుత్రికః। ౧౪

తా. ఏడవదినమున అయిన యెడల పుత్రవతి యగుకూఁతురు, ఎనిమిదవ దినమున మహాదైశ్వర్యసంపన్నుఁడగు కుమారుఁడు, తొమ్మిదవదినమున పతివ్రతయగు కూఁతురు, పదియవ దినమున మంచికుమారుఁడును బుట్టును.

ఏకాదశ్యామధర్మస్త్రీ ద్వాదశ్యాం పురుషోత్తమః।
త్రయోదశ్యాం దుష్టచారీ వర్ణసంకరకారిణీ॥ ౧౫

తా. పదునొకండవ దినమున అధర్మరాలయిన కూఁతురు, పండ్రెండవ దినమున పురుషోత్తముఁడగు కుమారుఁడు, పదుమూడవ దినమున వర్ణసంకరకరురాలును దుర్మార్గ రాలు నగు కూఁతురును జనించును.

ధర్మధ్వజః కృతఘ్నశ్చ ఆత్మవేదీ దృఢవ్రతః।
జాయతే తు చతుర్దశ్యాం గుణౌఘైర్జగతః పతిః॥ ౧౬

తా. పదునాల్గవ దినమున, ధర్మము చేయువాఁడును కృతజ్ఞుఁడును దృఢవ్రతుండును ఆత్మజ్ఞానము కలవాఁడునగు పుత్రుఁడు కలుగును; వాఁడు గొప్ప గుణములు గలవాఁడగుటచే భూమికి రాజుగానగును.

రాజపత్నీ మహాభాగా రాజవంశగతా థవా।
జాయతే పంచదశ్యాంతు బహుపుత్రా పతివ్రతా॥ ౧౭

తా. పదునేనవ దినమున అయిన యెడల రాజుకు పట్టపుదేవియగునదియు, అధిక సౌభాగ్యము గలదియు, లేక రాజవంశమును పొందునదియు, బహుపుత్రులు కలదియు, పతివ్రతయు నగు కూఁతురు జనించును.

విద్యాలక్షణసంపూర్ణ స్సత్యవాదీ జితేంద్రియః।
సమ శ్చ సర్వభూతేషు షోడశే జాయతే పుమాన్ ॥ ౧౮

తా. పదునాఱవ దినమున అయిన యెడల మహావిద్యా ప్రవీణుండును సర్వ లక్షణ సంపూర్ణుండును సత్యవాక్యుండును జితేంద్రియుండును సకలజనమిత్రుండు నగు పుత్రుఁడు గలుగును.

అస్థీని మజ్జా శుక్లం చ పితురంశా అమీ మతాః।
రక్త రోమాళి మాంసం చ మాతురంశా అమీ మతాః॥ ౧౯

తా. ఎముకలు మెదడు వీర్యము ఇవి తండ్రియంశములు, నెత్తురు రోమములు మాంసము ఇవి తల్లి యంశములు.

రోమ చర్మాస్థి మాంసాని పృథివ్యంశాని పార్వతి!।
అబంశం శుక్ల విణ్మూత్ర నిద్రాలస్యాది కథ్యతే॥ ౨౦

తా. రోమములు చర్మము ఎముకలు మాంసము ఇవి పృథివ్యంశములు. శుక్లము పురీషము మూత్రము నిద్ర ఆలస్యము మొదలగునవి ఉదకాంశములు.

క్షు త్తృష్ణా దేహకాంతి శ్చ భవే దంశ శ్చ తేజసః।
ఆకుంచనం ప్రసరణం ధావనం వల్గనం తథా॥ ౨౧
నిరోధ శ్చాపి కంప శ్చ వాయోరంశా అమీ మతాః।
క్రోధో లజ్జా భయం మోహ శ్చాకాశాంశా న తేజసః॥ ౨౨

తా. ఆఁకలి దప్పి దేహకాంతి ఇవి తేజస్సుయొక్క అంశములు. ముడుచుకొనుట చాచుకొనుట పాఱుట కదలుట వణఁకుట నిలుచుట ఇవి వాయ్వంశములు. కోపము సిగ్గు భయము మోహము ఇవి ఆకాశముయొక్క అంశములు అని యెఱుంగవలయు.

జిహ్వాత్వక్కర్ణ నాసాక్షి స్యాత్ జ్ఞానేంద్రియపంచకమ్।
ఉపస్థ గుద వాక్పాణి పాదాః కర్మేంద్రియం మతమ్॥ ౨౩

తా. నాలుక చర్మము చెవులు ముక్కు కన్నులు ఈ ఐదును జ్ఞానేంద్రియములు. ఉపస్థము ఆసనము వాక్కు హస్తములు పాదములు ఇవి కర్మేంద్రియములు.

చతుర్దళం స్యా దాధారే ఉపస్థేపి చ షడ్దళమ్।
నాభౌ దశదళం పద్మం సూర్యసంఖ్యాదళం హృది॥ ౨౪

తా. మూలాధారమందు నాలుగుదళముల పద్మము, యోనియందు ఆఱుదళముల పద్మము, నాభియందు పదిదళముల పద్మము, హృదయమందు పండ్రెండు దళముల పద్మంబును ఉండును.

కంఠే తు షోడశదళం భ్రూమధ్యే ద్విదళం తథా ।
సహస్రదళ మాఖ్యాతం బ్రహ్మరంధ్రే తు పంకజమ్ ॥ ౨౫

తా. కంఠమునందు పదునాఱుదళముల పద్మము, కనుబొమలనడుమ రెండు దళముల పద్మము, బ్రహ్మరంధ్రమునందు వేయిదళముల పద్మము, బ్రహ్మరంధ్రమునందు వేయిదళముల పద్మంబును ఉండును.

ఏతాని సప్తపద్మాని చక్రాఖ్యాని ప్రచక్షతే ।
దేహమధ్యే స్థితా నాడ్యో బహురూపా శ్చ విస్తృతాః ।
జ్ఞాతవ్యా శ్చ బుధై ర్నిత్యం స్వదేహజ్ఞానహేతవే ॥ ౨౬

తా. ఈ యేడుపద్మములును సప్తచక్రములనఁబడును. దేహమందుండు నాడులు అనేకరూపములుగలవై విస్తారముగా నుండును. ఇవి పెద్దలైనవారిచే ఆత్మజ్ఞానము నిమిత్తము అవశ్యము తెలిసికోదగినవి.

సప్తవింశతినక్షత్రం సప్తద్వీపా నవగ్రహాః ।
శరీరాభ్యంతరే దేవి ! యో వీక్షేత భవే ద్గురుః ॥ ౨౭

తా. సప్తద్వీపములు, ఇరువదియేడు నక్షత్రములు, నవగ్రహములు వీనిని శరీరమందు తెలిసికొనినవాఁడే గురుఁడు అనఁబడును.

సాగరా స్సప్త వేదా శ్చ చత్వారోఽష్టదిశ స్తథా ।
శరీరాభ్యంతరే దేవి ! యో వీక్షేత భవే ద్గురుః ॥ ౨౮

తా. ౭ సముద్రములను, ౪ వేదములను, ౮ దిక్కులను, శరీరమందుఁ దెలిసికొనిన వాఁడే గురువు అనఁబడును.

బ్రహ్మ విష్ణు శ్చ రుద్రశ్చ ఆదిత్య శ్చంద్రదేవతాః ।
శరీరాభ్యంతరే దేవి ! యో వీక్షేత భవే ద్గురుః ॥ ౨౯

తా. బ్రహ్మ విష్ణువు మహేశ్వరుఁడు సూర్యచంద్రులు మొదలైన దేవతలను శరీరమందుఁ దెలిసికొనినవాఁడే గురువు.

బ్రాహ్మణాఃక్షత్రియావైశ్యా శ్శూద్రాశ్చ వాంత్యజాతయః ।
శరీరాభ్యంతరే దేవి ! యో వీక్షేత భవే ద్గురుః ॥ 30

తా. బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్ర చండాలాది జాతులను శరీరమందుఁ దెలిసికొనినవాఁడే గురువు.

ఏవం విజ్ఞాయ హేదేవి ! గురుసేవాం చ కారయేత్ ।
గురు స్తుష్టో భవే ద్యస్య తస్య లాభం పదేపదే ॥ ౩౧

తా. ఇట్లు తెలిసికొని గురుసేవచేసి గురువును సంతోషపఱచినవానికిఁ గావలసినంత విద్యాలాభము గలుగును.

విద్యా గృహీత్వా సర్వా శ్చ సోఁచాసీనో భవే ద్యది ।
తత్ర తిష్ఠతి నజ్ఞానం యథా శిక్షితపక్షిణి ॥ ౩౨

* ఇత్యుమామహేశ్వర సంవాదే స్వరచింతామణౌ సింధోత్పత్తిర్నామ ద్వితీయోధ్యాయః.*

తా. 'గురువునొద్ద విద్యగ్రహించిన తరువాత గురువును అలక్ష్యము చేసిన యెడల "పక్షి, మాటలు నేర్పినవానిని విడిచి పక్షులగూడినపుడు ఆ మాటలు పనికిరానట్లు" వానికి అజ్ఞానము సంభవించును. విద్యఫలించదు.

---

## తృతీయోధ్యాయః.

స్వరోత్పత్తిం ప్రవక్ష్యామి శృణు దేవి ! సవిస్తరమ్ ।
సర్వేషాం ప్రాణినా మేష స్వరపవాదికారణమ్ ॥ ౧

తా. ఓపార్వతీ ! స్వరోత్పత్తిని సవిస్తరముగఁ జెప్పెదను వినుము. సకల ప్రాణులకును స్వరము ముఖ్యకారణము.

నాభే రధస్తా దూర్ధ్వం చ అంకురా ఇవ నిర్గతాః ।
ద్విసప్తతి సహస్రాణి దేహమధ్యే స్థితా స్సిరాః ॥ ౨

తా. నాభికి దిగువను మీఁదను మొలకలవలె బైలుదేరి డెబ్బదిరెండువేల నాడులు దేహమధ్యమునం దుండును.

తిర్య గూర్ధ్వ మధ శ్చైవ వ్యాప్య దేహం సమంతతః ।
చక్రవ త్సంస్థితా దేహే సర్వాః ప్రాణసమాశ్రయాః ॥ ౩

తా. అడ్డముగను పొడుగుగను క్రిందుగను దేహమాద్యంతము వ్యాపించి చక్రమువలెనే సకలమైన సిరలు తిరుగుచు ప్రాణము నాశ్రయించి యుండును.

నాభ్యధః కుండలీస్థానే భుజంగాకారనాడికా ।
ఊర్ధ్వగా దశ నాడ్యస్తు దశైవాధస్తు తాః స్థితాః ॥ ౪

**తా.** నాభికిదిగువ కుండలిస్థానమందు సర్పాకృతిగానొకనాడియు మీదుఁగా పదినాడులును క్రిందుగా పదినాడులును ఉండును.

తాసాం సూక్ష్మముఖీనాం తు మధ్యే చక్ర మనుత్తమమ్ ।
ఇడా చ పింగళాచైవ సుషుమ్నా చేతి తా స్త్రయః ॥ ౫

తా. సూక్ష్మముఖులగు ఆ నాడుల నడుమ ఉత్తమమైన చక్రమొకటియు న్నది, అందు ఇడా పింగళ సుషుమ్న అనుమూఁడునాడులు గలవు.

తాసాం సూక్ష్మముఖీనాం తు మధ్యే స్యు దశనాడికాః ।
ఇడా చ పింగళాచైవ సుషుమ్నా చ తతఃపరమ్ ॥ ౬
గాంధారీ హస్తిజిహ్వా చ పూషలం భూషితం తథా ।
కుహూకా శంఖినీచాథ శారదేతి సమాసతః ॥ ౭
ఏతాని దశనాడీనాం నామాని కథితాని తే ।
ఇడా చ పింగళాచైవ సదా వహతి మారుతమ్ ॥ ౮

తా. ఆనాడులలో సూక్ష్మముఖు లగుముఖ్యమైననాడులు పదియున్నవి, అవి ఇడ పింగళ సుషుమ్న గాంధారి హస్తిజిహ్వా పూషలము భూషితము కుహూక శంఖిని శారద యను పేళ్లుగలవి. వానిలో ఇడాపింగళానాడులు వాయువునెల్లపుడు వహించి యుండును.

సుషుమ్నా కాలమార్గేణ బ్రహ్మరంధ్రే వహే త్సదా ।
పూషలం భూషితం చైవ చక్షుః పూర్వాం వహే త్సదా ॥ ౯

తా. సుషుమ్నానాడి కాలమార్గముచే బ్రహ్మరంధ్రమందుండును. పూషలము భూషితము అనునవి నేత్రములయందుండును.

గాంధారీ హస్తిజిహ్వా చ కర్ణద్వారే వహే త్సదా ।
కుహూకా గుదమధ్యే చ శంఖినీ లింగరంధ్రకే ॥ ౧౦

తా. గాంధారి హస్తిజిహ్వా ఈ రెండును చెవిద్వారమందుండును, కుహూక గుదమందుండును. శంఖిని లింగరంధ్రమందుండును.

ముఖద్వారే శారదా చ వహతీ నాత్రసంశయః ।
ఏతాని నాడీస్థానాని కథితాని వరాననే ! ॥ ౧౧

తా. శారద నోటియందుండును. ఓపార్వతీ! యీ క్రమమున పదినాడులస్థానములు చెప్పఁబడినవి.

ప్రాణోఽపాన స్సమానశ్చో దానవ్యానౌ తతఃపరమ్ ।
నాగ శ్చ కూర్మః కృకరో దేవదత్తో ధనంజయః ॥ ౧౨
ఏతాని దశ వాయూనాం నామాని కథితాని తే ।
వాయూనాం స్థానకర్మాణి కథయామి తవ ప్రియే ! ॥ ౧౩

తా. ప్రాణము అపానము సమానము ఉదానము వ్యానము నాగము కూర్మము కృకరము దేవదత్తము ధనంజయము ఇవి దశవాయువులు. ఓ ప్రియురాలా ! వీనిస్థాన కర్మములను నీకుఁ జెప్పెదను.

తేషాం ముఖ్యతరః ప్రాణో నాభికందరసంస్థితః ।
చరత్యానననాసే చ నాభౌ హృదయపంకజే ।
శబ్దోచ్చారణ నిశ్శ్వాసో చ్ఛ్వాస కాసాదికారణమ్ ॥ ౧౪

తా. ఆ పదినాడులలో ముఖ్యమైన ప్రాణవాయువు నాభిగుహాయందుండినదై, ముఖము నాసిక హృదయము నాభి ఈ నాలుగుస్థలముల సంచరించును. నాభియందు శబ్దము, నోటియందు ఉచ్చారణము, ముక్కున ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములు, హృదయమునందు దగ్గు వీనిని పుట్టించును.

అపాన స్తు గుదే లింగే కటిజంఘాంతరే శుభే ! ।
నాభికందే వృషణయో రూరుజానౌ చ తిష్ఠతి ।
అస్య మూత్రపురీషాదివిసర్గః పరికీర్తితః ॥ ౧౫

తా. అపానవాయువు, పిరుదులు పిక్కలు వీనికి మధ్యభాగమునను, గుదము లింగము నాభి వృషణము తొడలు మోకాళ్లు అనునీస్థానములయందును ఉండును. ఈ యపానవాయువు మూత్రపురీషముల వెడలగొట్టును.

వ్యానోఽక్షిశ్రోత్ర గుల్ఫేషు కట్యాం ఘ్రాణే చ తిష్ఠతి ।
ప్రాణాపాన పరిత్యాగ గ్రహణౌ యస్య కర్మ చ ॥ ౧౬

తా. వ్యానవాయువు కన్నులు చెవులు కాలిమడిమలు పిరుదు ముక్కు ఈస్థానములయందుండును. ఈ వ్యానవాయువు ప్రాణాపానవాయువులను వెలుపలికి పోవునట్లును లోపలికి వచ్చునట్లును చేయుచుండును.

సమానో నాభిదేశే తు స్థిత్వా జాఠరసంయుతః ।
ద్విసప్తతిసహస్రేషు నాడీరంధ్రేషు తిష్ఠతి ।
భుక్తపీతరసా౯ సమ్య గానాయ్య దేహపుష్టికృత్ ॥ ౧౭

**తా.** సమానవాయువు - శరీరమందు నాభిస్థానమందుండి జఠరాగ్నితోఁగూడి డెబ్బదిరెండువేల నాడీరంధ్రములయందు ఉండును. భుజింపఁబడినవియు త్రాగఁబడినవియునైన పదార్థముల రసములను దేహమున వ్యాపింపఁజేసి దేహపుష్టిని గలుగజేయును.

ఉదానః కంఠవసతి ర్వ్యా స్తయో రంగసంధిషు ।
కర్మాస్య దేహ్యానయనో త్క్రమణాది ప్రకీర్తితమ్ ॥ ౧౮

**తా.** ఉదానవాయువు కంఠమందుండి చేతులు కాళ్లు మొదలైన అంగసంధుల యందు వ్యాపించి, చాచుట, ముడుచుట, కదలుట మొదలగు వ్యాపారములఁ జేయుచుండును.

ఘోషే ధనంజయో జ్ఞేయః కథనే నాగనామకః ।
జృంభణే దేవదత్తశ్చ క్షుతే చ కృకర స్తథా ।
ఉన్మీలనే భవే త్కూర్మో దశైవం మారుతా మతాః ॥ ౧౯

*ఇత్యుమామహేశ్వర సంవాదే స్వరచింతామణౌ స్వరోత్పత్తిర్నామ
తృ తీ యో ధ్యా యః.*

**తా.** ఘోషము ధనంజయుము వలనను, మాటలాడుట నాగమువలనను, ఆవులింత దేవదత్తుఁ వలనను, తుమ్ము కృకరమువలనను, కన్నుమూసి తెఱచుట కూర్మము వలనను, గలుగునని యెఱుంగవలయు.

---

చ తు ర్థో ధ్యా యః.

అథ వక్ష్యే మహాదేవి! కాలస్య మాన ముత్తమమ్ ।
శ్వాసనిశ్వాసభేదేన జ్ఞాతవ్యం చ సదా బుధైః ॥ ౧

**తా.** ఓపార్వతీ! ఇఁక కాలప్రమాణమును చెప్పెదను. అది శ్వాసనిశ్వాస భేదమువలన నెల్లప్పుడు పెద్దలచేత తెలియఁదగినది.

శ్వాసశ్చాంత స్థి్నతః ప్రాణ షడ్భిః ప్రాణైః ఫలం స్మృతమ్ ।
ఫలానాం షష్టి రేవ స్యాత్ ఘటికా కాలదుందుభిః ॥ ౨

**తా.** లోపలికిబోయి వెలుపలికివచ్చు శ్వాసము ప్రాణమనఁబడును. ఆ ప్రాణములు ౬ ఫలమనఁబడును. ఆ ఫలములు ౬౦ ఘటిక అగును. ఇదికాలదుందుభియనబడును.

ప్రాణానా మధికం షష్టి ఘటికా చ శతత్రయమ్ ।
భవే ద్దైవ ప్రహరః ప్రాణశతానాం సప్తవింశతిః ॥ 3

**తా. ఆ కాలదుందుభిగడియకు ప్రాణములు ౩౬౦. ఒకఝాముకు అట్టి ప్రాణ ములు ౨౩౦౦.**

ఘటికాభి రహోరాత్రం షష్టిభి శ్చైవ జాయతే।
దినం త్రింశద్ఘటీభి స్తు నిశా త్రింశద్భి రుచ్యతే॥ ౪

తా. అట్టి గడియలు ౬౦ ఒక అహోరాత్రము. అవి పగటియందు ౩౦ గాను రాత్రియందు ౩౦ గాను విభాగింపఁబడియున్నవి.

మాస స్త్రింశదహోరాత్రం ఋతు రేకో ద్విమాసతః।
ఋతుభి ష్షడ్భి రబ్ద స్స్యా ద్దయనం ఋతుభి స్త్రిభిః॥ ౫

తా. అట్టి దినములు ౩౦ కూడినదొక నెల. ౨ నెలలు ౧ ఋతువు. ౩ ఋతువులు ౧ అయనము. ౬ ఋతువులు ౧ సంవత్సరము.

అహ్నాం షష్ట్యధికాని స్యాత్ శతాని త్రీణి వత్సరః।
మాససంక్రాంతయో వాపి ద్వాదశైవ ప్రకీర్తితాః॥ ౬

తా. ఒక సంవత్సరమునకు ౩౬౦ దినములు. మాససంక్రాంతులు ౧౨.

శతై ష్షడ్భి శ్చ యుక్తాని సహస్రా ణ్యేకవింశతిః।
ఘటికా వత్సరే పూర్ణే వదంతి కాలవేదినః॥ ౭

తా. ఒక సంవత్సరమునకు ౨౧౬౦౦ గడియలని కాలవేత్తలు వచింతురు.

మాసో య స్తు మనుష్యాణాం భవే త్పక్షద్వయాత్మకః।
త త్పితౄణా మహోరాత్రం వేదితవ్యం ప్రయత్నతః॥ ౮

తా. శుక్లకృష్ణపక్షములు రెండును చేరిన మనుష్యులకు ౧ నెల, ఆ నెల పితృదేవతలకు ౧ దినము.

యో వత్సరో మనుష్యాణా మయనద్వయసంయుతః।
దేవానాం త దహోరాత్రం వేదితవ్యం ప్రయత్నతః॥ ౯

తా. రెండు అయనములు గూడిన మనుష్యులకు ౧ సంవత్సరము. అది దేవతలకు ఒక దినము.

చతుర్యుగసహస్రాణి దినం సృష్టికృతో భవేత్।
తావ న్తి చ నిశా స్తద్వత్ సర్వసంహారకారణమ్॥ ౧౦

తా. కృత త్రేతా ద్వాపర కలియుగములు నాలుగును వేయిమార్లుమారిన బ్రహ్మకు ఒక పగలు, ఇట్లు తిరుగా మారిన యెడల ఒక రాత్రి, అది సంహారకాల మనఁబడును.

క్షీయంతే మనవ స్సర్వే పతంతీంద్రా శ్చతుర్దశ ।
ప్రళయం యాంతి భూతాని బ్రహ్మణో దివసం తదా ॥ ౧౧

తా. ౧౪ మనువులు. ౧౪ ఇంద్రులు, సకల ప్రాణులు, ఆ బ్రహ్మదినమందు నాశమును బొందుదురు.

చతుర్యుగసహస్రాభ్యా మహోరాత్రం భవే త్తథా ।
ఏవం బ్రహ్మ జగత్కర్తా శతవర్షాణి జీవతి ॥ ౧౨

తా. నాలుగు యుగములు రెండువేలమార్లు మారిన బ్రహ్మకు ఒకదినము. ఈ క్రమమున బ్రహ్మ నూఱుసంవత్సరములు బ్రతుకును.

బ్రహ్మణో జీవితాంతేన వైష్ణవం చ భవే ద్దినమ్ ।
ఏవంవిధం స విష్ణు శ్చ శతవర్షాణి జీవతి ॥ ౧౩
విష్ణో శ్చ జీవితాంతేన రుద్రస్య దివసో భవేత్ ।
ఏవంవిధం మహాదేవ శ్శతవర్షాణి జీవతి ॥ ౧౪

తా. ఇట్టి బ్రహ్మజీవితము విష్ణువునకు ఒకదినము, ఈప్రకారము విష్ణువు నూఱు సంవత్సరములు బ్రతుకును, ఇట్టి విష్ణు జీవితకాలము రుద్రుని కొకదినము, ఈ క్రమమున రుద్రుఁడు నూఱు సంవత్సరములు బ్రతుకును.

కల్పో బ్రహ్మదినం ప్రోక్తం మహాకల్పో హరేర్దినమ్ ।
ఆదికల్పో మహాశంభో రేవం కాలపరంపరా ॥ ౧౫

తా. బ్రహ్మప్రళయము కల్పమనఁబడును. విష్ణు ప్రళయము మహాకల్పము. రుద్రప్రళయము ఆదికల్పము, ఈ క్రమమున కాలగతి నడుచుచుండును.

అథ కిం బహునోక్తేన యావత్సంఖ్యా ప్రవర్తతే ।
తావత్కాలం భయం పుంసా మితి శాస్త్రస్య నిశ్చయమ్ ॥ ౧౬

తా. ఓ పార్వతీ ! వేయిమాటలేల ? మనుష్యునకు జీవితకాలమువఱకు భయము గలిగి యుండును. ఇది శాస్త్రనిశ్చయము.

ఉక్తం బాహ్యా మహోరాత్రం యత్ప్రమాణం మనీషిభిః ।
దృష్ట మాభ్యంతరం వర్షం తత్సమం తత్త్వవేదిభిః ॥ ౧౭

తా. దివారాత్రులయొక్క ప్రమాణము పెద్దలచేత ఎట్లు చెప్పఁబడినదో అట్లే శరీరతత్త్వంబును తత్త్వవేదులచేత చెప్పఁబడియున్నది.

షష్టి ర్ఘటీ భవేత్ప్రాణా అహోరాత్రం తు షష్టిభిః ।
త్రింశద్దినం తు మాస స్స్యా ద్రుతు ర్మాసద్వయో మతః॥ ౧౮

తా. ౬౦ ప్రాణములు ౧ గడియ, ౬౦ గడియలు ౧ దినము, 30 దినములు ౧ నెల, ౨ నెలలు ౧ ఋతువు.

వర్ష ష్షడృతవో జ్ఞేయః మాసై ర్ద్వాదశభిః స్మృతః ।
సంక్రాంతయ శ్చాయనే చ కులీరమకరాదితః ॥ ౧౯

తా. సంవత్సరములకు ఋతువులు ౬, నెలలు ౧౨, సంక్రాంతులు ౧౨, కటకాది దక్షిణాయనము, మకరాది ఉత్తరాయణము.

చర స్థిర ద్విస్వభావా మేషాద్యా రాశయః స్మృతాః ।
కుర్వంతి సర్వకార్యాణి స్వభావసదృశం ఫలమ్ ॥ ౨౦

తా. చరము స్థిరము ఉభయము అని మేషాదిరాసులు 3 విధములుగానుండును అన్ని కార్యములును ఆరాశిస్వభావము గలిగియుండును.

ఘటీభిః పంచభి ర్మాసః పంచభి స్సంక్రమం భవేత్ ।
ఋతవో దశ విజ్ఞేయా స్త్రింశద్భి రయనం తథా ॥ ౨౧

తా. ౫ గడియలు ౧ నెల, ఆదియె సంక్రాంతి అనబడును, ౧౦ గడియలు ఋతువు అనఁబడును. 30 గడియలు అయన మనఁబడును.

అయనద్వయసంయుక్తో వర్ష స్స్యాత్ షష్టినాడికాః ।
చైత్రం మేషాదితః కృత్వా క్రమేణైవం విచింతయేత్ ॥ ౨౨

తా. రెండయనములు ఒక సంవత్సరము-అది ౬౦ గడియలు, చైత్రము నెల-మేషమాసము, ఈ క్రమముగ ౧౨ సంక్రాంతులు కూడిన నొక సంవత్సరము, అనఁగా ఉదయము మొదలు ౫ గడియలు చైత్రమాసము, ఇట్లే తక్కిన వానిని చూచుకొనునది.

వసంతో గ్రీష్మవర్షా శ్చ శర ద్ధేమంత శ్శిశిరాః ।
షడృతుష్వేవ మేషాదిరాశయ శ్చైత్రమాసతః ॥ ౨౩

తా. వసంతము గ్రీష్మము వర్షము శరత్తు హేమంతము శిశిరము ఈ ౬ ఋతువులయందు చైత్రాదిమాసములకు క్రమముగ మేషాదిమాసములజేర్చికొనవలయును.

పూర్వాహ్ణే చైత్రవైశాఖా వసంతో ఘటికా దశ ।
జ్యేష్ఠాషాఢౌతు మధ్యాహ్నే గ్రీష్మకాలో విధీయతే ॥ ౨౪

తా. పూర్వాహ్ణమునందు ౧౦ గడియలవఱకు చైత్ర వైశాఖమాసములు. అది వసంతఋతువు. మధ్యాహ్నమున ౧౧ గడియలు మొదలు ౨౦ గడియలవఱకు జ్యేష్ఠాషాఢమాసములు అది గ్రీష్మకాలము.

నభో భాద్రపదౌ వర్షా పరాహ్ణే ఘటికా దశ।
ఆశ్వినః కార్తికో మాసః పూర్వరాత్రే తు శారదః॥ ౨౫

తా. అపరాహ్ణమునందు ౨౧ గడియ మొదలు సాయంకాలమువఱకు శ్రావణ భాద్రపదమాసములు అది వర్షఋతువు, రాత్రి ౧౦ గడియలు ఆశ్వయుజ కార్తిక మాసములు అది శరత్కాలము.

మార్గశీర్ష స్తథా పుష్యో హేమంతో రాత్రిమధ్యతః।
శిశిరో రాత్రిపర్యంతం మాఘఫాల్గునసంయుతః॥ ౨౬

తా. మధ్యరాత్రి పది గడియలు మార్గశిరము పుష్యము ఇది హేమంతఋతువు, అపరరాత్రి ౧౦ గడియలు మాఘ ఫాల్గునములు ఇది శిశిరఋతువు.

విషూవతి తథా చైత్రే జాయతే మేషసంక్రమః।
వైశాఖే వృషసంక్రాంతి జ్యేష్ఠే మిథునసంక్రమః॥ ౨౭

తా. చైత్రమాసము విషువనఁబడును, అందు మేషసంక్రమణము గలుగును, వైశాఖమందు వృషసంక్రాంతి, జ్యేష్ఠమందు మిథున సంక్రాంతియు గలుగును.

ఆషాఢే కర్కటో జ్ఞేయః ప్రోచ్యతే దక్షిణాయనమ్।
శ్రావణే సింహసంక్రాంతి ర్నభస్యే స్యాచ్చ కన్యకా॥ ౨౮

తా. ఆషాఢమాసమునందు కటక సంక్రాంతి, అది దక్షిణాయన మనఁబడును, శ్రావణమాసమునందు సింహసంక్రాంతి, భాద్రపదమాసమునందు కన్యాసంక్రాంతియు గలుగును.

ఆశ్వినే విషువత్యేవం తులాసంక్రాంతి రుచ్యతే।
కార్తికే వృశ్చికః ఖ్యాతః మార్గశీర్షే ధనుః స్మృతమ్॥ ౨౯

తా. ఆశ్వయుజమాసమునందు తులాసంక్రాంతి, అది విషువనఁబడును. కార్తిక మాసమునందు వృశ్చికసంక్రాంతి. మార్గశిరమాసమునందు ధనుస్సంక్రాంతి.

పుష్యే మకరసంక్రాంతి రుత్తరాయణసంజ్ఞికా।
మాఘే చ కుంభసంక్రాంతిః ఫాల్గునే మీనసంక్రమః॥ ౩౦

తా. పుష్యమాసమునందు మకరసంక్రాంతి, అది ఉత్తరాయణ మనఁబడును. మాఖ మాసమునందు కుంభ సంక్రాంతి, ఫాల్గునమాసమునందు మీనసంక్రాంతియు గలుగును.

సంక్రాంతిశిశిరాది శ్చ షష్ఠాధ్యాయే ప్రకీర్త్యతే ।
తాభిః కాలం పరీక్షేత యోగ్యః పంచదినావధి ॥ ౩౧

తా. సంక్రాంతి - శిశిరఋతువు మొదలగునవి ఆఱవ అధ్యాయమందుఁ జెప్పఁ బడును. ఆ సంక్రాంత్యాదులవలన ౫ దినములు పరిమాణముగల కాలమును తెలిసికొన వలయును.

చైత్రసంక్రాంతి మారభ్య యస్య పంచదినావధి ।
దక్షిణే వహతి ప్రాణ షష్టివర్షాణి జీవతి ॥ ౩౨

తా. చైత్రసంక్రాంతి మొదలు ౫ దినములు సూర్యస్వరము నడిచెనేని * ౬౦ సంవత్సరములు ఆయుస్సు.

జ్యేష్ఠమాసస్య సంక్రాంతౌ పంచరాత్రం దివాకరః ।
దృశ్యతే య ద్యథోక్తం చ నవతివర్షాణి జీవతి ॥ ౩౩

తా. జ్యేష్ఠ సంక్రాంతి మొదలు ౫ దినములు సూర్యస్వరము నడిచిన ? ౯౦ సంవత్సరములు ఆయుస్సు.

యథా శ్రావణసంక్రాంతౌ పంచాహం వర్తతే రవిః ।
తథా ద్వాదశవర్షాంతే కాష్ఠశయ్యాం సమాశ్రయేత్ ॥ ౩౪

తా. శ్రావణసంక్రాంతి మొదలు ౫ దినములు సూర్యస్వరము నడిచిన ౧౨ సంవత్సరములు ఆయుస్సు.

ఆశ్వినస్య చ సంక్రాంతౌ పంచాహాని చ భాస్కరః ।
వహతే యస్య తస్యాయు స్సమాః పంచదశ స్మృతాః ॥ ౩౫

తా. ఆశ్వయుజ సంక్రాంతి మొదలు ౫ దినములు సూర్యస్వరము నడిచిన ౧౫ సంవత్సరములు ఆయుస్సు.

మార్గశీర్షస్య సంక్రాంతౌ పంచాహాని చ భాస్కరః ।
వహతే యస్య తస్యాయు స్సమా స్సప్తదశ స్మృతాః ॥ ౩౬

తా. మార్గశిర సంక్రాంతి మొదలు ౫ దినములు సూర్యస్వరము నడిచిన ? ౧౭ సంవత్సరములు ఆయుస్సు.

---

*?ఆఱుసంవత్సరములని మఱియొక గ్రంథమునందుఁ జెప్పఁబడినది. ? తొమ్మిది అని, కొన్నిగ్రం. ? ౭ అని కొ.

మాఘసఙ్క్రాంతి మారభ్య పంచరాత్రం సమీరణః ।
వహతే యస్య తస్యాయు ర్వత్సరత్రయ మీరితమ్ ॥ 3౭

తా. మాఘసంక్రాంతి మొదలు ౫ దినములు సూర్యస్వరము నడిచిన 3 సంవత్సరములు ఆయుస్సు.

ఏవం తు దైవయోగేన వహతే రోహిణీపతిః ।
తథైవ వివిధాః పీడా జాయంతే మరణం వినా ॥ 3౮

తా. ఈక్రమమున చంద్రస్వరము తక్కిన ౬ సంక్రాంతులయందు ౫ దినములు నడిచెనేని నానావిధములయిన వ్యాధులు పుట్టును, మరణముగలుగదు.

అనిర్దిష్టేషు మాసేషు సంక్రాంతిషు చరే చ్ఛశీ ।
ఏధతే తత్క్రమా దాయు శ్చంద్రేణ జయ మాత్మనః ॥ 3౯

తా. సూర్యునకుఁ జెప్పిన ౬ సంక్రాంతులయందును ౫ దినములు చంద్రస్వరము నడిచినయెడల ఈచెప్పిన సంవత్సరక్రమమున ఆయుస్సు వృద్ధిబొందును. జయము గలుగును.

మేష శ్చ మిథునం సింహ స్తులా చ కార్ముకో ఘటః ।
పవనో దక్షిణే మార్గే ప్రవర్తేత యథాక్రమమ్ ॥ ౪౦

తా. మేషము, మిథునము, సింహము, తుల, ధనుస్సు, కుంభము, ఈ ౬ సంక్రాంతులయందును సూర్యస్వరము కుడిప్రక్క నడుచును.

వృషః కర్కాటకః కన్యా వృశ్చికో మకరో ఝషః ।
ఏతేషా ముదయే నిత్యం వామమార్గేణ జాయతే ॥ ౪౧

తా. వృషభము, కర్కాటకము, కన్య, వృశ్చికము, మకరము, మీనము, ఈ ౬ సంక్రాంతులయందును చంద్రస్వరము ఎడమప్రక్కన నడుచును.

యస్మి న్మార్గే తు యా రాశి స్తద్రాశ్యాం చోదిత శ్శుభః ।
అన్యథా దుఃఖదః పుంసా మితి శాస్త్రస్య నిశ్చయమ్ ॥ ౪౨

తా. ఏరాశిసంక్రాంతికి ఏస్వరము చెప్పఁబడెనో ఆసంక్రాంతియందు ఆస్వరము ఉదయమయినయెడల శుభము. విపరీతముగ నయినయెడల పురుషులకు దుఃఖకరము. అని శాస్త్రనిశ్చయము.

ప్రాణో యస్య దశాహాని వామదక్షిణతః క్రమాత్ ।
సంక్రాంతిరహితో వాపి తస్యాయు స్సంక్రమావధి ॥ ౪౩

తా. ఎవనికి స్వరము సంక్రాంతినియమములేక ౧౦ దినములు ఇరుప్రక్కల సంచరించునో వానికి ఆసంక్రాంతిమొదలు మరుసంక్రాంతివఱకు ఆయుఃప్రమాణమని తెలియవలయును.

త్యక్త్వా సంక్రమణం యస్య మాస మేకం వహే త్ఖగః ।
మధ్యాహ్నే త్వరతో దేహీ స కాలస్య ముఖం విశేత్ ॥ ౪౪

తా. ఎవనికి స్వరము సంక్రమణమును విడిచి యొకనెల నడుచునో వానికి నెలమీఁద మధ్యాహ్నమునందు మరణము గలుగును.

సంక్రాంతౌ షోడశసు చే దహోరాత్రేషు నిష్ఫలమ్ ।
యదా సంక్రమతే వాయు రధోర్ధ్వం ప్రహరేఽపిచ ॥ ౪౫

తా. సంక్రాంతియందు ౧౫ దినములు ఱేయుంబగలు స్వరము నడచిన నిష్ఫలము. మఱియు ౧౬ దినములు ఱేయుంబగలు ఒకజాము నడచినను నిష్ఫలము.

బాహ్య మాభ్యంతరం చైవ కాలమానా దయం మతః ।
చంద్రభాస్కరవారేణ జాయతే ఖలు నాన్యతః ॥ ౪౬

* ఇత్యుమామహేశ్వరసంవాదే స్వరచింతామణౌ కాలప్రమాణ సంఖ్యానామ చతుర్థోఽధ్యాయః. *

తా. ఈస్వరము కాలప్రమాణమువలన బాహ్యమగు బ్రహ్మాండవ్యాప్తియు, అభ్యంతరమగు పిండాండవ్యాప్తియు గలిగియుండును. ఈ రెండును సూర్యచంద్రుల వలననే కలుగుచున్నవి.

---

## పంచమోఽధ్యాయః.

అథా త స్సంప్రవక్ష్యామి నాడీశుద్ధి మతఃపరమ్ ।
అజపాలక్షణం చైవ యోగలక్షణ ముత్తమమ్ ॥ ౧

తా. ఇఁక నాడీశుద్ధిని అజపాలక్షణమును, ఉత్తమమయిన యోగలక్షణమును బాగుగ జెప్పెదను.

రేచకం పూరకం చైవ కుంభకం చ యథాక్రమమ్ ।
జ్ఞాతవ్యం యోగిభి ర్నిత్యం స్వదేహశుద్ధికారణమ్ ॥ ౨

తా. యోగులగువారు 3 విధములయిన రేచక పూరక కుంభకములను స్వదేహశుద్ధికి ముఖ్యకారణములని యెఱుంగవలయు.

రేచయేత్సూర్యమార్గేణ చంద్రమార్గేణ పూరయేత్ ।
ఏవమభ్యస్య మనసా సంగ్రహే మోచనే క్షమః ॥ ౩

తా. సూర్యమార్గమగు కుడిముక్కున శ్వాసమువిడిచిన రేచక మనఁబడును. చంద్రమార్గమగు నెడమముక్కున వాయువునుపట్టి నిలిపిన పూరకమనఁబడును. ఈ క్రమమున మనస్సుచే నభ్యసించి వాయువును గ్రహించుటయందును విడుచుటయందును సమర్థుఁడుగ నుండవలయును.

వామ స్సోమాత్మకః ప్రోక్తో దక్షిణో రవిసంభవః ।
మధ్యమ శ్చ భవే దగ్నిః జ్వలంతి కామరూపిణః ॥ ౪

తా. ఎడమముక్కు శ్వాసము చంద్ర స్వరము, కుడిముక్కు శ్వాసము సూర్య స్వరము. రెండు ముక్కులనుండి యేకకాలమున వెడలెడిశ్వాసము అగ్ని స్వరము ఇది పైరెంటికి నాధారంబై కామరూపమును ధరించి వృద్ధి జేయును.

తమో రజశ్చ సత్త్వంచ రుద్రో బ్రహ్మ హరిః క్రమాత్ ।
రేచపూరకయోశ్చాపి కుంభకస్యాధిదేవతాః ॥ ౫

తా. తమోగుణప్రధానుఁ డగు రుద్రుఁడు రేచకమునకును, రజోగుణప్రధానుఁ డగు బ్రహ్మ పూరకమునకును, సత్త్వగుణప్రధానుఁ డగు విష్ణువు కుంభకమునకును అధిదేవతలు.

సంహారో రేచకశ్చైవ ఉత్పత్తిః పూరక స్తతః ।
కుంభక స్థితి రిత్యుక్త ఇత్యేవం వరవర్ణిని ! ॥ ౬

తా. ఓయుత్తమురాలా ! రేచకము సంహారము, పూరకము ఉత్పత్తి. కుంభకము స్థితి యని యీక్రమముగ నెఱుంగవలయు.

బద్ధపద్మాసన స్స్వస్థో బద్ధమధ్యోడ్డియాణకః ।
రేచయే త్సహజం వాయుం యథాశక్తి ప్రయత్నతః ॥ ౭

తా. నడుమును బిగించికొని పద్మాసనమందు జక్కగ గూర్చుని సహజముగా తన సత్తువకొలఁది వాయువును రేచకము చేయవలయును.

అనామికా కనిష్ఠాభ్యాం వామరంధ్రం పిధాయ చ ।
నాసాయా దక్షిణం రంధ్ర మంగుష్ఠే నైన యోజయేత్ ॥ ౮

తా. కనిష్ఠా నామి కాంగుళుల చేతను ముక్కుయొడమరంధ్రమును అణచిమూసి తనఅంగుష్ఠము(బొటనవ్రేలి)చేతకుడిముక్కుమీఁదికిఁగీసి వాయువునుబంధించవలయును.

సారిత ష్షోడశగతః కోష్ఠశ్వాస శ్శనై శ్శనైః ।
స రేచక ఇతి ప్రాజ్ఞైః ఫణితం పవనే గతిః ॥ ౯

తా. శరీరమందున్న వాయువు మెల్లన ప్రయత్నముచే షోడశాంగుళ ప్రమాణము బైలుదేరునట్లు చేసిన వాయుగతిని రేచకమని ప్రాజ్ఞులు చెప్పుదురు.

రేచకం హరతే పాపం కృతం సర్వం పదేపదే ।
వశ్యాకర్షణ సంగ్రామ లయ భేదం చ సాధయేత్ ॥ ౧౦

తా. రేచకముచేసిన పాపములు పోవును. వశ్యము ఆకర్షణము యుద్ధము లయము భేదనము మొదలగు కార్యముల సాధింపవచ్చును.

బాహ్యేనవాయునాదేహం ధృతిమా న్పూరయే ద్భృశమ్ ।
సర్వావయవసంపూర్ణం పురాణైః పూరకః స్మృతః ॥ ౧౧

తా. ధైర్యముగల పురుషుఁడు వెలుపటి వాయువుచే దేహమును సర్వావయవములు నిండునట్లు దృఢముగ పూరించిన యెడల అది పూరకమనఁబడును.

ద్వాదశాంతం సమాకృష్య య స్సమీరః ప్రపూర్యతే ।
స పూరక ఇతి ప్రోక్తో మయా దేవి ! విశేషతః ॥ ౧౨

తా, ౧౨ అంగుళముల వఱకు వాయువును బిగియబట్టి లోపలనిండునట్లు గట్టిగా పూరించినయెడల అది పూరకమని తెలిసికొనుము.

పూరకః కురుతే పుష్టిం ధాతుసౌమ్యం తథైవ చ ।
బలవర్ణే దీపనం చ పురుషత్వం ప్రదాపయేత్ ॥ ౧౩

తా. పూరకము పుష్టి, ధాతు సౌమ్యము, బలము, దేహకాంతి, అగ్నిదీపనము పుంస్త్వము వీని నిచ్చును.

నిరుధ్య సుస్థిరం వాయుం స్వస్థానం నాభిపంకజే ।
కుంభయే న్నిర్భయం సోఽయం కుంభకః పరికీర్తితః ॥ ౧౪

తా. వాయువును నాభిపంకజమందు స్థిరముగానిలిపి అత్యంతసత్వముగా వాయువును వెడలనీక పట్టుట కుంభకమని చెప్పఁబడును.

న ముంచతి న గృహ్ణాతి వాయు మంతర్బహిస్థితమ్ ।
ఆపూర్య కుంభకే తిష్ఠే దచలస్థిత కుంభవత్ ॥ ౧౫

తా. బయటి వాయువును లోపలికి, లోపలి వాయువును బయటికి రానీయక నిలిపి, కదలని కుంభమువలె నుండుట కుంభకమనఁబడును.

కుంభకం తు విషం హంతి కరో త్యగ్నిబలం తథా।
దోషం హంతి పచ త్యన్నం నాత్ర కార్యా విచారణా॥ ౧౬

తా. కుంభకము విషమును విఱుచును. అగ్నిదీపనము గలుగఁజేయును. సర్వదోషములను హరించును. అన్నమును జీర్ణింపఁజేయును సందియములేదు.

జ్వరార్తౌ చాంగబాధాయాం శూలేవా జీర్ణకే సదా।
నిరోధం తనుతే నూనం శీతార్తేవాపి సర్వదా॥ ౧౭

తా. జ్వరబాధ దేహమునొప్పులు ఉదరశూల అజీర్ణము శరీరశైత్యము ఈరోగములయందు కుంభకము జేసినయెడల నివర్తించును. నిశ్చయము.

నద్యా మపి తటాకే వా అన్యే వా శీతలోదకే।
న మజ్జతి నిరోధజ్ఞః బద్ధపద్మాసనోఽపి సన్॥ ౧౮

తా. నదులు, చెరువులు, గుంటలు, నడబావులు మొదలయిన వానియందు వాయునిరోధము చేసినపురుషుఁడు పద్మాసనుఁడయి కూర్చుండినను నీళ్లలో మునుఁగఁడు.

హకారో నిర్గమే ప్రోక్త స్సకారోఽంత ప్రవేశనే।
హకారరూప శ్శంభుశ్చ సకార శ్శక్తిరూపవాన్॥ ౧౯

తా. స్వరము పోవునపుడు హకారమును, స్వరముప్రవేశించునపుడు సకారమును ఉచ్చరింపవలయును. హకారము శివరూపము. సకారము శక్తిరూపము.

ఏకవింశతి సాహస్రం షట్శతానీ త్యహర్నిశమ్।
వహతే మనుజానాం చ సాజపా పాపనాశినీ॥ ౨౦

తా. దివారాత్రిళ్లు ౨౧౬౦౦ జపమును మనుష్యులు చేయవలయును. ఆ అజప పాపమును నశింపఁజేయును. సద్గురూపదేశమునుపొంది ఈక్రమముగ జపించవలయును.

ఊర్ధ్వం చంద్రో హ్యధ స్సూర్యో మధ్యేచైవ నిరాకృతిః।
గతే చంద్రే చ సూర్యే చ తదేవ పరమం పదమ్॥ ౨౧

తా. పొడుగున జంద్రుఁడు, దిగువను సూర్యుఁడు, మధ్యమందు నిరాకారము. సుషుమ్నా సూర్యచంద్రుల సంయోగము పరమపదము అనఁబడును.

చంద్రసూర్యనిరోధజ్ఞో వాయుసంగ్రహణే రతః।
చంద్రే సూర్యం వినిఃక్షిప్య శోధయే చ్చంద్రమండలమ్।
ఏవ మభ్యస్యమానస్య జరామరణనాశనమ్॥ ౨౨

తా. సూర్య చంద్ర స్వరనిరోధముల దెలిసినవాఁడు వాయువును సంగ్రహించి చంద్రునియందు సూర్యుని నిలిపి చంద్రమండలమును శోధింపవలయు. ఈ క్రమమున అభ్యాసము చేసిన వానికి జరామరణములు గలుగవు.

చంద్రాదిత్యౌ జితౌ యేన గురో రభ్యాసయోగతః।
కాలోఽపి వంచిత స్తేన నాస్తి తస్యా న్యథాగతిః॥ ౨౩

*ఇ త్యుమామహేశ్వర సంవాదే స్వరచింతామణౌ
నాడీ శుద్ధ్యజపాలక్షణం నామ
పంచమో ధ్యాయః. *

తా. గురూపదేశాభ్యాసములవలన చంద్రసూర్య స్వరగతుల నభ్యసించిన వాఁడు కాలమును జయించును. అట్టియోగికి నింతకంటె నుత్తమగతి యేదియులేదు.

---

## షష్ఠో ఽధ్యాయః.

స్వరకర్మ ప్రవక్ష్యామి శృణు దేవి! సమాహితా।
చంద్రే సూర్యేచ కర్తవ్యే క్రమా ద్వక్ష్యామి సాంప్రతమ్॥ ౧

తా. ఓపార్వతీ! ఇఁక స్వరకర్మమును మొదట జెప్పెదను. చంద్రసూర్య స్వరములయందుజేయదగిన ప్రకారములను క్రమముగ జెప్పెదను ఏకచిత్తముగావినుము.

స్థిరకర్మ ణ్యానుకూల్యే ద్యూతే యానే చ సంగరే।
శాంతికే పౌష్టికే చోపనయనే చార్థసంగ్రహే॥ ౨
గృహప్రవేశే రాజ్ఞాం చ దర్శనే బీజవాపనే।
దేవతాది ప్రతిష్ఠాసు వివాహాదిషు కర్మసు॥ ౩
శుభకర్మసు సంధౌ చ వస్త్రాలంకారభూషణే।
యోగాభ్యాసాది కార్యేషు దివ్యౌషధరసాయనే॥ ౪
విషార్తి జ్వర మూర్ఛాసు సజ్జనానాంచ బోధనే।
ఇత్యాది శుభకార్యేషు ప్రశస్తో హి నిశాకరః॥ ౫

తా. స్థిరకర్మములు, అనుకూల్యము, జూదము, ప్రయాణము, యుద్ధమునకు బోవుట, శాంతిక పౌష్టికములు, ఉపనయనము, అర్థసంగ్రహము, గృహప్రవేశము, రాజదర్శనము, విత్తులుచల్లుట, దేవతాప్రతిష్ఠ, వివాహాది శుభకర్మములు, సంధి, వస్త్రాలంకారము, భూషణములు, యోగాభ్యాసకార్యము, ఔషధ లేహ్య తైల చూర్ణములు, విషచికిత్స, జ్వరదోష మూర్ఛా చికిత్స, సజ్జన భాషణము ఇవి మొదలయిన కార్యములను చంద్రస్వరమునందుఁ జేయవలయు.

విద్యారంభే చ దీక్షాయాం సేవా వాణిజ్యకర్మణి।
శస్త్రాభ్యాసేఽపి యుద్ధేఽపి ద్యూతే భేదే చ చౌర్యకే॥ ౬
వాహనే గజవాజీనాం రథయంత్రాది శిల్పకే।
లిపిలేఖన గీతాదౌ మంత్ర యంత్రాది సాధనే। ౭
నియుద్ధే భేషజే శాస్త్రే స్త్రీణాం చైవ ప్రసంగకే।
సర్వవిక్రయ పణ్యేషు స్నాన భోజన సంగమే॥ ౮
ఉదారదానధర్మేషు మారణోచ్చాటనాదిషు।
మోహన స్తంభనాద్యేషు సూర్య స్స్వరస్త్వత్ర యుజ్యతే॥ ౯

తా. విద్యారంభము, దీక్ష, కొలువు, వ్యాపారము, శస్త్రాభ్యాసము, యుద్ధము, జూదము, భేదముగలుగజేయుట, దొంగిలించుట, పల్లకి ఏనుఁగు గుఱ్ఱము వీనినెక్కుట, రథయంత్రాది శిల్పము, వ్రాయుట, చిత్రములు వ్రాయుట, సంగీతము పాడుట, యంత్రమంత్రాదిసాధనము, రక్షాబంధనము, ఉచ్చాటనము, బాహుయుద్ధము, వైద్యమునభ్యసించుట, సుందరస్త్రీలతో ప్రసంగము, సకలవస్తుక్రయము చేయుట, స్నానము, భోజనము, స్త్రీసంగమము, ఉదారత్వము, దానము, ధర్మము, మారణము, ఉచ్చాటనము, మోహనము, స్తంభనము, ఇవిమొదలైనకార్యములనుసూర్యస్వరమునజేయవలెను.

అన్యద్రహస్యం వక్ష్యామి శృణు దేవి! సమాహితా।
స్వరజ్ఞానంతు యో వేత్తి సర్వజ్ఞస్స తు కథ్యతే॥ ౧౦

తా. ఓపార్వతీ! మఱియొక్క రహస్యము చెప్పెదను వినుము. స్వరజ్ఞానము నెఱింగినవాఁడు సర్వజ్ఞుఁడగును.

దైవజ్ఞేన వినా రాజ్యం వినా మూలేన యస్తరుః।
వినా స్నేహేన యజ్జ్యోతి ర్వినా భావేన కామినీ॥ ౧౧

తా. దైవజ్ఞుండులేని రాజ్యము, వేరులేని చెట్టును, నూనెలేని దీపమును, ప్రీతిలేని స్త్రీయును ప్రకాశింపరు.

ఏతే సర్వే న శోభంతే సర్వజ్ఞశ్చైవ శోభతే।
తస్మాత్సర్వజ్ఞవిజ్ఞానం లక్షణైః కథయామ్యహమ్॥ ౧౨

తా. క్రిందజెప్పిన వన్నియు శోభించవు. అట్లే స్వరజ్ఞానము లేనివాఁడు శోభింపఁడు. సర్వజ్ఞుఁడొక్కఁడే శోభించుచున్నాఁడు కావున సర్వజ్ఞునిలక్షణమును చెప్పెదను వినుము.

4

## దైవజ్ఞ లక్షణము.

దేవతాగురుభక్తశ్చ సుశీలశ్చ శుభావహః ।
దృఢవీర్యో మహోత్సాహో గణితజ్ఞో విచక్షణః ॥ ౧౩
ప్రజ్ఞావాంశ్చ మహాఖ్యాతియ అక్రూరశ్చ బహుశ్రుతః ।
జ్యోతిజ్ఞానీ మహాశాస్త్రీ శ్రుతేనైవ పరిస్ఫుటః ॥ ౧౪
స్వరజ్ఞశ్చ నిరాలస్యో మంత్ర తంత్ర విశారదః ।
సువాక్యోఽమృతహస్తశ్చ సర్వజ్ఞానీ జితేంద్రియః ॥ ౧౫

తా. దేవతాగురుభక్తుఁడును ఆచారవంతుండును శుభావహుఁడును దృఢవీర్యుండును మహోత్సాహియు గణితజ్ఞుండును పండితుఁడును బుద్ధిమంతుఁడును లోకఖ్యాతి గలవాఁడును క్రౌర్యములేనివాఁడును లోకప్రసిద్ధుండును జ్యోతిషము మొదలైన మహాశాస్త్రములదెలిసినవాఁడును, స్వరజ్ఞుండును ఆలస్యము లేనివాఁడును మంత్రతంత్రములదెలిసినవాఁడును, మంచివాక్కు అమృతహస్తంబును గలవాఁడునై జితేంద్రియుఁడుగ నుండువాఁడు సర్వజ్ఞాని యనఁబడును.

స్వరహీనశ్చ దైవజ్ఞః అర్థహీనం చ యౌవనమ్ ।
శాస్త్రహీనం చ యద్వక్త్రం శిరోహీనం చ యద్వపుః ॥ ౧౬

*ఇత్యుమామహేశ్వర సంవాదే స్వరచింతామణౌ
స్వరకర్మ దైవజ్ఞ లక్షణం నామ
షష్ఠోఽధ్యాయః. *

తా. స్వరము దెలియని దైవజ్ఞుండును, ధనములేని యౌవనమును, శాస్త్రము చదువని వాక్కును, శిరస్సులేని దేహమును వ్యర్థములు.

---

## సప్తమోఽధ్యాయః.

అథ వక్ష్యే మహాదేవి ! స్వరాకస్మికలక్షణమ్ ।
ఏతత్సాధారణ ప్రశ్నే మయా ప్రోక్తో విశేషతః ౧

తా. ఓపార్వతీ ! ఇక ఆకస్మికస్వరముయొక్క లక్షణమును సాధారణ ప్రశ్నములకు నుత్తరంబును వచించెద వినుము.

వృషమాతంగహంసాది వాజికోదండ దుందుభేః ।
ప్రశ్నకాలే శ్రుతే నాదే శుభకృద్దర్శనేఽపివా ॥ ౨

తా. దూతవచ్చి ప్రశ్న చేయు సమయమున వృషభము ఏనుఁగు హంస గుఱ్ఱము విల్లు భేరీ మృదంగములు వీనిధ్వనివినఁబడినను అవి కనఁబడినను శుభము.

ఇడా చంద్ర స్థిరా వామా పింగళా భానువాహినీ।
సుషుమ్నా మధ్యమానాడీ శివరూపేణ సంస్థితా॥ ౩

తా. ఎడమ నాడి చంద్రుఁడు దీనికి ఇడ అనిపేరు. ఇదిస్థిరము. దక్షిణ నాడి సూర్యుఁడు దీనికి పింగళయని పేరు ఇది చరము. సుషుమ్నా నాడి ఈరెంటికి నడుమ శివరూపముచే నుండును ఈసుషుమ్న ఉభయమనఁబడును.

నచంద్రా దమృతం చాస్యే సూర్యా దంతః పరం విషమ్।
విషం చంద్రేఽమృతం సూర్యే నవిషం చంద్ర సూర్యయోః॥ ౪

తా. చంద్ర స్వరము వచ్చునపుడు అమృతములేదు. సూర్య స్వరముపోవునపుడు విషము లేదు. చంద్రునియందు విషము, సూర్యుని యందు అమృతము ఉండును. మఱియు చంద్ర సూర్యులు కలిసిన విషము లేదు.

చంద్రే చాంతర్గతే భానూ రవా వంతర్గత శ్శశీ।
ఆచార్యముఖతో జ్ఞేయం నాన్య శాస్త్రార్థకోటిభిః॥ ౫

తా. చంద్రునిలో సూర్యుఁడును సూర్యునిలో చంద్రుఁడు నుండును. ఇది గురు ముఖము వలన తెలియ దగినది గాని, కోటిశాస్త్రములు చూచినను తెలియదు.

వామో వా దక్షిణో వాథ శీత శ్చంద్రోహ్యగ్నోవహః।
రవి రుష్ణం వహ త్యూర్ధ్వం రహస్యం కథితం మయా॥ ౬

తా. వామ నాడిగాని, దక్షిణ నాడిగాని శైత్యముగ క్రిందుగా పారిన చంద్రుఁ డనఁబడును. వేడిగా పొడవుగానడిచిన సూర్యుఁ డనఁబడు ఇదిరహస్యము నాచే నీకుఁ జెప్పబడినది.

వామదక్షిణయోరేవ శీతలం వహతే మరుత్।
తదా సర్వాణి కార్యాణి సాధయే ల్లీలయా నరః। ౭

తా. చంద్రనాడి గాని సూర్యనాడి గాని అతిశైత్యముగా కొట్టిన అప్పుడు సకల కార్యములను మనుష్యుఁడు సులభముగ సాధించును.

అథ ఉష్ణం వహే ద్వాయు నైరంతర్యేణ లక్షితః।
నాశయే త్సకలం విశ్వం కింపున స్సూచ్యతే ఫలమ్॥ ౮

తా. రెండు నాడులును అధోముఖముగా ఉష్ణముగా వాయువు ఎడతెగక కొట్టిన అప్పుడు సకలలోకములు నశించును, ఇఁక చెప్పఁదగిన ఫలమేమి యున్నది.

సూర్యోదయే వహే చ్చంద్ర స్సూర్య శ్చంద్రోదయే తథా ।
నిరుద్యోగో మహాహాని ర్మనస్తాపాదికం భవేత్ ॥ ౯

తా. సూర్యస్వరము వచ్చువేళ చంద్రస్వరము ఉదయించినను, చంద్రస్వరము వచ్చువేళ సూర్యస్వరము ఉదయించినను నిరుద్యోగము మహాహాని మనసుకు తాపము మొదలైనవి గలుగును.

చంద్ర స్సమాక్షరో ముఖ్య స్సూర్యోఽథ విషమాక్షరః ।
పూర్ణే ధృతే శుభం విద్యా దగ్నినిర్గమనేఽపి చ ॥ ౧౦

తా. చంద్రస్వరము సమాక్షరములు ముఖ్యము. సూర్యస్వరము విషమాక్షరములు ముఖ్యము, పూర్ణ నాడి అగ్నిప్రవేశమునకు శుభము. (శూన్యమైన యెడల అశుభము.)

చంద్ర స్సమ స్తు విజ్ఞేయ స్సూర్య స్తు విషమ స్తథా ।
చంద్రః స్త్రీ పురుష స్సూర్య శ్చంద్రః కృష్ణో రవి స్సితః ॥ ౧౧

తా. చంద్రుఁడు సముఁడు, సూర్యుఁడు విషముఁడు, చంద్రుఁడు స్త్రీ. కృష్ణవర్ణము. సూర్యుఁడు పురుషుఁడు, తెల్లవర్ణము.

వామేచైవ సితః పక్షః కృష్ణపక్ష స్తు దక్షిణే ।
నిశా వామగతః ప్రాణో దక్షిణోఽహః ప్రకీర్తితః ॥ ౧౨

తా. వాయువు వామనాడియందు నడుచు చుండిన శుక్లపక్షము, దక్షిణ నాడియందు నడుచుచుండిన కృష్ణపక్షము. చంద్రనాడి రాత్రియనియు, సూర్య నాడి పగలనియు తెలియఁ దగినది.

లాభ శ్చంద్రే విజానీయాత్ సూర్యే హానిం వినిర్దిశేత్ ।
మధ్యే చిరాగతం కార్యం వేదితవ్యం ప్రయత్నతః ॥ ౧౩

తా. చంద్రనాడియందు ప్రశ్నసేయ లాభము, సూర్యనాడియందు హాని, ఉభయ స్వరమందు సావకాశమనియుఁ దెలియవలెను.

సూర్యే చ విషమా వర్ణా స్సమవర్ణా స్నిశాకరే ।
వహే ద్యః పృచ్ఛకే దూతే సదాలాభోఽన్యథా న హి ॥ ౧౪

తా. సూర్యనాడియందలి ప్రశ్న విషమాక్షరములుగను, చంద్రుని యందలి ప్రశ్న సమాక్షరములుగను నుండిన ఎల్లప్పుడు లాభమగును. అన్యథా అయినయెడల ఫలములేదు,

పక్షే స్వరే చ వారే చ దిక్షు వచ్యా ద్యదా నరః ।
చంద్రే స్యా దథవా సూర్యే తస్య సిద్ధి ర్న సంశయః । ౧౫

తా. శుక్ల కృష్ణ పక్షములయందు, ఆయాయిస్వరములయందును ఆయాయి వారములయందును ఆయాయి దిక్కులయందునుండి సూర్యునియందుగాని చంద్రునియందుగాని ప్రశ్న చేయ అతనికి కార్యసిద్ధిగలుగును.

క్షణం వామే దక్షిణే చ యదా వహతి మారుతః ।
విషువేన సమో జ్ఞేయ స్సర్వకార్యవినాశనః ॥ ౧౬

తా. క్షణకాలను ఎడమ ప్రక్కను, క్షణకాలము కుడిప్రక్కను స్వరము నడిచిన సంక్రమస్వరము. అది అన్ని కార్యములను చెరుచును.

క్షణం చంద్రః క్షణం సూర్యః క్షణం వ్యోమ్నిచ వర్తతే ।
అశుభస్య శుభం ప్రోక్తం శుభస్యా ప్యశుభం మతమ్ ॥ ౧౭

తా. క్షణము చంద్రుఁడు, క్షణము సూర్యుఁడు ఈరీతిని రెండునాడులును ఆకాశతత్వమునంటి నడిచిన అశుభము శుభమగును. శుభము అశుభమగును.

విషువస్యోదయే యాత్రాం మనసా పి న కారయేత్ ।
యది వా క్రియతే తస్య హాని ర్మృత్యు శ్చ జాయతే ॥ ౧౮

తా. సంక్రమస్వరమునందు యాత్రనుమనస్సుననైన స్మరింపరాదు. ఒకవేళ ప్రయాణమైనయెడల హాని మృత్యువులు గలుగును.

యాత్రాయాం క్షుత్పిపాసా స్యాత్ కార్యహానిశ్చ జాయతే ।
ఇష్టనాశో భయత్రాసౌ సంక్రాంత్యా మేవ నిశ్చితమ్ ॥ ౧౯

తా. సంక్రమస్వరమునందు యాత్రచేసిన ఆఁకలిదప్పులును, కార్యహానియు గలుగును. ఇష్టులకు నాశము, భయము వణఁకు నిశ్చయముగ గలుగును.

జీవనే మరణే ప్రశ్నే లాభాలాభే జయాజయే ।
విషువే విపరీతం స్యా త్సంస్మరే దీశ్వరం తదా ॥ ౨౦

తా. బ్రతుకు మరణము లాభము నష్టము జయము అపజయము వీని విషయమై ప్రశ్న చేసినపుడు సంక్రమముగ నుండినయెడల విపరీతమగును. అప్పుడు ఈశ్వర స్మరణమును జేయవలయును.

సంక్రమో బహుకాలే స్యా త్సుఖ దుఃఖం సమం వదేత్ ।
ఉదయా స్తే౽తిచార స్స్య దపమృత్యు స్సమీపతః ॥ ౨౧

తా. సంక్రమస్వరము బహుకాలము నడిచిన, సుఖదుఃఖములు సమముగ నుండును. ఆ సంక్రమము ఉదయాస్తమానములయందు విశేషముగసంచరించిన అపమృత్యువు గలుగును.

శ్వాసప్రవేశకాలే తు దూతో జల్పతి వాంఛితమ్ ।
తస్యార్థసిద్ధి రాయాతి నిర్గమే నాస్తి వల్లభే ! ॥ ౨౨

తా. ఓపార్వతీ ! స్వరప్రవేశ కాలమునందు దూత ప్రశ్న చేసిన వాని కార్యము సిద్ధించును. శ్వాసము వెడలు కాలమునం దడిగిన కార్యముకాదని తెలియవలయు.

దక్షిణేన యదా వాయు ర్గతో రాష్ట్రక్షయం భవేత్ ।
కథం జీవతి జీవో న చంద్రే శుభఫలం లభేత్ ॥ ౨౩

తా. సూర్యనాడీ ప్రవేశ కాలమందు రాజ్యప్రశ్న చేయ రాజ్యక్షయమని తెలియవలయు, చంద్రనాడీ ప్రవేశకాలమందు ప్రశ్న చేయ జీవము బ్రతుకును. దేశమునకు క్షేమమగును.

సంగ్రామే దర్శనే యానే ప్రవేశే క్రూరకర్మణి ।
ఆపూర్య కుంభకే వాయుం సర్వకర్మాణి సాధయేత్ ॥ ౨౪

తా. యుద్ధమునందును దర్శనమందును గుఱ్ఱము మొదలైన వాహనము నెక్కుటయందును (లేక) ప్రయాణమందును, గృహప్రవేశకాలమందును కఠిన కార్యములయందును వాయువును పూరకముచేసి కుంభకము చేసినయెడల సమస్తకార్యములు సిద్ధించును.

వాయో రాగమనే పుంసాం కార్యసాధన మేవచ ।
గతే ప్రాణే భవే త్పుంసా మర్థనాశ శ్చ సర్వదా ॥
ఉభయో రేవ నాడ్యో స్తు అహితః ప్రాణనిర్గమే ॥ ౨౫

తా. పురుషులకు శ్వాసము వచ్చువేళ అడిగినయెడల కార్యసాధకమగును. శ్వాసము పోవువేళ అడిగిన యెడల ఎల్లప్పుడు ధననాశనము గలుగును. సుషుమ్నా నాడిపోవువేళ అడిగినయెడల కార్యనాశము గలుగును.

పూర్ణనాడీగతో దూతో యః పృచ్ఛతి శుభాశుభమ్ ।
తత్సర్వం సిద్ధి మాయాతి శూన్యే శూన్యం న సంశయః ॥ ౨౬

తా. దూత పూర్ణస్థానమునందుండి యేమిఅడిగినను ఆకార్యములు సిద్ధించును. శూన్యస్థానమునందు అడిగిన నాకార్యములు సిద్ధించవు.

స్థితః పృచ్ఛతి సంపూర్ణే పశ్చా చ్చూన్యస్యం భవే ద్యది ।
నిష్ఫలం త ద్విజానీయా త్సర్వకార్యేషు సర్వదా ॥ 28

తా. దూత పూర్ణస్థానమునందుండి అడిగిన వెనుక ఆనాడి శూన్యమైన యెడల అన్ని కార్యములును విఫలములని తెలియఁదగినది.

ఆదా శూన్యం గతః పృచ్ఛే త్పశ్చా త్పూర్ణం భవే ద్యది ।
తదా సర్వార్థ సిద్ధి స్స్యా త్కథితం తు వరాననే ! ॥ 29

తా. ఓపార్వతీ ! దూతప్రశ్న సమయమందు నాడి శూన్యముగనుండి తరువాత పూర్ణమైన యెడల అన్ని కార్యములు సిద్ధించును.

ప్రయోజనంవాంఛతియస్తుభూపతిస్సకాలరేఖావిషువత్పరీఘాః ।
విహాయదిక్చూలవిరుద్ధశాకునంస్వరేనుకూలేనుగతించకుర్యాత్ ॥

తా. కార్య సిద్ధిని కోరిన ప్రభువు, దిగ్విజయార్థమై పోవునపుడు కాలరేఖ సంక్రమము పరిఘు దిక్చూలలు వారశూలలు విరుద్ధశకునములు వీనిని వర్జించి అనుకూల స్వరమునందు ప్రయాణమైపోవ కార్యము సిద్ధించును.

దూరదేశేహి కర్తవ్యం గమనం తుహినద్యుతౌ ।
అభ్యర్ణదేశే శస్తం చ భాస్కరే నైవ కారయేత్ ॥ 30

తా. చంద్ర స్వరము నడుచువేళ దూరదేశయాత్ర చేయవలయు. సమీపదేశ యాత్రను సూర్యస్వరమునందుచేసిన మేలు గలుగును.

పూరే పూర్ణస్వరః కార్యో రేచకే రేచకస్వరః ।
నిగ్రహం కలహో ద్వేగే కంటకం చ న విద్యతే ।
నివర్తేత సుఖో నైవ సర్వోపద్రవ వర్జితః ॥ 31

తా. చంద్ర స్వరమందు పూరకము చేసికొని యెడమ కాలును ముందునిచి నడువవలయును. సూర్య స్వరమునందు రేచకమును చేసికొని కుడికాలును ముందునిచి నడువవలయును. ఇట్లు చేసిన నిగ్రహము కలహము, కాలున ముల్లునాటుట మొదలగునే యుపద్రవములును లేక నిర్భయుండై సుఖముగా తిరిగివచ్చును.

సందేహస్థా వుభౌ మార్గౌ శూన్యభాగం పరిత్యజేత్ ।
గమ్యతే పూర్ణభాగేన తన్మార్గం నిశ్చయం భవేత్ ॥ 32

తా. దోవ నడుచునప్పుడు రెండుదోవలుండి సందేహము గలిగినయెడ స్వరమును బరీక్షించి శూన్యభాగమునువిడిచి పూర్ణభాగపు దోవనుబోవ ఆమార్గము నిశ్చయమగును.

దిశ శ్చతస్రః పుల్లింగాః స్త్రియ శ్చ విదిశ స్తథా।
దిశ శ్చతస్ర శ్శుభదా విదిశ శ్చాశుభప్రదాః॥ 33

తా. దిక్కులు నాలుగును పురుషులు. మూలలు నాలుగును స్త్రీలు. దిక్కులు నాలుగును శుభములు. మూలలు అశుభములు.

యది బ్రూయా త్తదా దూతః పరచక్రసమాగతః।
మృగాంకే తు భవే త్సత్య మసత్యం భాస్కరోదయే॥ ౩౪

తా. ఎవరైనను దూతవచ్చి పగవారిదళము ఇదిగోవచ్చెను అని చెప్పినయెడల అప్పుడు చంద్రస్వరమైన ఆవాక్యము నిశ్చయము. సూర్యస్వరమైన అబద్ధమనుట.

పరచక్రం భవే చ్చంద్రే స్వచక్రం దక్షిణోదయే।
పూరే శుభం విజానీయా దశుభం నిర్గమే తథా॥ ౩౫

తా. ప్రశ్నకాలమున చంద్రనాడియైన పరచక్రము. సూర్యనాడియైన స్వచక్రము. స్వరమువచ్చువేళ శుభము. స్వరము పోవువేళ అసుభము.

గురుబంధు నృపాణాంచా ప్యమాత్యసుతదాయినామ్।
పూర్ణాంగే ఖలు కర్తవ్యః కార్యసిద్ధి ర్భవే త్సుఖమ్॥ ౩౬

తా. గురువు బంధువులు రాజులు ప్రధాని కుమారుఁడు దాయాదులు మొదలైనవారు అడిగినపుడు స్వరము పూరకమందుండిన కార్యసిద్ధియగును.

అరి చోరో త్తమర్ణానా మద్భుతే విగ్రహే తథా।
కర్తవ్యః ఖలు శూన్యాంగే జయ లాభ సుఖాదయః॥ ౩౭

తా. శత్రువులు చోరులు అప్పులిచ్చువారు అద్భుతకార్యములు కలహమువీని విషయమై శూన్య భాగమందు అడుగఁగా సుఖలాభములు జయమును గలుగును.

పశవ శ్శత్రవో భూపాః ఖలా వా వ్యవహారిణః।
ఏతే శూన్యగతా స్సాధ్యాః పూర్ణస్థాస్సు ర్భయంకరాః॥౩౮

తా. పశువులు శత్రువులు రాజులు దుర్జనులు వ్యాజ్యము గలవారు వీనివిషయమై శూన్య భాగమునందు ప్రశ్న చేసిన వశ్యులు. పూర్ణభాగమందు భయంకరులు.

జయే చోరాగమే వైరిభయే స్యా త్పూరకే ద్వయే।
నిర్గమే స్యా త్తథా సౌమ్యం శూన్యేచైవశుభావహమ్॥ ౩౯

తా. జయము దొంగలువచ్చుట శత్రుభయము వీనివిషయమై ప్రశ్నచేయునపుడు రెండునాడులును పూరకమందుండిన స్వరము పోవునపుడు సౌమ్యము, శూన్యభాగమున శుభము గలుగును.

చోరోఽసా వితి విజ్ఞానే ద్వయే పూర్ణే చ నిశ్చయః ।
తస్కర స్సాన్య న్నిర్గమే చ శూన్యే నై వేతి భాషితమ్ ॥ ౮౦

తా. దొంగ వీఁడని తెలిసికొనుటకు రెండునాడులు పూర్ణముగ నుండినను స్వరము పోవునపుడును దొంగయగును. శూన్యముగ నుండునపుడు దొంగకాఁడని చెప్పునది.

చంద్రసూర్యస్వరాభ్యాసం యో వా నిత్యం కరిష్యతి ।
అతీతా నాగతం జ్ఞానం తస్య హ స్తగతం సదా ॥ ౮౧

* ఇత్యుమా మహేశ్వర సంవాదే స్వరచింతామణౌ
స్వరాకస్మిక సాధారణప్రశ్న ప్రకరణం నామ
స ప్తమో ఽధ్యా యః. *

తా. ఎవ్వఁడు చంద్రసూర్య స్వరాభ్యాసము నిత్యము చేయునో వానికి, అతీత అనాగత జ్ఞానము హ స్తగతమని తెలియవలయు.

---

## అ ష్ట మో ఽ ధ్యా యః.

అథ వక్ష్యే మహాదేవి ! వారస్వర మను త్తమమ్ ।
యస్య విజ్ఞానమాత్రేణ సర్వసిద్ధికరం భవేత్ ॥ ౧

తా. ఓప్రియురాలా ! ఇఁక శ్రేష్ఠమగు వారస్వరమును దెలిపెద. ఇది తెలిసినవాఁడు సకల కార్యసిద్ధి నొందును.

వారే వారబలంప్రోక్తం పక్షే చైవ దినత్రయమ్ ।
అయనే తద్దినం ప్రోక్త మబ్దే చాష్టదినం భవేత్ ॥ ౨

తా. వారమునకు ఒకవారమును, పక్షమునకు మూఁడు దినములును, అయనమునకు ఒకదినమును, సంవత్సరమునకు ఎనిమిది దినములును బలమని తెలియవలయును.

బలం చతుర్విధం ప్రోక్తం వారపక్షాయనాబ్దకమ్ ।
ఏవం సర్వబలం దేవి ! శాకునం తదన న్తరమ్ ॥ 3

తా. ఓదేవీ ! బలము- వారబలము, పక్షబలము, అయనబలము, సంవత్సరబలము అని నాలుగువిధములు. ఈక్రమమున స్వరబలమును, పిదప శకునబలమునుం జెప్పెద.

బాహ్య మాభ్యంతరం చైవ కాలమానం ద్విధా మతమ్ ।
చంద్ర భాస్కర చారేణ జాయతే ఖలు నాన్యతః ॥ ౪

తా. కాలమానము బాహ్యమనియు ఆభ్యంతరమనియు రెండు విధములు ఈరెండును సూర్యచంద్రుల సంచారముచేత తెలియవలయును.

బాహ్యం బ్రహ్మాండ మిత్యుక్తం పిండ మాభ్యంతరం మతమ్ ।
బోధకాలే చ పిండ శ్చ బ్రహ్మాండం భాస్కరోదయే ॥ ౫

తా. బాహ్యము బ్రహ్మాండ మనఁబడును. ఆభ్యంతరము పిండాండమనఁబడును. పిండాండము బోధకాలము. బ్రహ్మాండము సూర్యోదయమని యెఱుంగునది.

భానుః కుజో గురుశ్చేతి వారా స్సూర్యస్వరేరితాః ।
సోమో బుధో భృగు శ్చేతి వారా శ్చంద్రస్వరేరితాః॥ ౬

తా. ఆది మంగళ గురువారములు సూర్య స్వరములు. సోమ బుధ శుక్రవారములు చంద్ర స్వరములు.

నపుంసక శ్శనేర్వార స్సూర్యచంద్రాత్మకో భవేత్ ।
తస్మా దహని సూర్య స్తు రాత్రౌ శశి రితి స్మృతః ॥ ౭

తా. శనివారము నపుంసకమై సూర్య చంద్ర స్వరూపమైయుండును, అందువలన, పగలు సూర్యుఁడు, రాత్రి చంద్రుఁడును నడుచును.

స్వాపకాలే చ యా నాడీ తస్యాం నాడ్యాం శయీత నా ।
బోధకాలే చ యా నాడి తయో త్తిష్ఠే ద్విచక్షణః ॥ ౮

తా. నిద్రవచ్చినపుడు ఏనాడి నడుచుచుండునో ఆనాడియందు శయనింపవలయును. నిద్రలేచునపుడు ఏనాడి యుండునో యానాడియందు లేచవలెను.

సుప్తికాలస్వరో మృత్యుః బోధకాలస్వర శ్శుభమ్ ।
తస్మా దేకస్వరం త్యక్త్వా భిన్నే సిధ్యతి నాన్యథా ॥ ౯

తా. సుప్తికాలస్వరము మృత్యువనఁబడును. బోధకాలస్వరముశుభమనఁబడును. కావున సుప్తి బోధ కాలములయందు ఏకస్వరముగాక భిన్నస్వరమైనఁ గార్యసిద్ధియగును.

భానువారే యథా భాను స్సోమవారే చ చంద్రమాః ।
ఉషఃకాలే దోదయే చ భవే చ్ఛ్రీ స్సర్వతోముఖీ ॥ ౧౦

తా. ఆదివారమున సూర్యస్వరము ఉషః కాలమందును, సోమవారమందు చంద్రస్వరము ఉదయకాలమందును నడిచిన నన్నియెడలను సంపద గలుగును

భానువారే భానునాడీం సాయం సు ప్తే విలక్షయేత్ ।
సోమవారే సోమనాడీం సాయం సు ప్తే విలక్షయేత్ ॥ 11

తా. సూర్యుని వారమందు సూర్యస్వరమును, చంద్రుని వారమందు చంద్ర స్వరమును సాయంకాలమందును రాత్రి నిద్రించు కాలమందును కనిపెట్టవలెను

ఉషఃకాల శ్చ మధ్యాహ్న స్సాయంకాల ఇతి త్రిధా ।
కాలత్రయే స్థితం దృష్ట్వా స్వరం వక్ష్యే ఫలం తథా ॥ 12

తా. ఉదయకాలమందును మధ్యాహ్నకాలమందును సాయంకాలమందును ఉన్న స్వరములకు ఫలమును చెప్పెదను.

ఏకకాలే స్వరే భిన్నే సా తిథి స్సఫలా భవేత్ ।
ద్వితీయే చ స్వరే భిన్నే సా ఫలార్ధఫలా భవేత్ ॥
తృతీయే చ స్వరే భిన్నే మధ్యమం చ ఫలం భవేత్ ॥ 13

తా. ఏకకాలమందు స్వరము భిన్నమయిన, ఆదినము సఫలవగును, రెండవ కాలమున భిన్నమయ్యేనేని తలంచిన ఫలమునందు సగముసిద్ధించును. మూండవకాలమున భిన్నమైనయెడల మధ్యమఫలమని తెలియవలయు.

త్రికాలే చ స్వరే భిన్నే పూర్ణం తిథిఫలం భవేత్ ।
యస్మిన్కాలే స్వరో నాస్తి తస్య హాని స్తదా భవేత్ ॥ 14

తా. మూండు కాలములయందును స్వరము భిన్నమైన సంపూర్ణఫలమగును. ఏకాలమందు స్వరములేదో అప్పుడు ఫలము సిద్ధింపదు.

వారే విచింతితం కార్యం స్యా త్సవ్యస్థే వర్తతే స్వరః ।
అన్యత్ర కార్యసిద్ధి స్స్యా దన్యథా వర్తతే స్వరః ॥ 15

తా. వారస్వరము స్థిరమై నడుచుచుండిన వారమునందుఁ దలంచిన కార్యము సిద్ధించును. ఇతర స్వరము నడిచిన నా కార్యము మఱియొకప్పుడు అగును

చంద్రభాస్కరయో ర్వారే జీవా చంద్రే చ భాస్కరే ।
విపరీతే భవే న్మృత్యు స్సత్య మేత ద్వరాననే ! ॥ 16

తా. ఓ పార్వతీ ! సోమవారము చంద్రస్వరమును, ఆదివారము సూర్యస్వరమును ఈరీతిని ఉండిన జీవస్వరము లనఁబడును. విపరీతమైనయెడ మృత్యుస్వరమగును.

యస్మిన్వారే యదా నాడీ అహోరాత్రం వహే ద్యది ।
శుభస్యా ప్యశుభం ప్రోక్త మశుభస్య శుభం మతమ్ ॥ 17

**తా.** ఏవారమందు ఏస్వరమో ఆస్వరము దివారాత్రిళ్లు ఉండిన శుభకార్యములకు అశుభము, అశుభమునకు శుభము అని తెలియవలయు.

సోమవారే యదా భానుః భానువారే చ చంద్రమాః ।
అశుభం తద్దినం దేవి ! రుజా హాని స్తు జాయతే ॥ ౧౮

**తా.** సోమవారమున సూర్యనాడియు, సూర్యవారమున సోమనాడియునుండిన ఆదినము అశుభము. మఱియు రోగము హానియుఁ గలుగును.

సోమవారస్య రాత్రౌ తు వర్తతే యది భాస్కరః ।
భాస్కరస్య ప్రభాతే తు చంద్రమా మధ్యమం ఫలమ్ ॥ ౧౯

**తా.** సోమవారము రాత్రి సూర్యస్వరమును, భానువారము ఉదయకాలమున సోమస్వరమును నడిచిన మధ్యమఫలమగుసు.

భాస్కరస్య చ రాత్రౌ తు వర్తతే యది చంద్రమాః ।
చంద్రమసః ప్రభాతే చ భాస్కర స్తు మృతి ర్భవేత్ ॥ ౨౦

**తా.** ఆదివారము రాత్రి సుప్తికాలమున చంద్రస్వరమును, సోమవారము ఉదయమున భానుస్వరమును ఐనయెడల మృత్యువని తెలియవలయు.

ద్వికాలయో ర్భవే చ్చంద్ర స్సా ద్వయో ర్మృతి మాదిశేత్ ।
ద్వయో రేవ భవే త్సూర్య ఆత్మనో న బలం భవేత్ ॥ ౨౧

**తా.** సుప్తికాల బోధకాలములయందు చంద్రస్వరము ఉండిన జగడ మాడెడు వారిద్దరును చత్తురు. ఈ రెండుకాలములయందు సూర్యుఁడు ఉండిన తనకు బలము లేదనియు నిష్ఫలమనియు తెలియవలయు.

సుప్తౌ చ చంద్రసూర్యౌ వా బోధే చ ద్వౌ స్వరౌ తథా ।
ఉభయో ర్ద్వంద్వయుద్ధే తు జీవితం చ భవే ద్ధ్రువమ్ ॥ ౨౨

**తా.** సుప్తి బోధకాలములందు ఉభయస్వరము లుండిన ద్వంద్వయుద్ధమున నిరువురును బ్రతుకుదురు.

సుప్తౌ బోధే ద్వయోశ్చైవ సూర్యచంద్రప్రవర్తనే ।
యుద్ధకాలే ద్వయో రేవ నిస్సందేహో మృతి ర్భవేత్ ॥ ౨౩

**తా.** సుప్తికాలమున సూర్యస్వరముండి పొర్లి చంద్రస్వరమై, బోధకాలమున నడుచుచుండిన యుద్ధమునందు ఇరువురికిని మృత్యువు గలుగును.

సుప్తికాలే స్వరం ద్వంద్వం బోధకాలే నిశాకరః ।
యుద్ధకాలే ఉభావేవ మహాఘాతేపి జీవతః ॥ ౨౪

తా. సుప్తికాలమున చంద్ర సూర్య స్వరమై, బోధ కాలమందు చంద్రస్వరమైనయెడ యుద్ధమందు గాయమైనను ఇద్దరును బ్రతుకుదురు.

సుప్తివేళాస్వరం ద్వంద్వం బోధకాలే చ భాస్కరః ।
యుద్ధకాలే జయో నాస్తి పరాజితఫలం భవేత్ ॥ ౨౫

తా. సుప్తికాలమందు సూర్య స్వరము పొర్లి చంద్రుఁడై బోధకాలమందు సూర్యస్వరమైన నిద్దరికిని జయములేదు. భంగము వచ్చును.

సుప్తో నిశాకరశ్చైవ బోధే సూర్య నిశాకరౌ ।
యుద్ధే జిత్వా మృత స్తు స్యాత్కార్యస్యానంతరం తథా ॥ ౨౬

తా. సుప్తికాలమున చంద్ర స్వరమై, బోధ కాలమున సూర్యుఁడై పొర్లి చంద్రుఁడైనయెడ యుద్ధమందు జయించి కార్యమైన వెనుక మృతిబొందును.

సుప్తో దివాకరశ్చైవ బోధే చంద్రదివాకరౌ ।
యుద్ధే జిత్వా తదా భంగీ కార్యం భూత్వా లయం భవేత్ ॥

తా. సుప్తికాలమందు సూర్యస్వరమై బోధకాలమందు చంద్రస్వరము పొర్లి సూర్యుఁడైనయెడ యుద్ధమందు జయింపక భంగమును పొందును. వానికార్యము అయిన పిదప నాశము జెందును.

ప్రసుప్తో చైకనాడీ చ నిద్రామధ్యేఽన్యనాడికా ।
ప్రబోధయతి వేగేన తదాతినికటే రిపుః ॥ ౨౭

తా. సుప్తికాలమందు నొక స్వరముండి నిద్రలో పొర్లినప్పుడు మఱియొక నాడి అయిన యెడ శీఘ్రముగ మేలుకొనును. అప్పు డతని కతిసమీపమున పగవాఁడున్నాఁడనియుఁ దెలియవలయు.

సుస్వరా వామనాడీ స్యా ద్దేకో రిపు స్తదా గతః ।
బహుధా సూర్యనాడి స్యా త్తదాతినికటే రిపుః ॥ ౨౯

తా. వామనాడి ఏకవిధముగా సుస్వరముగా నడిచినయెడల శత్రువువచ్చెననియు, సూర్యస్వరము అనేకవిధములుగా నడిచిన శత్రువు సమీపమందున్నాడనియుఁ దెలియవలయు.

మరణం త్రాసనంయుక్తం ప్రాణాంతిక మథాపివా ।
ఏవం చంద్రోదయే దృష్టే బంధమోచన మేవ చ ॥ 30

తా. మఱియు మరణముగాని ప్రాణపర్యంత మగు భయముగాని వచ్చును. ఈ ప్రకారము సూర్య స్వరఫలము. ఇట్లే చంద్రస్వరము గనుపించిన బంధమోచన మగును.

యుద్ధయాత్రాదికం నశ్యే త్సూర్యో౽జ్ఞాత శ్చరే చ్ఛశీ।
ఏత త్సత్యం మయా దేవి! రహస్యం కథితం తవ॥ ౩౧

తా. సూర్యస్వరము చోటు తెలియక నడచుచుండఁగా చంద్రస్వరము ఎడమకు నడుచుచుండినయెడ యుద్ధము యాత్ర మొదలగునవి నశించును. ఓపార్వతీ! ఈరహస్యము నీకుఁ జెప్పితిని.

వర్జయే త్స్వరశూలాం చ వారశూలాం చ నిందితామ్!
కపాలం కాలరాహుం చ కాలరేఖాంచ వర్జయేత్॥
యోగినీం చ పరిత్యజ్య యాత్రా భవతి సిద్ధిదా॥ ౩౨

తా. స్వరశూల, వారశూల. కపాలము, కాలరాహువు, కాలరేఖ. యోగిని ఇవి మొదలగు దోషముల విడిచి యాత్రచేసిన కార్యసిద్ధియగు.

(స్వరశూల) వామనాడీప్రవాహే తు న గచ్ఛేత్ పూర్వ ముత్తరమ్।
రాహు స్తిష్ఠతి తత్రైవ జయే భంగః ప్రజాయతే॥ ౩౩

తా. వామనాడియందు తూర్పు ఉత్తరము స్వరశూల. అక్కడ రాహువుండును, ఆదిక్కుకు పోయిన సపజయము గలుగును.

దక్షిణాయాః ప్రవాహే చ న గచ్ఛే ద్యామ్యపశ్చిమే।
పరిఘా తిష్ఠతే తత్ర హాని ర్మృత్యు శ్చ జాయతే॥ ౩౪

తా. సూర్యనాడియందు దక్షిణము పడమర స్వరశూల. అక్కడ పరిఘ యుండును. ఆదిక్కుకు పోయిన హాని మృత్యువులు గలుగును.

(వారశూల) గురౌ చ దక్షిణా శూలా ఉత్తరా బుధభౌమయోః।
మృగాంకమందయోః పూర్వా పశ్చిమా భానుశుక్రయోః॥ ౩౫

తా. గురువారమునకు దక్షిణము, మంగళ బుధ వారములకు ఉత్తరము. సోమ శనివారములకు తూర్పు, భాను శుక్రవారములకు పడమర ఇవి వారశూలలు.

సమ్ముఖం వారశూలాయా వామం హానికరం సదా।
విముఖం దక్షిణం భాగం సర్వసిద్ధికరం పరమ్॥ ౩౬

తా. వారశూలకు ఎదురును ఎడమభాగమును హానికరములు. వెనుకటి భాగమును దక్షిణభాగమును సర్వసిద్ధి ప్రదములు.

స్థిరవారా చ్చ పూర్వాదిగణితం సంస్థిత శ్శనిః।
శనిస్థితదిశం హిత్వా గత్వా తు శుభ మాప్నుయాత్॥ ౩౭

తా. శనివారమునుండి తూర్పుమొదలుగ లెక్కింపఁగా ఉద్దేశించిన వారమునకు ఏదిక్కువచ్చునో ఆదిక్కునశనియుండును కావున ఆదిక్కువిడిచి మిగిలిన దిక్కుల ప్రయాణము శుభదము.

తిథీ రుద్రే ముఖం ప్రోక్తం తిథి ర్వేదే కపాలకమ్ ।
తిథి రష్టాదశే ఖడ్గ మాదినాథస్య చాలనమ్ ॥ 3౮

తా. తిథిని ౧౧ తోఁగూర్చి దిక్సంఖ్యచే భాగింపఁగా వచ్చిన శేషము ముఖమనఁబడును, తిథిని ౪ తోఁగూర్చి భాగింపఁగా శేషము కపాలకమనంబడు. తిథిని, ౧౮ తోఁగూర్చి భాగింపఁగా మిగిలిన శేషము ఖడ్గమనఁబడు ఇది ఆదినాథుని యొక్క చలనమనఁబడును.

తస్మై న్యేవ సమ్ముఖం వామం గత శ్చే న్మ్రియతే నరః ।
దక్షిణే పృష్ఠభాగే చ జయతే నాత్ర సంశయః ॥ 3౯

తా. ఆదినాథునికి ఎదురుగను ఎడమ ప్రక్కను యాత్రచేసిన మృత్యువు గలుగును. వెనుకటిప్రక్కను దక్షిణభాగమునను యాత్రచేసిన జయముగలుగును సందియము లేదు.

(కాలరాహువు) రవౌ గురౌ చ పూర్వస్థ స్సోమే శుక్రే చ దక్షిణే ।
భౌమే చ పశ్చిమే తిష్ఠే చ్ఛనౌ సౌమ్యే చ ఉత్తరే ।
కాలరాహుః ప్రవర్తేత తద్దినం వర్జయే ద్బుధః ॥ ౪౦

తా. కాలరాహువు-రవి గురువారములయందు తూర్పుదెసయందును, సోమ శుక్రవారములయందు దక్షిణమునందును, మంగళవారమున పడమరయందును, శని బుధవారములయందు ఉత్తరమునందును ఉండును కావున బుద్ధిమంతుఁడు ఆదిక్కులను ప్రయాణమునందు విడువవలయును.

(కాలరేఖ) శక్తిరూపీ స్థిత శ్చంద్ర శ్శివరూపీ దివాకరః ।
శశిభాస్కరయో ర్మధ్యే కాలరేఖా విధీయతే ॥ ౪౧

తా. చంద్రుఁడు శక్తిరూపము, సూర్యుఁడు శివరూపము ఈరెంటికినడుమ కాలరేఖ యుండునని తెలియవలయు.

వామే చ వాయు మగ్నిం చ న కార్యం గమనం బుధైః ।
గచ్ఛే ద్యది తథా మోహాత్ బ్రహ్మాపి స నివర్తతే ॥ ౪౨

తా. కాలరేఖయందలి చంద్రస్వరము వాయ్వగ్నిమిశ్రమైనయెడల వాయ వ్యాగ్నేయదిక్కులకుఁ బోఁగూడదు. ఒకవేళ మోహముచేఁబోయినయెడల బ్రహ్మయైనను తిరిగి రాఁజాలఁడు.

(తిథిశూల) ప్రతిపన్నవమీ పూర్వే ద్వితీయాదశమోత్తరే।
తృతీయై కాదశీ చాగ్నా చతు ర్ద్వాదశ నైరృతౌ॥ ౪౩
పంచ త్రయోదశీ యామ్యే పశ్చిమే షట్చతుర్దశీ।
సప్తమీపూర్ణిమా వాయూ వీశే దర్శోఽష్టమీ తథా॥ ౪౪

తా. పాడ్యమి నవమి ఇవి తూర్పుదిక్కునందును, విదియ దశమి ఇవిఉత్తరమునందును, తదియ ఏకాదశి ఇవి ఆగ్నేయమందును, చవితి ద్వాదశి ఇవి నిరృతియందును, పంచమి త్రయోదశి ఇవి దక్షిణమందును, షష్ఠి చతుర్దశి ఇవి పడమరయందును సప్తమి పౌర్ణమి ఇవి వాయవ్యమునందును, అష్టమి అమావాస్య ఇవి ఈశాన్యమునందును శూలలని తెలియవలయు.

(నక్షత్రశూల) పూర్వే జ్యేష్ఠాధనిష్ఠా, చ యామ్యేఽశ్వి శ్రవణం తథా।
పశ్చిమే పుష్యరోహిణ్యౌ హస్తా ఫల్గుని కోత్తరే॥
ఏతన్నక్షత్రశూలాయాం యాత్రాయాం మరణం ధ్రువమ్॥ ౪౫

తా. జ్యేష్ఠా ధనిష్ఠలు తూర్పునందును, శ్రవణాశ్వినులు దక్షిణమునందును, పుష్యమిరోహిణులు పడమరయందును, హస్తపుబ్బలు ఉత్తరమునందును శూలలు, వీనియందుఁ బ్రయాణమైనయెడల మరణముగలుగును.

(లగ్నశూల) మిథునతులఘటాః ప్రాక్కర్కిమీనాళియామ్యే,
వృషభయువతి నక్రా ఉత్తరే శూల మేతత్।
ధను రజ మృగరాశ్యః పశ్చిమే నైవ యాత్రా।
సకలమునిమతం స్యా త్సర్వకార్యేషు నష్టమ్॥ ౪౬

తా. మిథునము తుల కుంభము ఇవి తూర్పునందును, కటకము మీనము వృశ్చికము ఇవి దక్షిణమందును, వృషభ కన్యా మకరములు ఉత్తరమునందును, మేష సింహ ధనుస్సులు పడమరయందును లగ్నశూలలు, వీనియందు ప్రయాణముకూడదు. సర్వకార్య నష్టమగును.

వామజా ఖండితా భూత్వా వర్తతే స్వగృహా న్నరః।
తదా సమపదం కృత్వా స్థిత స్స్వ న్నిర్గతో జయేత్॥ ౪౭

తా. వామనాడి ఖండముగా నడుమవేళ మనుజుఁడు పూరకముచేసి అడుగులు సమముగనునిచి కొంతదడవు స్థిరముగ నిలిచి స్వగృహమునుండి బైలువెడలిన జయము నొందును.

అఖండా నిర్గతా ఖండా యాయీ స్యా త్పూరతః పదమ్ ।
కృత్వా వినిర్గతో గేహా త్స సర్వాన్ జయతే పుమాన్ ॥ ౪౮

తా. ఎడతెగక సూర్యనాడి నడిచినయెడల పోఁదలంచినవాఁడు రేచకముచేసి కుడికాలును ముందునిచి యింటికడపదాటిన సకల శత్రువులను జయింపనచ్చును.

రవా వేకాదశపదం సోమే దశపదం స్మృతమ్ ।
కుజే నవ బుధే చాష్టౌ గురౌ స ప్త కవౌ చ షట్ ॥ ౪౯
మందే పంచపదం ప్రోక్తం పాదసంఖ్యా ఇతీరితాః ॥ ౫౦

*ఇత్యుమామహేశ్వరసంవాదే స్వరచింతామణౌ వారస్వరలక్షణం
నా మా ష్ట మో ఽ ధ్యా యః. *

తా. ఆదివారమున ౧౧ పాదములు, సోమవారమున ౧౦, మంగళవారమున ౯, బుధవారమున ౮, గురువారమున ౭, శుక్రవారమున ౬, శనివారమున ౫, ఈక్రమమున అడుగులునిచి ప్రయాణమైన శుభము.

---

## న వ మో ఽ ధ్యా యః.

అథ వక్ష్యే మహాదేవి! పక్షమాసబలం క్రమాత్ ।
పక్షే తు త్రిదినం ప్రోక్తం మాసే పంచదినం మతమ్ ॥ ౧

తా. ఓపార్వతీ! ఇఁక పక్షమాసబలము జెప్పెదను. పక్షమునకు 3 దినములు మాసమునకు ౫ దినములును చూడవలయు.

ఆదౌ చంద్ర స్సితే పక్షే భాస్కర స్తు సితేతరే ।
ఏవం పక్షే సమం జ్ఞేయం త్రిదినేషు స్వరోదయమ్ ॥ ౨

తా, శుక్ల పక్ష పాడ్యమి మొదలు 3 దినములు చంద్రుఁడు, మూఁడుదినములు సూర్యుఁడు, కృష్ణపక్ష పాడ్యమి మొదలు 3 దినములు సూర్యుఁడు, 3 దినములు చంద్రుఁడు ఈరీతిని వరుసగా ఒక్కొక స్వరము మూడేసిదినములవంతున నడుచును.

ఏకాహ్నా స్తు బలం పంచ త్రిదినస్య త్రిపంచకమ్ ।
యస్మిన్ దినే స్వరో నాస్తి తద్దినే పంచ నిష్ఫలమ్ ॥ 3

తా. దినము ౧ కి ౫ దినములబలము, దినములు ౩ కి ౧౫ దినముల బలము గలిగి యుండును. స్వరములేని దినమున ౫ బలములు నిష్ఫలము.

సితే ప్రతిపదాద్యా తు పంచసంఖ్యేషు చంద్రమాః।
దినేషు లక్షిత స్సమ్య క్తన్మాసే బల ముత్తమమ్॥ ౪

తా. శుక్ల పక్ష పాడ్యమి మొదలు ౫ దినములు చంద్రస్వరము కనుపడిన ఆనెల ఉత్తమబలము.

మాసాదిపంచదివసే దినై కస్య బలాని షట్ ।
పక్షస్యై వ బలం తద్వ త్తన్మాసస్య బలం స్మృతమ్॥ ౫

తా. మాసము మొదలు ౫ దినములు దినము ౧ కి ఆరుబలములు. పక్షమునకును ఆ మాసబలములను చెప్పవలయును. ఈక్రమమున మాసబలము చెప్పఁబడియె.

దక్షిణం స్యా త్సౌరమానం వామం స్యా దుత్తరాయణమ్।
సుషుమ్నాయాం భవత్యేవం మధ్యే వై షట్ప్రమాణకమ్॥ ౬

తా. దక్షిణాయనము కర్కాటకసంక్రాంతి. అది సూర్యునిదై సూర్యస్వరముగా కనుపించవలెను. ఉత్తరాయణము మకరసంక్రాంతి అది చంద్రునిదై చంద్రస్వరముగా కనుపించవలెను. ఈస్వరములను కనుగొనినపిదప సంక్రమస్వరమును ఆరు ప్రమాణముల పైని తెలిసికొనవలెను.

న స్పందతే చ విషువం యుగప చ్చాయనద్వయే।
స సద్యో నిధనం యాతి బహుధాపి చ రక్షితః॥ ౭

తా. సంక్రమస్వరము రెండు ఆయనములయందును కదలకుండిన-ఆమనుష్యుఁడు అనేకవిధములఁ గాపాడఁబడినను బ్రతుకడు.

తులామేషస్థితే భానౌ విషువ త్తత్ప్రకీర్తితమ్।
పరీక్షేత తదా తత్త్వం కాలం స్వస్య పరస్య చ॥ ౮

తా. తులా మేష సంక్రాంతులయందు సూర్యుఁడుండినపుడు విషువమనఁబడును. అప్పుడు, తనకుగాని, ఇతరులకుగాని కాలనిర్ణయము చేసికొనుటకు పంచతత్త్వములను శోధింపవలెను.

అనేన విధినా యస్య ప్రవాహౌ శ్శశి సూర్యయోః।
స లభే ద్విమలం జ్ఞానం ధనధాన్య పశుప్రజాః॥ ౯

తా. ఈ రెండు సంక్రాంతులకాలమందు చంద్ర సూర్య స్వరగతుల నెవరు తెలిసికొనుచున్నారో- వారికి నిర్మలమైనజ్ఞానము, ధనధాన్యములు, పశువులు, సంతానమును గలుగును.

మేషసంక్రాంతి వేళాయాం వాయుతత్త్వం వహేద్యది ।
ఉత్పాతోపద్రవో భీతి రల్పవృష్టిః ప్రకీర్తితా ॥ ౧౦

తా. మేషసంక్రాంతివేళ వాయుతత్త్వమునడచిన, ఉత్పాతములు, ఉపద్రవములు, భయము, కొంచెముగ వర్షంబును గలుగును.

దుర్భిక్షం రాష్ట్రభంగ శ్చ రోగోత్పత్తి శ్చ దారుణా ।
అల్పా వసుంధరా వృష్టి రగ్నితత్త్వం వహేద్యది ॥ ౧౧

తా. ఆ మేషసంక్రాంతివేళయందుఁ దేజస్తత్త్వము నడచిన, దుర్భిక్షము, రాష్ట్రభంగము, దారుణరోగములు, అల్పవృష్టియు గలుగును.

సుభిక్షం రాష్ట్రవృద్ధి శ్చ వసుధాయాం క్రమాద్భవేత్ ।
బహువృష్టి స్సుసౌఖ్యం తు జలతత్త్వం వహేద్యది ॥ ౧౨

తా, పృథివీ తత్త్వము నడచిన, సుభిక్షము రాజ్యవృద్ధియు గలుగును. జలతత్త్వము నడచిన విశేషవర్షము బహుసౌఖ్యమును గలుగును.

మేషసంక్రాంతివేళాయాం వ్యోమతత్త్వం వహేద్యది ।
తదా సర్వం హి శూన్యం స్యా త్సస్యాదే రశుభం భవేత్ ॥౧౩

తా. ఆ మేషసంక్రాంతికాలమున, ఆకాశతత్త్వము నడచిన సకలకార్యములు శూన్యములగు. పైరులు ఎండిపోవును.

(సంవత్సరఫలం) శృణు దేవి! ప్రవక్ష్యామి అబ్దస్యైవ మనుత్తమమ్ ।
తస్యాదౌ తత్స్వరం తత్త్వం స్థితం సిద్ధికరం ఫలమ్ ॥ ౧౪

తా. ఓపార్వతీ! ఇఁక సంవత్సరముయొక్క ఉత్తమఫలముల జెప్పెద వినుము. సంవత్సరాదియందుండెడి స్వరమును, తత్త్వమును ఫలసిద్ధిని గూడ జెప్పెద.

సంవత్సరే దినాన్యష్టా వయనే దినపంచకమ్ ।
పక్షే త్రీణి దినా న్యేవ వారే వారబలం మతమ్ ॥ ౧౫

తా. సంవత్సరమునకు ౮ దినములు, అయనమునకు ౫ దినములు, పక్షమునకు ౩ దినములు, వారమునకు ౧-వారము, ఇట్లు స్వరబలము నెఱుంగవలయు.

అమాయా శ్చైవ భూతాయా మధ్య స్సంధి రితి శ్రృణు।
ప్రథితాఖ్యేతి తత్సంధౌ స్వరం నష్టం బలం తథా॥ ౧౬

తా. అమావాస్యయొక్క ఆదియు. చతుర్దశియొక్క అంతమును వీనిమధ్య కాలము సంధి అనిచెప్పఁబడును, దానియందు స్వరము నష్టమైన యెడల ఫలము నష్టమగును, శుభమైన యెడల శుభమగును.

యథాకాశాదికం నష్ట మభావా చ్చంద్ర సూర్యయోః।
తస్మా త్సంధిబలం ముఖ్యం వత్సరాదిబలా దిమమ్॥ ౧౭

తా. ఆకాశము సూర్యచంద్రులు లేకుండిన నష్టమైనభంగి స్వరములేని సంధియు నష్టమగును. కావున సంవత్సరాదిబలములకంటె సంధిబలము ముఖ్యము.

భూతాంతే చంద్రమా లక్ష్యే దమాదౌ భానురేవచ।
వర్తతే యస్య తస్యాయు స్సంపూర్ణం వత్సరావధి॥
విపరీతం యదా యస్య తస్య హాని ర్మృతి ర్భవేత్॥ ౧౮

తా. చతుర్దశి అంత్యమున చంద్రుఁడును, అమావాస్యాది యందు సూర్యుఁడును నడిచెనేని వానికి ఆసంవత్సరము వఱకు ఆయువు సంపూర్ణము, వ్యత్యాసముగ నుండిన హాని మృత్యువులు గలుగును.

సుప్తికాలే భవే ద్భాను ర్బోధకాలే చ చంద్రమాః।
సంవత్సరాదౌ లక్ష్యాణి త్రిదినాని తతః పరమ్॥
దినాని పంచ వారాణా మేవ మష్టసు లక్షయేత్॥ ౧౯

తా. సంవత్సరాంతమందలి యమావాస్య మొదలుకొని 3 దినములు రాత్రి నిద్రించువేళ సూర్యస్వరమును, ఉదయమునలేచువేళ చంద్రస్వరమును కనవలెను.అటు తరువాత ౫ దినములును, పిదప ౮ దినములవఱకును వారస్వరమును పరీక్షించవలయు.

విధూదయే ద్వితీయాయాం పుంసోఽంగే యది చంద్రమాః।
తదా జీవతి జీవోఽసౌ యావత్సంవత్సరం ధ్రువమ్॥ ౨౦

తా. సంవత్సరాది విదియనాడు చంద్రోదయకాలమున మనుష్యునిదేహమునందు చంద్రస్వరముండిన వానికి ఆ సంవత్సరమంతయు ఆయుస్సు దృఢము.

ఇత్యాది సాధుదృష్టస్య ఆయు స్సంపూర్ణ మీరితమ్।
ఆదావష్టదినస్యాథ లక్షణం వక్ష్యతే స్ఫుటమ్॥ ౨౧

తా. ఈసంవత్సరాది క్రమముగ చంద్రస్వరము కనఁబడినవారికి ఆయుస్సు సంపూర్ణముగనుండును.ఇఁక మొదటిదినము మొదలు ౯ దినములవఱకు గలుగు ఫలమును బాగుగ జెప్పెదను.

ప్రథమే కలహప్రాప్తి రర్థనాశో ద్వితీయకే।
తృతీయే చ ప్రయాస స్తు మిత్రహాని శ్చతుర్థకే॥ ౧౨

తా. పాడ్యమినాడు స్వరముతప్పిన కలహము, విదియయందు అర్థనాశము, తదియయందు ప్రయాసము, చవితియందు మిత్రబాంధవులకు హానియు గలుగును.

పంచమ్యాం దేశవిధ్వంసం షష్ఠ్యాం దేశాధిపక్షయః।
సప్తమ్యాం తు మహావ్యాధి రష్టమ్యాం మృత్యు మాదిశేత్ ॥

తా. పంచమియందు స్వరము లేకుండిన దేశనాశము, షష్ఠియందు దేశాధిపతికి హాని, సప్తమియందు మహావ్యాధి, అష్టమియందు మృత్యువును గలుగును.

ఆదౌ వారస్వరం పశ్యే త్తత్వం చ తదనంతరమ్।
స్వరహీనదినం తత్వం శుభహీనం శుభావహమ్॥ ౧౪

తా. ముందుగ వారస్వరము చూచి తరువాత తత్వమునుచూడవలెను. వారస్వరములేని దినంబున అశుభతత్వము శుభమగును

తేజస్తత్వే త్వనావృష్టి ర్వాయుతత్వే త్వనామయమ్।
ఆకాశే సర్వశూన్యాని తోష స్స్యా చ్చ మహీంజలే॥ ౧౫

తా. తేజస్తత్వమునందు అనావృష్టియు, వాయుతత్వమునందు మహారోగ్యమును, ఆకాశతత్వమునందు సర్వశూన్యమును, పృథ్వీజలతత్వములందు సంతోషమును గలుగును.

చంద్రే పృథ్వీ జలం సౌమ్యం సూర్యే ఖం తేజమారుతమ్।
తదా సిద్ధి ర్న సందేహ స్సౌమ్యే సౌమ్యే చ కర్మణి॥ ౧౬

తా. చంద్రస్వరమునందు పృథ్వీ జల తత్వములు శుభకర్మములకు మంచిది. సూర్యస్వరమందు ఆకాశ తేజోవాయువులు అశుభకర్మములకు మంచిది.

వార శ్చైవా థ పక్ష శ్చ మాస శ్చా ప్యయనం తతః।
వత్సర శ్చేతి పంచానాం కథితో వీక్షణక్రమః॥ ౧౭

తా. వారము పక్షము మాసము అయనము సంవత్సరము ఈఅయిదింటిని చూచు క్రమము చెప్పఁబడియె.

వాత్సరం చాయనం చైవ పాక్షం వార మితి క్రమాత్ ।
బలం చతుర్విధం ప్రోక్తం ఫలం వక్ష్యామి తస్య తు ॥ ౨౮

తా. సంవత్సరము అయనము పక్షము వారము వీనికిబలము చెప్పఁబడియె. ఇఁక వానిఫలములను చెప్పెద.

అల్పం బలం తు ఏక శ్చే ద్ద్వాభ్యాం మధ్యబలం స్మృతమ్ ।
ఉత్తమం తు త్రిభి ర్యుక్తం చతుర్భి శ్చోత్తమోత్తమమ్ ॥ ౨౯

తా. సంవత్సరబలము మాత్రముండిన అల్పబలుఁడు, సంవత్సరాయనబలములుగలవాఁడుమధ్యమబలుఁడు, పక్షబలమునుకలసిమూఁడుబలములుకలవాఁడు ఉత్తమబలుఁడు వారబలముతోఁజేరి నాలుగు బలములును గలిగియుండిన ఉత్తమోత్తమబలుఁడనఁబడును.

చతుర్బలే శుభే తత్వే సుస్వరో ఘటికాం వహేత్ ।
స తు సర్వాణి కార్యాణి పవన స్సాధయిష్యతి ॥ 30

తా. నాలుగుబలములు గలిగిన శుభతత్వమందు స్వరము ఒకగడియ సుస్వరముగనడిచిన సకల కార్యములు సాధింపవచ్చును.

ఏకత్రసార్థం వ్రజతాంబహూనాం తుల్యేపిజాతే శకునే. ఫలాని ।
నానాప్రకారాణిభవంతియేషాంస్వరంత్వహంతంప్రవిచారయామి॥

తా. పదుగురుగూడి త్రోవను పయనమై పోవునపుడు వారికి శకునమయినయెడల ఆ శకునము ఎవరిదనుటకు ఎవ్వని కేస్వరము నడుచునో వానియొక్క స్వరమునకు ఫలమును చెప్పుచున్నాను.

యానేవహేత్సావిధునాడికాచే త్క్షేమంకరీ వామగతార్కనాడీ ।
ఘ్రాణేప్రపూర్ణే ఫలదానులోమే వామాంతరిక్తేవిపరీతమేతత్ ॥

తా. ప్రయాణకాలమున చంద్రస్వరమునడుచువేళ సూర్యస్వరమువామమును పొందిన క్షేమము గలుగును, ప్రయాణకాలమున సూర్యస్వరముండినను క్షేమము. స్వరప్రవేశకాలమున ముక్కున నిండుగ గనుపించిన ఫలము అనుకూలముగనగును, స్వరము పోవువేళ ఫలము విపరీతమగును.

శశాంకనాడ్యామథవార్కనాడ్యాం మిథస్సమీరః ప్రవిశేత్యనేన ।
యశస్సమృద్ధంకుశలం జయంచ నిర్గచ్ఛతిస్యాత్ఫలవైపరీత్యమ్ ॥

తా. ప్రయాణకాలమున చంద్రస్వరము నడుచువేళ సూర్యస్వరము ప్రవేశించినను,సూర్యస్వరము నడుచువేళ చంద్రస్వరము ప్రవేశించినను కీర్తి కుశలము[redacted]ప్రయాణమందు జయమును గలుగును. స్వరము పోవువేళ విపరీతఫలమగును.

అయియదాతుమిహిరాంశునాడికా స్వేచ్ఛయావిశతిశోభనంఫలం
నాడికావ్రజతితాపనీయదా స్వేచ్ఛయాహిగమనేఽశుభంఫలమ్ ॥

తా. చంద్రస్వరము తనయిచ్ఛవచ్చినట్లు ప్రదక్షిణముగా వచ్చువేళ ప్రయాణమైనయెడల తలఁచిన సకలకార్యములు సిద్ధించును. ఊరికి బోవువేళ సూర్యస్వరము తనయిచ్ఛవచ్చినట్లు వెలుపలికి బోవుచుండిన ప్రయాణమై పోవువారికి అశుభము గలుగును.

మారుతే విశతి దక్షిణే యదా సప్రదక్షిణ మయేఽల్పకంఫలమ్ ।
మారుతేవిశతిసవ్యకేయదా సప్రదక్షిణమయేఽశుభంఫలమ్ ॥ ౩౫

తా. సూర్యస్వరము ప్రదక్షిణగతిగా లోపలికి బోవువేళ ప్రయాణమైన కొంచెము శుభఫలముగలుగును. చంద్రస్వరము ప్రదక్షిణముగా లోపలికిబోవువేళ ప్రయాణమైనయెడల కొంచెము అశుభఫలముగలుగును.

ప్రయాణకాలేహ్యుదయేవశాచ్ఛశీయదిప్రవర్తేతచిరాయకార్యమ్
తథైవసూర్యోయదివర్తతేతదా చిరాయకార్యంభవతీతిచాహుః॥

తా. ప్రయాణకాలమందు దుదయమున ఉన్నట్లుండి చంద్రస్వరమయిన యెడల కార్యము తామసముమీఁద అగును. ఈక్రమమున సూర్యస్వరమైన యెడల కార్యము శీఘ్రముగ నగును.

ఘస్రాదౌ తతోస్సమనాడ్యాం వహంత్యాం
యాత్రాణాం వై శోభనాః కార్యభాగాః ।
తత్రైవ స్యాత్తాపనీ చాశుభా నై వ
సమ్మిశ్రే స్యాత్తత్ఫలం మిశ్రమేవ ॥                    ౩౬

తా. చంద్రస్వరము నడుచువేళ ఉదయమున పయనమయినయెడల శుభకార్యములు అనుకూలించును. సూర్యస్వరము నడుచువేళ ఉదయమున అశుభకార్యములకు పోవచ్చును. ఉభయస్వరములు మిశ్రమైనపుడు శుభాశుభములు కలిసియుండును.

అనేకస్మిన్నేవ యాతే నిమిత్తం
యాదృగ్యేషాం ప్రాణచారోఽభ్యుదేతి ।
తాదృక్తేషాం స్యాత్ఫలం మానవానాం
నైకాకారే హంసచారస్తథాహి ॥                    ౩౭

నవమ్యాం బుద్ధిహాని స్స్యా ద్దశమ్యాం బంధునాశనమ్ ।
ఏకాదశ్యాం విరోధ స్స్యా ద్ద్వాదశ్యాం హాని రుచ్యతే ॥ ౫
త్రయోదశ్యా మర్థనాశ శ్చతుర్దశ్యాం పశుక్షయమ్ ।
పంచదశ్యాం పరస్యాస్య విరోధో జాయతే ధ్రువమ్ ॥ ౬

తా. సులభము.

(నక్షత్రఫలమ్) ఫల్గునీ ద్వే కరా చిత్రా స్వాతీ వైశాఖ మిత్రభే ।
శక్రాసురా విధిశ్చైవ వారుణం చ నిశాముఖమ్ ॥ ౭
ఏతేషాం ద్వాదశర్క్షాణాం భానునాడీ ప్రకీర్తితా ॥
అశ్వీ యమః కృత్తికా చ సోమో రుద్రః పునర్వసుః ॥ ౮
పుష్యాశ్లేష మఖాశ్చైవ పూర్వాషాఢా చ విశ్వకమ్ ।
శ్రవణం చ ధనిష్ఠా చ పూర్వాభాద్రా చ రేవతీ ।
ఏతత్పంచదశర్క్షాణాం సోమనాడీ ప్రకీర్తితా ॥ ౯

* ఇత్యుమామహేశ్వర సంవాదే స్వరచింతామణౌ వారపక్ష అయనసంవత్సర శకునజ్ఞానం నామ నవమోఽధ్యాయః. *

తా. పుబ్బ ఉత్తర హస్త చిత్త స్వాతి విశాఖ అనూరాధ జ్యేష్ఠ మూల రోహిణి శతభిషము ఉత్తరాభాద్ర ఈ నక్షత్రములకు సూర్యనాడి. అశ్విని భరణి కృత్తిక మృగశిర ఆర్ద్ర పునర్వసు పుష్యమి ఆశ్లేష మఖ పూర్వాషాఢ ఉత్తరాషాఢ శ్రవణము ధనిష్ఠ పూర్వాభాద్ర రేవతి ఈనక్షత్రములకు చంద్రనాడి. నక్షత్రస్వరము తప్పినయెడల సూర్యునియందు రోగము చంద్రునియందు హానియుఁగలుగును.

---

## దశమోఽధ్యాయః.

తత్త్వాధ్యాయం ప్రవక్ష్యామి త్రైలోక్యజ్ఞాన ముత్తమమ్ ।
మమ పంచముఖా న్యేవ తత్త్వరూపేణ సంస్థితాః ॥ ౧

తా. ఓపార్వతీ! త్రిలోకజ్ఞానమును గలుగఁజేయు నత్యుత్తమంబైన తత్త్వాధ్యాయమును చెప్పెదను వినుము, నాయొక్క పంచముఖములే పంచతత్త్వములుగ నున్నవి

సద్యో వామ మఘోరం చ తత్పురుషే శాన మేవ చ ।
మమ పంచముఖానాం హి పంచ మార్గా శ్చ సంస్థితాః ॥ ౨

తా. సద్యోజాతము వామదేవము అఘోరము తత్పురుషము ఈశానము అనెడి నా అయిదు ముఖములును అయిదు మార్గములు గలిగియుండును.

పృథి వ్యాప స్తథా తేజో వాయు రాకాశ మే ంవ చ।
పంచ తత్త్వాత్మకం దేహం జ్ఞాతవ్యం వరవర్ణిని॥ 3

తా. ఓ పార్వతీ! ఈ దేహము పృథివి అప్పు తేజస్సు వాయువు ఆకాశము అనెడి పంచభూతముల స్వరూపమని తెలిసికొనుము.

తేషాం వర్ణగతీ స్వాదు మండలం స్థానకం ధ్రువమ్।
కార్యాకార్య విచారజ్ఞో నిపుణో విచరే న్మహీమ్॥ ౪

తా. ఆభూతములయొక్క వర్ణము గతి స్వాదు మండలము స్థానము వీనియొక్క కార్యాకార్య విచారము ఇవి దెలిసినవాఁడు సమర్థుఁడై భూమిని బాగుగ సంచరించును.

పీతగౌరా చతుష్కోణా జగతీ ద్వాదశాంగుళా।
మధ్యే వహతి నాసాయాః కృషికర్మాణి సాధయేత్॥ ౫

తా. పృథివీతత్త్వము పసుపు తెలుపు గలసినచాయ కలదై నాలుగుమూలలును, ౧౨ అంగుళముల ప్రమాణమును గలదై నాసికామధ్యమున నడుచుచుండును. ఈ తత్త్వమున కృషికర్మములు చేయ సిద్ధించును.

అర్ధచంద్రాకృతి శ్వేతం కషాయం షోడశాంగుళమ్।
అధోవహతి నాసాయా ఆప శ్శాంతిం చ కారయేత్॥ ౬

తా. అప్తత్త్వము అర్ధచంద్రాకృతి, తెలుపు వర్ణము వగరునుగలదై ౧౬ అంగుళముల ప్రమాణముగలిగి ముక్కు క్రిందనంటిచరించుచు, దీనియందు శాంతికర్మములు చేయందగును.

త్రికోణో లోహిత స్తీక్ష్ణో బహ్ని రష్టాంగుళో మతః।
ఊర్ధ్వే వహతి నాసాయా క్రౌర్యతకర్మాణి కారయేత్॥ ౭

తా. అగ్నితత్త్వము త్రికోణము రక్తవర్ణము (స్వాదు)కారమును గలదై ౮ అంగుళముల ప్రమాణము గలిగి ముక్కుకుపైన సంచరించును. ఇందు క్రౌతకర్మములు చేయందగు.

అమ్లు షట్కోణ నీల శ్చ మారుత శ్చతురంగుళః।
తిర్యగ్వహతి నాసాయాః కర్మ చాస్య పలాయనమ్॥ ౮

తా. వాయుతత్త్వము పులుసు షట్కోణమండలము, నీలవర్ణమునుం గలదై ౪ అంగుళముల ప్రమాణముగలిగి ముక్కులో నడ్డముగ సంచరించును, ఇది పరుగిడి చేయఁదగిన కార్యములకు మంచిది.

అప్రమాణ మనాకార మరసం చ భవే దిదమ్ ।
కథ్యతే సర్వథా వ్యోమ ధ్యానం జాపం చ కారయేత్ ॥ ౯

తా. ఆకాశతత్వము ప్రమాణము ఆకారము రసమును లేనిదై ముక్కులోపల సంచరించును, ఇందు జప ధ్యానములు చేసిన ఫలించును.

వాయు స్తోయసమాయోగా దతిచారో బహిర్ముఖః ।
వాయుకళేతి విజ్ఞేయా సర్వకార్యవినాశినీ ॥ ౧౦

తా. వాయువు అప్పుతోఁగూడి యతిచారమై రెండునాడులయందును బహిర్ముఖముగ సంచరించిన నది వాయుకళయనఁబడు. అప్పుడు సకలకార్యములునశించును.

పృథివీతోయసంయోగా దతిచారగతో మరుత్ ।
వామదక్షో దక్షవామః కాలదండః క్షయంకరః ॥ ౧౧

తా. పృథివీతోయములు ఏకమై అధికముగా ముక్కునుండి వెలువెడలునపుడు రెండు ముక్కుల వెంట వామనాడి కుడిపార్శ్వముగాను సూర్యనాడి, ఎడమపార్శ్వముగాను ఏకకాలమున వెలువెడలిన కాలదండ మనఁబడును. ఇది కార్యక్షయమును చేయును.

వహ్నిమారుతయోగా ద్వా శృంగనాదో వహే ద్యది ।
తదోపరాగోవిజ్ఞేయ స్తస్మిన్ మృత్యుం వదే త్స్ఫుటమ్ ॥ ౧౨

తా. తేజోమారుతములు గూడినపుడు కొమ్మునాదమువంటి ధ్వనిగలిగి చరించిన గ్రహణకాల మనఁబడును. అప్పుడు మృత్యువు గలుగును.

త్యక్త్వాకాశం వహే ద్వాయు రంతస్థో పి న దృశ్యతే ।
ఉభయో రేవ నాడ్యో స్స్యా త్స ధూమ్ర స్సర్వనాశనః ॥ ౧౩

తా. రెండునాడులయందు వాయువు ఆకాశమునువిడిచి లోపలనుండి కనుపడకుండిన ధూమ్రమనఁబడును, ఇది సర్వకార్యముల నశింపఁజేయును.

అథ వక్ష్యే మహాదేవి ! తత్త్వానాం దర్శనక్రమమ్ ।
ఉర శ్చుబుకయో శ్చైవ పశ్యే దేకాంగుళాంతరమ్ ॥ ౧౪

తా. ఓపార్వతీ! ఇఁక పంచతత్వములను చూచెడిక్రమమును జెప్పెద, గడ్డము రొమ్ము వీనియందు ఒకయంగుళప్రమాణము దృష్టిని నిలుపవలయు.

చుబుకాగ్రే కృతా దృష్టి ర్వామ దక్షిణ సమ్ముఖమ్ ।
హనూమంతం చుబుకాగ్రే హారనాడీం తు పార్శ్వతః ॥ ౧౫

తా. ఎడమముక్కు కుడిముక్కు మధ్యమునుండి గడ్డమునకుసరిగా దృష్టినినిలిపి చూచిన నది హనుమంతనాడి. ఓరగాఁజూచిన హరనాడి యనఁబడును.

మధ్యే పృథ్వీ అధ శ్చాప ఊర్ధ్వే వహతి చానలః ।
తిర్య గ్వాయు ర్వహే చ్చైవ స్పృష్ట్వా స్పృష్ట్వా తదంబరమ్ ॥

తా. ముక్కునడుమ పృథ్వి, దిగువను అప్పు, మీఁద తేజస్సు, అడ్డముగ వాయువు, ముక్కును అంటీ అంటక ఆకాశమును సంచరించును ఇది హనుమంతనాడీక్రమము.

పృథివ్యాప స్తథా తేజో వాయు రాకాశ మేవ చ ।
అంగుళాని చ చత్వారి నాభ్యాది క్రమశోర్ధ్వగాః ॥ ౧౭

తా. నాభిమొదలుగ నాలుగేసి యంగుళములకు పైన క్రమముగా పృథివ్యాది పంచతత్త్వము లుండును.

నాసాదండం సమాశ్రిత్య ధరా వహతి వార్యధః ।
ఊర్ధ్వ మగ్ని ర్మరు త్తిర్య జ్నిరాలంబం తదంబరమ్ ॥ ౧౮

తా. పృథ్వి ముక్కుదండను నంటియు. అప్పు క్రిందుగను, తేజస్సు పొడవుగను, వాయువు అడ్డముగను, ఆకాశము ముక్కులోపల నిరాలంబమై చెదరియు పాఱును. ఇది సంధినాడీ క్రమము.

ఏవం విలక్షయే ద్దేవి! సంధినాడీ మనుత్తమామ్ ।
రహస్యం కథ్యతేఽస్మాభి స్తత్త్వసంస్పర్శనక్రమః ॥ ౧౯

తా. ఓదేవీ! ఈ క్రమంబున నత్యుత్తమంబగు సంధనాడిని చూడవలయు. ఇఁక రహస్యమైన తత్త్వముల స్పర్శన క్రమమును జెప్పెదను.

కించిదుష్ణా స్థిరా పృథ్వీ సంపూర్ణోష్ణో హుతాశనః ।
కించి చ్ఛీతో భవే ద్వాయు స్సంపూర్ణశీతలం జలమ్ ॥ ౨౦

తా. పృథివి కొంచెము ఉష్ణము, స్థిరమైన గుణముగలది. అగ్ని మిక్కిలి యుష్ణము. వాయువు కొంచెము శైత్యముగలది, జలము అతిశైత్యము గలది.

ప్రవహే త్తత్త్వ మేకం చ ద్వంద్వం నాస్తి హి సర్వదా ।
ద్వే ద్వే స్థానే చ చతురో సర్పజిహ్వేవ వీక్షయేత్ ॥ ౨౧

తా. నాడి బైలుదేరునపుడు ఒకతత్వమును ముట్టి నడుచును. రెండు తత్త్వములుగ సర్వదాఉండదు, పాము నాలుకలవలె రెండుతత్త్వములను ముట్టిచూచుట నేర్పు.

చంద్రే శూన్యా వ్యోమతేజో వాయవో భాస్కరేతరే।
అన్యత్ర పూర్ణ తత్త్వాని జ్ఞాతవ్యాని క్రమా ద్బుధైః॥ ౨౨

తా. చంద్రస్వరమందు ఆకాశ తేజోవాయువులు శూన్య తత్త్వములు. పృథ్వీ జలములు పూర్ణతత్త్వములు. సూర్యస్వరమునందు పృథ్వీజలములు శూన్యతత్త్వములు. ఆకాశ తేజోవాయువులు పూర్ణతత్త్వములు. ఈక్రమము పెద్దలచే సెలవీయఁబడినది.

చంద్రే ధరాద్యాః ప్రథమా ద్వితీయా వారుణీ మతా।
తృతీయా తైజసీ ప్రోక్తా తత్త్వానాం ఘటికా క్రమాత్॥ ౨౩

తా. చంద్ర స్వరమునందు మొదటిగడియ భూమితత్త్వము. రెండవది జల తత్త్వము. మూఁడవది తేజస్తత్త్వము. నాలవది వాయుతత్త్వము. అయిదవది ఆకాశ తత్త్వము ఈక్రమమున తత్త్వముల గడియలు తెలియఁదగినవి.

వాయవ్యాద్యా ఘటీచాగ్నే ర్ద్వితీయా ఘటికా భువః।
తృతీయా వారుణీ జ్ఞేయా చతుర్థీ ఘటికా మతా॥
ఆకాశం పంచమం ప్రోక్తం భానునాడ్యా మితిక్రమాత్॥ ౨౪

తా. సూర్యనాడియందు మొదటిగడియ వాయువు. రెండవది తేజస్సు. మూఁడవది భూమి, నాలవది జలము, అయిదవది ఆకాశము.

చంద్రే పృథివ్యా స్సౌమ్య స్స్య దపాం సోమః ప్రకీర్తితః।
తేజసో భార్గవః ప్రోక్తో వాయో ర్గురు రితి స్మృతః॥ ౨౫
ఆకాశే కేతు రిత్యుక్తో వామనాడ్యా మితి క్రమాత్॥ ౨౬

తా. చంద్రస్వరమున పృథివీతత్త్వమునకు బుధుఁడు, జలమునకు చంద్రుఁడు, తేజస్సునకు శుక్రుఁడు, వాయువునకు బృహస్పతి. ఆకాశమునకు కేతువును అధిపతులు.

సూర్యే పృథివ్యా స్సూర్య స్తు సలిలే సౌరి రుచ్యతే।
తేజసో ऽంగారకః ప్రోక్తో వాయో రాహుః ప్రకీర్తితః।
ఆకాశే కేతు రిత్యుక్తో దక్షనాడ్యా మిమే గ్రహాః॥ ౨౭

తా. సూర్యస్వరమున పృథివికి సూర్యుఁడు, జలమునకు శని, తేజస్సునకు కుజుఁడు, వాయువునకు రాహువు, ఆకాశమునకు కేతువును అధిపతులు.

ఇడాయాం వహతే సౌమ్యం మహీం చ వారుణం తథా।
తదా సర్వార్థసిద్ధి స్స్య త్సూర్యే హానిం వినిర్దిశేత్॥ ౨౮

తా. చంద్రనాడియందు పృథివి అప్పు ఇవి సౌమ్యముగా నడచినప్పుడు సకల కార్యములు సిద్ధించును. ఆరెండుతత్త్వములు సూర్యునియందు నడచిన హాని గలుగును.

సూర్యే త్రయం వినిర్దిష్టం సౌమ్యే హానిం సమాదిశేత్ ।
అస్మిన్ త్రయం యదా దృష్టం దీప్తే శుభకరం భవేత్ ॥ ౨౯

తా. సూర్యనాడియందు తేజో వాయ్వా కాశములు మూఁడునుండిన సౌమ్య కార్యములకు హానిని, క్రూరకార్యములకు మేలును ఇచ్చును.

పృథ్వీ స్యాత్ప్రథమే యామే ద్వితీయే సలిలం శుభమ్ ।
తృతీయే చానలం సౌమ్యం చతుర్థే వాయు రంబరమ్ ॥ 30

తా. మొదటి యామమున పృథివి, రెండవ యామమున జలము, మూఁడవ యామమున అగ్ని, నాలవ యామమున వాయువు ఆకాశమును ఇట్లు ఆయా యామమునం దాయాతత్త్వము శుభకరము.

పూర్వపశ్చిమయామ్యే చ ఉత్తరే చ యథాక్రమమ్ ।
పృథివ్యాదీని తత్త్వాని బలిష్ఠాని వినిర్దిశేత్ ॥ 3౧

తా. పృథివి తూర్పునను, అప్పు పడమటను, తేజస్సు దక్షిణమునను, వాయువు ఉత్తరమునను ఇట్లు ఆయాదిక్కునం దాయాతత్త్వము బలిష్ఠము.

పూర్వస్యాభిముఖం తోయం పశ్చిమాభిముఖీ ధరా ।
ఉత్తరాభిముఖం తేజో వాయు ర్దక్షిణతోముఖమ్ ।
ఆకాశ మూర్ధ్వభాగస్థం తత్త్వానాం ముఖ ముచ్యతే ॥ 3౨

తా. జలము తూర్పుముఖముగను, భూమి పడమటి ముఖముగను, తేజస్సు ఉత్తరాభిముఖముగను, వాయువుదక్షిణముఖముగను, ఆకాశము మధ్యమునం దూర్ధ్వ ముఖముగను నుండును.

పృథివ్యాం స్థిరకర్మాణి యాని తాని శుభాని చ ।
దుర్గా ణ్యాలయ హర్మ్యాణి ప్రాసాదోపవనాని చ ॥ 33
యుద్ధకాలే నృప స్తత్ర విజయేత న సంశయః ।
యాయిన స్తు భయం భంగో విజయః స్థాయినోఽపి చ ॥ 3౪

తా. పృథివియందు స్థిరమైనకార్యములు, శుభకర్మములు, దుర్గములు, ఇండ్లు, మేడలు, ఉప్పరిగెలు, ఉద్యానములును జేయ శుభము గలుగును. యుద్ధకాలమునందు రాజునకు పృథివీ తత్త్వమైన జయముసిద్ధము. వచ్చెడిపగవానికి భయము భంగమును, స్థలమందున్న వానికి జయమును గలుగును

జలోదయే శుభం విద్యా త్ప్రశ్నకాలే సమాగతే।
సిద్ధ్యంతి సర్వకార్యాణి మనసా చింతితా న్యపి॥ 35
వివాహే మంగళం యాత్రా పట్టబంధే జయావహమ్।
వాపీ కూప తటాకా శ్చ కూట ముద్యానమందిరం॥ 36
అభిషేకే నరాణాం చ పుర గ్రామాధిరోహణే।
సముద్రతరణే యుద్ధే బీజానాం వాపనే తథా॥ 37
దేవతాస్థాపనం యజ్ఞం శాంతికం పౌష్టికం తథా।
వనితాసంగమం చైవ కర్తవ్యం తు జలోదయే॥ 38

తా. అప్పుతత్త్వము నడుచువేళ ప్రశ్నచేయ శుభము కలుగును. మనస్సున చింతించిన సకలకార్యములును అగును. వివాహమునందు మంగళకరము. యాత్రయందును పట్టబంధమునందును జయము నిచ్చును, నడబావి గుంటలు చెరువులు కూటము పూలతోటలు ఇండ్లు వీనిని కట్టించుట మొదలగు కార్యములను జలతత్త్వమున జేయ శుభము. మనుష్యులయొక్క అభిషేకమునందును, పట్టణగ్రామములయందుఁ బ్రవేశించుటకును, ఓడయెక్కి దీవులకుబోవను, యుద్ధమునకును, విత్తులుచల్లుటకును జలతత్త్వము శుభము. దేవతాప్రతిష్ఠ, యజ్ఞము, శాంతికపౌష్టికములు, స్త్రీసంగమము ఈకార్యములను జలతత్త్వమునందుఁ జేయవలయు.

తేజోగమే భవే ద్ధాని ర్మరణం వ్యాధిసంభవమ్।
కార్యహాని ర్భవే త్త్రత బీజాది ర్న ప్రరోహతి॥ 39
వివాహే విధవా చ స్యా త్తథా మృత్యువశం వ్రజేత్।
వాపీకూప తటాకాది సద్య శ్శుష్యతి తేజసి॥ 40
కలహే మృత్యు మాప్నోతి యాత్రాయాం న నివర్తతే।
శుభకర్మ చ యత్కించి త్తత్సర్వ మశుభం భవేత్॥ 41

తా. అగ్నితత్త్వమున శుభకార్యములకు హాని, మరణము, వ్యాధియుఁ గలుగును. కార్యములు చెడును. విత్తులు మొలవవు, అగ్నితత్త్వమున వివాహముచేయ విధవయగును. మృతినొందును. బావులు గుంటలు చెరువులు త్రొవ్విన నీళ్ళూరవు. యుద్ధమునేయ మృతిగలుగును. యాత్రసేయ తిరిగి రానేరదు. కొంచెముశుభకర్మములు చేసినను చెడును.

వాయుతత్త్వ సమాయోగే ప్రాణ స్సంచరతే యదా।
చరకర్మాణి సర్వాణి కర్తవ్యాని సదా బుధైః॥ 42

నవారోహణః యంత్రాణి చలనం శకటస్య చ ।
గోఽశ్వోష్ట్రి గజయానాని సిధ్యంతే తస్య లీలయా ॥ ౪౩
ఉచ్చాటనం తథా మోహో విద్వేషాకర్షణే తథా ।
యుద్ధయాత్రా వివాహాది దూరతః పరివర్జయేత్ ॥ ౪౪

తా. వాయుతత్వమునందు ప్రాణము సంచరించునపుడు చరము లగు సకల కార్యములును చేయఁదగినవి. నూతనముగా ఎక్కెడి పల్లకీలు మంచిబండ్లు ఎద్దులు గుఱ్ఱములు ఒంటెలు ఏనుఁగులు మొదలయిన వాహనముల నెక్కుటకు వాయుతత్వము మంచిది. ఉచ్చాటనము మోహనము విద్వేషణము ఆకర్షణము యుద్ధయాత్ర వివాహము ఈ కార్యములు వాయుతత్వమున సిద్ధింపవు.

సర్వ సాధారణం వ్యోమ నిష్కలం పరమేశ్వరమ్ ।
శుభాశుభ వినిర్ముక్తం లాభాలాభ వివర్జితమ్ ॥ ౪౫
యోగస్యా చలచిత్తానాం యోగినాం యోగదాయకమ్ ।
దేవార్చనం తథా దానం ప్రతిష్ఠా మంత్ర తర్పణమ్ ॥ ౪౬
మోక్షోపదేశో విజ్ఞానం సిధ్యతే వియతి స్ఫుటమ్ ।
ఇత్థం తత్త్వస్య కర్మాణి కథితాని వరాననే ! ॥ ౪౭

తా. సకల తత్వములకును సమానమయిన ఆకాశతత్వము అకల్మషమయిన ఈశ్వర స్వరూపమగుటచే శుభాశుభములు లాభనష్టములు లేనిదిగ నుండును. దృఢ చిత్తులగు యోగిజనులయొక్క యోగమునకు పరమయోగము నిచ్చును. దేవపూజ, దానము, ప్రతిష్ఠ, మంత్రోపదేశము, తర్పణము ఇవిచేయ సిద్ధించును మఱియు ఆకాశ తత్వమునందు మోక్షమార్గోపదేశము శిల్పశాస్త్రముల నభ్యసించుట. ఇవి సిద్ధించును. ఓపార్వతీ ! ఈ క్రమమున తత్వముల కార్యములను నీకుఁ జెప్పితిని.

పుత్త్రికం త్వథ నిశ్వాసః కించి ల్లక్ష్యం స్పృశే ద్యది ।
బాలస్వరం తదా జ్ఞేయం మందా న్మందఫలం భవేత్ ॥ ౪౮

తా. శ్వాసము కొంచెముగా లక్ష్యస్థానమును తాఁకియుండినయెడల అప్పుడు బాలస్వర మనంబడును. అది ఆలస్యముమీఁద కొంచెము ఫలమిచ్చును.

లక్ష్యస్థానం చ సంస్పృష్ట్వా ప్రశస్తో వహతే మరుత్ ।
స కుమారస్వరో జ్ఞేయః కార్యరూపం ద్విధా భవేత్ ॥ ౪౯

తా. స్వరము లక్ష్యస్థానమును లెస్సగా అంటి ప్రబలముగానుండిన నది కుమార స్వరమనియు (రాజ్యస్వరమనియు) జెప్పఁబడును. దీనివలన రెండింతల ఫలము గలుగును.

వహాతే సుష్వరేణైవ వ్యాపితం ఖండితం తథా ।
వృద్ధస్వర స్స విజ్ఞేయః కార్యం సంకలితం భవేత్ ॥ ౫౦

తా. శ్వాసము లెస్సగా లక్ష్యస్థానమునుతాకి దురుసుగా కొట్టిన నది వృద్ధ స్వర మనఁబడును దీనివలన కార్యములయి చెడును.

లక్ష్యం న ప్రాప్యతే శ్వాస స్తథా ప్యస్తంగతో౽పి చ ।
మృతస్వర స్తథా జ్ఞేయ స్సర్వకార్యవినాశనః ॥ ౫౧

తా. శ్వాసము లక్ష్యస్థానమును తగులకయే కనిపించి యణఁగిపోయిన నది మృతస్వర మనఁబడును. అప్పుడు సకలకార్యములు చెడును.

కించిల్లాభకరో బాలః కుమార స్త్వర్ధలాభదః ।
రాజో౽ రాజ్యప్రదో వృద్ధో మిశ్రం మృత్యౌ క్షయం భవేత్ ॥

తా. [illegible]రము కొంచెము లాభమును, కుమారస్వరము అర్ధలాభమును, రా[illegible] తెజసి ద్ధ్యలాభమును, వృద్ధస్వరము మిశ్రఫలమును ఇచ్చును. మృతస్వరము కార్యనాశమును [illegible]తుమును.

ఘ్రాణం పృథివ్యా జిహ్వా చ అపాంగేహం తు లింగకమ్ ।
తేజసో వేశ్మ నేత్రే చ వాయో ర్గేహం తు నాడికా ।
వ్యోమస్థానం శ్రుతిద్వంద్వం త త్త్వగేహా న్యమూని తు ॥ ౫౩

తా. పృథ్వికి ఘ్రాణము, జలమునకు జిహ్వ, తేజస్సుకు కన్నులు, వాయువు నకు త్వక్కు, ఆకాశమునకు చెవులును స్థానములు.

ఫలితం వక్రితం చైవ స్ఫుటితం స్ఖలితం తథా ।
జ్వలితం ధ్వంసమానం చ సుప్త మస్తమయం గతిః ॥
ఏతత్సర్వం విజానీయా ద్గదితం తవ సుందరి ! ॥ ౫౪

తా. ఫలితము వక్రితము స్ఫుటితము స్ఖలితము జ్వలితము ధ్వంసమానము సుప్తము అస్తమయము అను యెనిమిదిగతులు స్వరమునకుఁ గలవు.

గంధతోపరి సంస్పృష్టా యదా సంవహతే మరుత్ ।
ఫలితం త ద్విజానీయా త్సర్వకార్యవినాశనమ్ ॥ ౫౫

తా. శ్వాసము ముక్కుకొనమీఁద తాఁకి గట్టిగా పాఱుచుండిన ఫలితమనఁ బడును, దీనివలన నన్ని కార్యములును చెడును.

వాయుతత్త్వం పరిత్యజ్య బాహుమూలం స్పృశే ద్యది।
నివర్తతే త్వర్ధపథా వక్రితం సర్వహానిదమ్॥ ౫౬

తా. వాయు తత్త్వమును విడిచి భుజశిరమువఱకు స్వరము పాఱి మధ్యమున నిలిచి మరలిన నది వక్రిత మనఁబడును. అది కార్యములను వక్రగతిని బొందించును.

యుజ్యతే శుభతత్త్వేన స్పృష్టా తత్త్వే శుభే తథా।
స్ఫుటితం త ద్విజానీయా ద్ద్విధామార్గే శుభం భవేత్॥ ౫౭

తా. స్వరము శుభతత్త్వముతోఁగూడి రెండు శుభతత్త్వములను తాఁకినడిచిన స్ఫుటిత మనఁబడును దీనివలన రెండువిధముల శుభము గలుగును.

పూర్వోక్తేనైవ విధానేన దీప్తతత్త్వం వహే ద్యది।
స్ఫుటితం త ద్విజానీయా త్క్రూరకార్యం ద్విధా భవేత్॥ ౫౮

తా. పూర్వోక్త ప్రకారము శుభతత్త్వములయందుండి [illegible]ములయందు నడిచినను స్ఫుటితమనఁబడును, దీనివలన క్రూరకార్యములు రెం[illegible]గును.

దృశ్యతే ఽదృశ్యతే విద్యు దివ సంత్రుట్యతే [illegible]యతి।
తదాపి స్ఖలితం జ్ఞేయ ముపఘా[illegible]తం త [illegible]ుచ్యతే॥ ౫౯

తా. స్వరము కనుపించి కనుపించక మెఱుపువలె నడుమ తెగినట్టు కనుపించిన నది స్ఖలితమనఁబడును, కార్యమునకు అవగుణము గలుగును, మఱియు ఉపఘాతమనియుఁ జెప్పఁబడును.

తేజస్తత్త్వం పరిత్యజ్య దృశ్యతే ప్రజ్వలత్యపి।
కథ్యతే జ్వలితం తత్తు మహాఘాతం తదుచ్యతే॥ ౬౦

తా. తేజస్తత్త్వమును విడిచి అధికతీక్ష్ణముగా కనుపించిన నది జ్వలితము మహాఘాతము అని చెప్పఁబడును.

అత్యుష్ణం జ్వలితం తీవ్రం దృశ్యతే త్వగ్ని రుచ్యతే।
యుద్ధం చ క్రియతే భంగో భవే న్మృత్యుసమం తథా॥ ౬౧

తా. ఆ జ్వలితము అత్యుష్ణమై తేజస్తత్త్వమునంటి దురుసుగా నడిచిన నది అత్యగ్నియనఁబడును ఆకాలమున యుద్ధము చేసినయెడల మృత్యుసమానమైన భంగము గలుగును.

నాసాద్వారం సమాపూర్య ఫూత్కృతో ఽపి న దృశ్యతే।
ధ్వంసమానః ఖిలీ ఖ్యాతం కురుతే కార్యనాశనమ్॥ ౬౨

తా. శ్వాసము ముక్కునిండి వెడకలయే పడిసెముపట్టినట్లు కనఁబడకయుండిన ధ్వంసమాన మనఁబడును. దీనివలన కార్యనాశమగును.

నాడీద్వయే తద్దిశం తు మిళితా సూర్యనాడికా।
ఏక ద్వి రధికా వర్ణా వర్ణైస్తు రిక్తపూర్ణతా॥ ౬౩

తా. రెండునాడులును వానివాని దిశలయందుఁగూడఁగాఆదిక్కులయందు సమవిషమాక్షరములవలన రిక్తపూర్ణములు తెలియఁదగినవి.

అధికౌ పూర్ణరిక్తాభ్యాం శస్తౌ ప్రవేశనిర్గమౌ।
ప్రవేశ నిర్గమాభ్యాం తు తత్త్వ మేవాధికం స్మృతమ్।
ఉత్తరోత్తర మేతేషు శ్రేష్ఠం పూర్ణగుణై స్సహ॥ ౬౪

తా. శూన్యపూర్ణములకంటె ప్రవేశనిర్గమము లధికములు, వీనికంటె తత్త్వము లధికములు. పూర్ణగుణములతోఁగూడి యుత్తరోత్తరముగ శ్రేష్ఠమగును.

పృథివ్యాం దినసంఖ్యా చ సలిలే ఘటికా భవేత్।
తేజసి మాససంఖ్యా స్యా ద్వాయౌ సంవత్సరం ఫలమ్॥ ౬౫

తా. పృథ్వీతత్త్వమందు ఫలము దినసంఖ్యయందుండును, జలతత్త్వమున ఘటికాసంఖ్యయందును, తేజస్తత్త్వమున మాస సంఖ్యయందును, వాయుతత్త్వమున వర్షసంఖ్యయందును ఉండును.

సంపూర్ణే ఘటికాసంఖ్యా పాదహీనే దినం తథా।
అర్ధేతు మాససంఖ్యా తు పాదే సంవత్సరం ఫలమ్॥ ౬౬

తా. తత్త్వము పూర్ణముగ తాఁకి నడచిన ఒకగడియఫలము. తత్త్వము మూఁడుపాళ్లుగ నడచిన ఒకదినము ఫలము. అరపాలు నడచిన నొకమాసము ఫలము. పాతికపాలు నడచిన ఒకసంవత్సరము ఫలమును అగును.

యత్తత్త్వంప్రథమం స్పృష్ట్వా పశ్చాద్యంయంవ్రజేత్క్రమాత్।
ఏతేషాం శాంతికర్మాణి సువిచార్యైవ కారయేత్॥ ౬౭

తా. ముందర ఏతత్త్వమునంటి వెనుక ఏతత్త్వమును పొందునో అందుకుఁ దగిన ఫలమును పొందును. ఆతత్త్వమందుఁ జేయఁదగిన శాంతికర్మములు విచారించి చేయఁదగును.

పృథ్వీతత్త్వే సుఖాసీన అప్తత్త్వే తు సమాగతః।
అగ్నౌ నిద్రా చరే ద్వాయౌ వాకాశే ధ్యానసంస్థితిః॥ ౬౮

తా. పృథ్వీతత్త్వమున సుఖముగఁ గూర్చున్నాఁడనియు, అప్పుతత్త్వమున ఎదురుగావచ్చుననియు, తేజస్సుందు నిద్రపోవుచుండు ననియు, వాయుతత్త్వమున తిరుగు

చున్నాఁడనియు, ఆకాశమునందు ధ్యానము చేయుచున్నాఁడనియు పృచ్ఛకునికిఁ జెప్పునది.

ఆగచ్ఛే జ్జలతత్త్వే తు క్షితౌ తత్రైవ సంస్థితిః ।
అన్యత్రాపి గతో వాయౌ రుజా వహ్నౌ మృతి స్తు ఖే ॥ ౬౯

తా. ఊరికిఁబోవు ప్రశ్నకు జలతత్త్వమైన వచ్చును, పృథివీ తత్త్వమైనవచ్చటనే యుండును, వాయుతత్త్వమైన వేఱొకచోటికిఁ బోవును. తేజస్తత్త్వమయిన రోగము పుట్టును. ఆకాశమయిన మృతిబొందును.

లాభకార్యం జలే చైవ భుక్తౌ భోగే ధరా శుభా ।
జయ స్తేజసి సంగ్రామే మారుతౌ చ పలాయనమ్ ॥ ౭౦

తా. అప్తత్త్వము లాభకార్యమునకును, పృథివీతత్త్వము భోజనమునకును భోగమునకును, తేజస్తత్త్వము యుద్ధజయమునకును, వాయుతత్త్వము పలాయనమునకును మంచిది.

పార్థివే చ భవే ద్యుద్ధం సంధి ర్భవతి వారిణి ।
విజయో వహ్ని తత్త్వే చ వాయౌ భంగో మృతి స్తు ఖే ॥ ౭౧

తా. యుద్ధప్రశ్నయందు పృథివీతత్త్వమున యుద్ధము సిద్ధము, అప్తత్త్వమున సమాధానము, తేజస్సున జయము, వాయువునందు భంగము, ఆకాశమునందు మృతియు గలుగును.

యాయిన స్తు భయం భంగః పృథ్వీతత్త్వం వహే ద్యది ।
తస్మా త్సంగ్రామసమయే స్థాయీ జయతి నిశ్చయమ్ ॥ ౭౨

తా. పృథ్వీతత్త్వమున యుద్ధమునకుఁబోయిన భంగము భయమును గలుగును. స్థలమందున్నవానికి యుద్ధకాలమున జయము సిద్ధము.

యదా సంగ్రామకాలే తు అపాంతత్త్వం వహే ద్యది ।
యాయిన స్తు జయం తత్ర స్థాయీ భంగం మహాభయమ్॥ ౭౩

తా. యుద్ధకాలమందు అప్తత్త్వమైనయెడల యుద్ధమునకుఁబోవువానికి జయము, స్థలమందున్న వానికి భంగము మహాభయమును గలుగును.

తత్త్వజాతి భేదములు.

వ్యోమతత్త్వం దేవజాతి చాగ్ని స్తు క్షత్రియో మతః ।
అపాంతత్త్వం వైశ్యజాతి క్షితి శ్శూద్ర ఇతి స్మృతః ॥ ౭౪

తా. ఆకాశము దేవజాతి. అగ్ని క్షత్రియజాతి. అప్పు వైశ్యజాతి. పృథ్వి శూద్రజాతి.

తత్త్వానాం జాతి రేవం స్యా త్సంకర స్తు ప్రభంజనః ।
యత్తత్త్వం వర్తతే యస్య తస్య తజ్జాతి రుచ్యతే ॥ ౭౫

తా. వాయువు మిశ్రజాతి. నాడీప్రవేశకాలమున ఏతత్వమునడుచునో ఆజాతి యని చెప్పనది ఇట్లు జాతిభేదముల నెఱుంగవలయు.

ఏవం విలక్షయే ద్యోగీ హ్యేకచిత్త స్సమాహితః ।
జ్ఞానాగమవిచారేణ ధ్యానారూఢేన వా పునః ॥ ౭౬

* ఇత్యుమామహేశ్వర సంవాదే, స్వరచింతామణౌ
తత్త్వప్రకరణన్నామ దశమోఽధ్యాయః. *

తా. యోగియగువాఁడు ధ్యానారూఢుఁడై జ్ఞానాగమశాస్త్రవిచారములవలన నేకచిత్తముతో సమాహితుఁడై బాగుగ నీ క్రమమునుచూచిన తత్వములు బాగుగఁ దెలియును. నిర్మలజ్ఞాన సంపన్నుఁడగును.

---

ఏ కా ద శో ఽ ధ్యా యః.

ద్వారం వై మూత్ర విష్ఠానాం గుదం వా గోళకాః క్రమాత్ ।
ప్రేక్షేత స్వరతత్త్వేన స్థానే ష్వేతేషు సప్తసు ॥ ౧

తా. మల మూత్ర ద్వారములు ఆసనము మొదలగు సప్తగోళక స్థానములను స్వరతత్వములచేఁ జూడవలయు.

నాసికే నయనే శ్రోత్రే ముఖం మేఢ్రం గుదం తథా ।
గోళకా శ్చేతి విజ్ఞేయా స్థానా న్యేతాని సప్త చ ॥ ౨

తా. ముక్కు, కన్నులు, చెవులు, నోరు, లింగము, గుదము ఈ యేడును గోళస్థానము లనఁబడును.

మూలస్వర విచారజ్ఞో గోళకాం శ్చ విలక్షయేత్ ।
అస్తే చాస్తమితా నాడీ లంబే నోదయ మాదిశేత్ ॥ 3

తా. మూలస్వరము తెలిసిన జ్ఞాని, తన రెండు బీజములను చూచినపుడు ముడుక్కియుండిన అస్తమానమనియు వ్రేలుచుండిన ఉదయమనియు తెలిసికొనవలయు.

సత్యక్సంక్రమణం చైవ ఆకర్షం చ యథో త్తరే ।
యదా ప్రత్యూషకాలే చ చింతయే త్సతతం బుధః ॥ ౪

తా. రెండు బీజములును సమముగా ఎప్పుడుండునో అప్పుడు సంక్రమమనఁ బడును. ఎప్పుడు ఒకటియెక్కి యొకటి తగ్గి యుండునో దానిని చూచి తెలిసికొన వలయు. బుద్ధిమంతుఁ డగువాఁడు తన కార్యసిద్ధి కొఱకు ఉదయకాలమున నిత్యము కనుగొనవలయు.

రక్తే సూర్య స్సితే చంద్రో మూత్రద్వారే విలక్షయేత్ ।
రక్తే చ కార్యహాని స్స్యా త్సితే కార్యం చ సిధ్యతి ॥ ౫

తా. మూత్రధార ఎఱుపుగనుండిన సూర్యుఁడు, తెలుపుగనుండిన చంద్రుఁడు, ఎఱుపుగ నుండిన కార్యహాని, తెలుపుగ నుండిన కార్యసిద్ధి యగును.

ఏకాధారా భవే త్సిద్ధి ర్బహుధారా వినాశయేత్ ।
నిశ్శబ్దే కార్యసిద్ధి స్స్యా చ్ఛబ్దే కార్యం వినశ్యతి ॥ ౬

తా. మూత్రధార ఒక్కటిగానుండిన కార్యసిద్ధి, రెండుగానుండిన కార్యహాని గలుగును, శబ్దము లేకుండిన కార్యసిద్ధి, ధ్వనియుండిన కార్యహాని గలుగును.

ఫూత్కారే చార్థసిద్ధి స్స్యా ఢ్ఢుకారే కార్యనాశనమ్ ।
శృంగనాదే భవే న్మృత్యుః ఠరశబ్దే చ రోగదః ॥ ౭

తా. మలవిసర్జన కాలమున ఫూత్కారధ్వనియైన అర్థలాభము, ఢుకార ధ్వనియైన కార్యనాశనము, కొమ్ము పూరించిన శబ్దము గలిగిన మరణము గలుగును. ఠర నాదమయిన రోగము వచ్చును.

అథ మూత్రం పతే ద్భూమౌ తదా చంద్రోదయో భవేత్ ।
ఆదౌ పురీషే పతితే తదా సూర్యోదయో భవేత్ ॥ ౮

తా. ముందు మూత్రము జారిన చంద్రస్వరమనియు, మలముజారిన సూర్య స్వరమనియు తెలియవలయు.

మూత్రం పురీషం వాయు శ్చ సమతో యాంతి భూతలే ।
తద్దినం విషతుల్యం స్యా త్సప్తాహా న్మ్రియతే ధ్రువమ్ ॥ ౯

తా. మూత్రము, మలము, వాయువు, ఈ మూడును ఏకకాలమునందు జారిన ఆదినము విష తుల్యము. వానికి ౭ దినములలో మరణము గలుగును.

వామే చరే చ్ఛుభం విద్యా దశుభం దక్షిణస్థితా ।
జయో లాభో భవే ద్వామే మృత్యు హాని శ్చ దక్షిణే ॥ ౧౦

తా. మూత్రధార ఎడమ ప్రక్కగావచ్చిన శుభము జయలాభములు గలుగును. కుడిప్రక్కవచ్చిన నశుభము, హానిమృత్యువులు గలుగును.

నోష్ణశీతం ప్రసరతి న స్పృశే దింద్రియం తదా।
మూలస్వరస్య అభ్యాసం యః కరోతి స బుద్ధిమాన్ ॥ ౧౧

తా. అత్యుష్ణము శైత్యముగాక మాత్రము జారిన తాఁకిచూడకయే ఉదయ కాలమునందు తెలియవలయు. ఈమూల స్వరాభ్యాసము నెవరుచేయుదురో వారు బుద్ధిమంతులు.

దినోదయే తు సంవీక్ష్య మూలస్వర దినస్వరమ్ ।
శుభం వా ప్యశుభంవా పి ఆరాత్రం చ ఫలం భవేత్ ॥ ౧౨

తా. ఉదయకాలమున మూలస్వర వారస్వరములను చూడఁగా శుభముగాని అశుభముగాని నాటిరాత్రి పర్యంతము ఒకదినమంతయుఁ గలుగును.

ఆదౌ చ కాలో విజ్ఞేయః పశ్చా ద్దేహబలం భవేత్ ।
అన్య త్ర త్సంస్ఫుటం వక్ష్యే దేహకాలస్య నిర్ణయమ్ ॥ ౧౩

తా. మొదట ఆయుష్యమును తెలిసికొని పిదప దేహబలమును విచారించవల యు. దేహకాలనిర్ణయము మఱియొక విధముగా స్పష్టముగఁ జెప్పెద.

పృథివ్యాప స్తథా తేజ స్త త్త్వం త్రివిధం విదుః ।
ఖండితే ఖండితో లాభ స్సంపూర్ణే పూర్ణలాభదః ॥ ౧౪

తా. పృథ్వి అప్పు తేజము నీ మూడును మూడువిధములుగ నుండును.తత్వము ఖండముగానుండిన ఖండఫలమును, పూర్ణముగనుండిన పూర్ణఫలమును గలుగును.

ఆదౌ చ స్రవతే తోయం పశ్చా త్పృథ్వీ పతే ద్యదా।
యాత్రాసిద్ధి మవాప్నోతి సంగ్రామే చ జయో భవేత్ ॥ ౧౫

తా; ముందర మూత్రముజారి, వెనుక మలము జారిన అప్పుడు యాత్రాసిద్ధి యగును. యుద్ధమందు జయము గలుగును.

అగ్రేచాప స్తతో వాయుః పృథ్వీ కాలానలోఽపి వా।
యాత్రాయాం మధ్యమో లాభ స్సంగ్రామే క్షతితో భవేత్ ॥

తా. ముందర జలము, తర్వాత వాయువు, వెనుక మిక్కిలి వేడిగామలమును జారిన యాత్రయందు మధ్యమలాభము, యుద్ధమందు గాయమును గలుగును.

అగ్రేచాప స్తతో వాయుః పృథ్వీచాపః పతే ద్యది।
సప్తాంగం హారతే యుద్ధే యాత్రాయాంలాభమాప్నుయాత్ ॥

తా. ముందర జలము, వెనుక వాయువు, తర్వాత పృథ్వి, కడపట జలము ఈ రీతిని క్రమమించిన యుద్ధమందు శత్రువుల సప్తాంగములను దీసికొనివచ్చును. యాత్ర యందు లాభమును పొందును.

అగ్రే జలం తతో భూమిః ఫేనోవాపి సితోపి వా ।
యాత్రాయాం స్వల్పలాభస్స్యా త్సంగ్రామే సక్షతోభవేత్ ॥

తా. మొదట జలము, వెనుక మలమును నురుగుగాజారి తెలుపుగానుండిన యాత్రయందు స్వల్పలాభము, యుద్ధమందు గాయమును గలుగును.

అగ్రేచాంబు స్తతో వాయుః పశ్చా ద్భూమిః పతే ద్యది ।
తద్దినే ప్రారభే ద్యాత్రాం సంగ్రామే హయలాభదః ॥ ౧౯

తా. మొదట జలము, వెనుక వాయువు, తరువాత మలమునుజారిన ఆదినమున యాత్రశుభప్రదము. యుద్ధమందు గుఱ్ఱములఁబట్టుకొని వచ్చును.

అగ్రే పృథ్వీ తతో హ్యాప స్స్రవతే యదివా పునః ।
యుద్ధే భంగో మహాహాని స్తద్దినే భయ మాదిశేత్ ॥ ౨౦

తా. ముందర మలము, వెనుక జలము, రెండు మూడుమారులు పడిన యుద్ధ మందు భంగము, ప్రయాణమందు హానియుగలుగును. ఆదినమున భయమును పొందును.

అగ్రే పృథ్వీ తత స్తోయం పృథ్వీచాపః పునః పునః ।
యుద్ధే భ్రమతి భీతి స్స్యా త్ప్రయాణే సంభ్రమో భవేత్ ॥

తా. మొదట మలము, వెనుక జలము పలుమారుజారిన యుద్ధమందు కలవర పడును, ప్రయాణమునందు వ్యాకులము బుట్టును.

ఫేనోపమా తు యా పృథ్వీ శిథిలా పతతే భువి ।
సైన్యభంగో భవే త్తస్య యస్య వారి ప్రజాయతే ॥ ౨౨

తా. మలము నురుగుగా జారినవెనుక జలము జారిన వారి సేనకు భంగము గలుగును.

అగ్రే వాయు స్తతః పృథ్వీ తోయం వాయు శ్చ దృశ్యతే ।
తద్దినే వర్జయే ద్యాత్రాం సంగ్రామం చ న కారయేత్ ॥ ౨౩

తా. మొదటవాయువు వెనుకమలము, తరువాత జలము వాయువు క్రమమించిన ఆ దినమున యాత్రను, యుద్ధంబును జేయరాదు.

అగ్రే వాయు స్తత స్తోయం ప్రవతే యదివా పునః।
భూమౌ నిపతితా పృథ్వీ సంగ్రామే పమతాం వ్రజేత్॥ ౨౪

తా. మొదట వాయువు వెనుక జలమును జారి తిరిగిజలముబొట్లుగాపడి యామీఁద మలముపడిన యుద్ధయాత్రలయందు సమబలముగానుండును.

అగ్రే వాయు స్తతో వాయు ర్వాయుర్వాయుః పునః పునః।
తద్దినే వర్జయే ద్యాత్రాం సంగ్రామం చ న కారయేత్॥ ౨౫

తా. మొదట వాయువు తర్వాత వాయువు అడుగడుగునకు వాయువు వచ్చిన ఆదినమున యాత్ర చేయఁగూడదు.

అగ్రే తోయం తత స్తోయం తోయం తోయం పునః పునః।
యాత్రాయాం లభతే సిద్ధిం సంగ్రామే విజయో భవేత్॥ ౨౬

తా. మొదట జలము తర్వాత జలము పిమ్మట అడుగడుగునకు జలము పడుచుండిన యాత్రాసిద్ధి యుద్ధమందు విజయమును గలుగును.

అగ్రే భూమి స్తతో భూమి ర్భూమి ర్భూమిః పునః పునః।
నిష్ఫలా హి భవే ద్యాత్రా సంగ్రామే భంగ మాదిశేత్॥ ౨౭

తా. ముందర మలము వెనుక మలము అడుగడుగునకు మలము ఇట్లుజారుచుండిన యాత్రయందు ఫలములేదు, యుద్ధమున భంగముగలుగును.

పృథి వ్యాప శ్చ వాయు శ్చ ఏకత్ర ధరణీతలే।
తద్దినే వర్జయే ద్యాత్రాం సంగ్రామే మృత్యు మాదిశేత్॥ ౨౮

తా. మల మూత్ర వాయువు లేకకాలమున భూమిమీఁదఁ బడిన ఆదినమున యాత్రచేయరాదు. యుద్ధమున మృత్యువుగలుగును.

పీతం ర క్తం తథా శ్యామం వర్ణా శ్చ శుభకర్మసు।
అతికృష్ణం భవే త్పృథ్వీ వర్జయే చ్ఛుభకర్మసు॥ ౨౯

తా. మలము పచ్చగ ఎఱుపుగ శ్యామలవర్ణముగ నుండిన శుభకర్మలుసేయ మేలగును. మిక్కిలినలుపుగనుండిన శుభకర్మలు సేయఁగూడదు.

ఆప శ్చంద్రో రవిః పృథ్వీ ద్వయో రేకత్ర సంభవః।
ప్రత్యేకత్వే జయో వృద్ధి రేకత్ర మరణం భవేత్॥ 30

తా. అప్పుచంద్రుఁడు, పృథ్వి సూర్యుఁడుఈరెండుతత్వములయందు మలమూత్రములు ప్రత్యేకముగాఁబడిన శుభము రెండునుఏకకాలమునఁబడిన మరణము గలుగును.

విషంచా ప్యమృతంచైవ అమృతం చ విషాయతే।
ప్రత్యక్షయోగం సౌమ్యం చ మధ్యం చ సమతాంవ్రజేత్ ॥ 3౧

తా. తత్వయోగమువలన శుభతత్వము అశుభతత్వముతో గూడిన విషము అమృతమగును. అశుభతత్వము శుభతత్వముతో గూడిన అమృతము విషమగును. ప్రత్యక్షముగా గూడుటవలన సౌమ్య మగును. తత్వముసమముగానుండిన ఫలము సమముగా నుండును.

ఆదా వాప స్తతో వాయు ర్భూమి శ్చై వం స్వభావతః।
క్రమా త్త్రిత త్త్వే విజయీ యద్దినే యాతి జాగృతః॥ 3౨

తా. మొదట జలము, వెనుక వాయువు ఆమీద మలము ఈరీతిని క్రమముగ బడినవారికి జయము సిద్ధముగాఁ గలుగును.

ఆదౌ పృథ్వీ తతః పృథ్వీ చాగ్రే ఉష్ణః ప్రజాయతే।
తత్క్షణా జ్జయతే రాజా యుధి శత్రుం గజాధిపమ్॥ 33

తా. మొదట మలముపడి ఆతర్వాత మలముఅత్యుష్ణముగాజారిన యుద్ధమునందు గజపతినైన జయించును.

సోష్ణం శుభ్రం స్రవే దాపో జయో లాభ శ్చ దృశ్యతే।
జలం జ్వల ద్భవే ద్ఘాతం మృత్యు స్తేషాం విధీయతే॥ 3౪

తా. జలము ఉష్ణముగను తెల్లగనుజారిన జయలాభములు గలుగును. ఆజలము మంటతో వెడలిన యుద్ధమందు గొప్పగాయము తగులును. పిదప మృతిబొందును.

అగ్రే చ శీతలం తోయం స్థిరం సంపూర్ణరూపి చ।
ఉదితం తద్భవే న్మృత్యు రపి దేవేన రక్షితః॥ 3౫

తా. ముందర జలము చల్లగా తడవుగా నిండారుగా వచ్చిన, దేవునిచే రక్షింపఁబడినను మృత్యువును పొందును.

ధారా చ స్రవతే తోయం జయో లాభ శ్చ దృశ్యతే।
స్ఫుటితే భంగ మాయాతి యోవిశే ద్వజ్రపంజరమ్॥ 3౬

తా. మూత్రధార ఏకముగా నెడతెగకవచ్చిన జయము లాభము కనిపించును. ధార బొట్లుగా పడిన వజ్రపంజరమందున్నవానికైనను భంగము వచ్చును.

జయ శ్చ దక్షిణావర్తే వామావర్తే భయం భవేత్।
ఊర్ధ్వం గచ్ఛతి తోయం చ జయో లాభ శ్చ దృశ్యతే॥ 3౭

తా. మూత్రధార కుడిప్రక్కఁబడిన జయము. ఎడమప్రక్కఁబడిన భయము, ధార ఊర్ధ్వముఖముగఁ బడిన జయలాభములు గలుగును.

శోణితం శుక్లసంయుక్త మగ్రే చ ప్రసవతే యది ।
శుభం వా ప్యశుభం వాపి వ్యాధిరూపేణ దృశ్యతే ॥ ౩౮

తా. ముందరమూత్రధార శుక్లముతోను నెత్తురుతోను గూడిపడిన శుభాశుభములను, వ్యాధినిపట్టి కనవలయు.

ఉత్థాపనం భవేల్లింగం గోళకో లంబతే యది ।
అగ్రేభవతి చోష్ణం చ సంగ్రామే విజయో భవేత్ ॥ ౩౯

తా. మేఢ్ర ముత్థాపనమయినపుడు బీజములు సనుసుగా వ్రేలి ముందర వెచ్చగా మూత్రధారపడిన యుద్ధమందు గెలుచును.

అదా చ పతితే మూత్రే ఊర్ధ్వం గచ్ఛతి గోళకః ।
తద్దినే వర్జయే ద్యాత్రాం సంగ్రామే భంగ మేతి చ ॥ ౪౦

తా. ముందర మూత్రముజారి బీజములు రెండును పొడుగుగా ఎత్తియుండిన ఆదినమున యాత్ర చేయరాదు. యుద్ధమందు భంగమువచ్చును.

అర్థలాభో ద్విధారే చ చరితం సుప్రసిద్ధిదమ్ ।
మధ్యే చ సమతా యుద్ధే మృత్యు ర్భంగ శ్చ దృశ్యతే ॥ ౪౧

తా. మూత్రధార రెండుఅయి జారిన అర్థలాభము, నడుమ సమముగనుండిన రెండల వానికి యుద్ధమున భంగము మృత్యువును గలుగును.

యదా తు శీఘ్రం లింగం చ ప్రకంపే ద్వరయోషితః ।
దర్శనాదేవ యస్యైవ యుద్ధే జయతి నిశ్చయమ్ ॥ ౪౨

తా. సంగమ కాలమున స్త్రీనికన్నక్షణమున లింగ ముత్థాపనమయినవానికి యుద్ధమందు జయము సిద్ధము.

జలే విష్ణు స్థలే బ్రహ్మా తేజో రుద్ర ఉదాహృతః ।
సంయోగే చ వియోగే చ తత్ఫలం లభతే నరః ॥ ౪౩

తా. జలమునకు విష్ణువు, పృథివికి బ్రహ్మ, తేజస్సునకు రుద్రుఁడు అధిదేవతలు, వీనియొక్క సంయోగ వియోగములవలన నరుఁడు ఆ యా ఫలమును పొందును.

లంబే చ స్యా దపాంత త్త్వం సమత్వేనైవ మేదినీ ।
విషమే వాయుత త్త్వం చ వహ్ని స్స్యా త్త్రితయే సమే ॥ ౪౪

* ఇత్యుమామహేశ్వరసంవాదే స్వరచింతామణౌ మూలస్వర ప్రకరణం నామ ఏకాదశోఽధ్యాయః. *

శూన్యే వహతి వామే చ నామ యస్య సమాక్షరమ్ ।
జయతే నాత్ర సందేహో నాడీమధ్యే చ లక్షయేత్ ॥ ౧౫
దక్షనాడీ ప్రవాహే చ య శ్శూన్యే విషమాక్షరమ్ ।
తదా మహాబలో భూత్వా జయతే నాత్రసంశయః ॥ ౧౬
య స్తు సంగే భవే ద్వాయు రావిశే త్తత్ర పృచ్ఛతః ।
తస్య ఘాతో మృతి ర్నాస్తి బహిస్థో మ్రియతే స్ఫుటమ్ ॥ ౧౭
చంద్రస్యామంత్రణే సూర్య స్సమాగచ్ఛే దనర్థకమ్ ।
తదా కార్యస్య హాని స్స్యా త్కాలేనామంత్రణంభవేత్ ॥ ౧౮

తా. సూర్యనాడిప్రవేశమునందు సమాక్షరములుగను చంద్రనాడి పోవువేళ విషమాక్షరములుగను ప్రశ్న చేయ విషమనఁబడును (౧౧) చంద్రనాడివచ్చువేళ పూర్ణస్థానమందుండిన ప్రశ్న చేసినను చేయకపోయినను జయముగలుగును (౧౨) సూర్యనాడి జీవముగానుండునపుడు దూతప్రశ్న చేయ తోడనే సంక్రమించిన మొదటివానికి భంగము, రెండవవానికి జయముగలుగును (౧౩) చంద్రనాడి జీవముగానుండువేళ అడిగినతోడనే సంక్రమించిన మొదటివానికిజయము, రెండవవానికిభంగముగలుగును(౧౪) చంద్రనాడి శూన్యముగనుండువేళ ప్రశ్న చేయ ఎవనిపేరు సమాక్షరములుగ నుండునో వానికిజయముసిద్ధము (నాడినడుమ చూచునది) (౧౫) సూర్యనాడియందు శూన్యభాగమందు ప్రశ్న చేసినపుడు ఎవనిపేరుసమాక్షరములగునో వాఁడుమహాబలుఁడై జయమును చేకొనును (౧౬) నాడియొక్క ప్రవేశకాలమందు ప్రశ్నయడిగిన గాయముగలదు చావులేదు. స్వరము పోవువేళ యడిగిన మృతిబొందునని చెప్పవలయు (౧౭)చంద్రుని స్మరించి ధ్యానముసేయ చంద్రస్వరమువచ్చినయెడల యుద్ధమునందు శత్రువులగుంపులో సింహమువలె తిరుగును. చంద్రస్వరము రావలెనని ప్రార్థించువేళ సూర్యస్వరమువచ్చిన యనర్థముగలుగును. మఱియుమునిచేఁ బిలువఁబడును. (౧౮)

యుద్ధే జలోదయే చంద్రే నాస్తి లోహాదిపాతనమ్ ।
యుద్ధం భవతి సూర్యే చ శూన్య స్థశ్చే త్పలాయతే ॥ ౧౯
చంద్రే పృథివ్యాం యుద్ధం స్యా జ్జలే సంధిం సమాదిశేత్ ।
తేజ స్తత్త్వే భవే ద్ఘాతో వాతే భంగో మృతి స్తు ఖే ॥ ౨౦
భానౌ పృథివ్యాం ఘాత శ్చ పానీయే స్యా త్పలాయనమ్ ।
తేజసి జయ మాప్నోతి వాయౌ యుద్ధే పలాయనమ్ ॥ ౨౧

వ్యోమతత్త్వే భవే ద్ఘాతో యద్వా యుధ్యతి వానరః ।
రణభూమౌ మృతి ర్నాస్తి గృహాగమనతో మృతిః ॥　　౨౨

తా. యుద్ధప్రశ్నకాలమున చంద్రునిలో జలతత్త్వముండిన కత్తులు శరీరమందు తాకవు. సూర్యస్వరగమైతే యుద్ధముగలుగును. శూన్యస్థానమందడిగిన పలాయనమగును (౧౯) చంద్రస్వరమునందు పృథ్వియైన కలహము, అప్తత్త్వమైన సంధి, అగ్నితత్త్వమైన గాయము, వాయుతత్త్వమైన పలాయనము, ఆకాశ తత్త్వమైన మరణముగలుగును (౨౦) భానునాడియందు పృథ్వియైన గాయము, జలమయిన పలాయనము, తేజస్సు అయిన విజయము, వాయువయినయెడల పలాయనము అగును (౨౧) ఆకాశతత్త్వమైనయెడల యుద్ధమునగాయము తాకిరణభూమియందుమృతిలేక యింటికివచ్చి మృతినొందును (౨౨)

యదా నాడీ ద్వయం నాస్తి తదా వైరిమృతి ర్భవేత్ ।
జయం పరాజయం జ్ఞేయం కర్మణా చ యథోచితమ్ ॥　　౨౩

తా. ఎప్పుడు రెండునాడులును లేకయుండునో అప్పుడు శత్రువు చచ్చును. జయాపజయములను ఆసమయమునకు తగినట్లు చెప్పవలెను (౨౩)

భానువారస్య రాత్రౌ తు భానునాడ్యాం సుఖం స్వపేత్ ।
ప్రాత శ్చంద్రే జలే జాతే తదా తస్య జయో భవేత్ ॥　　౨౪
భానువారే చంద్రనాడ్యాం సుప్తో భానౌ ప్రబోధితః ।
ఆకాశే తు గతో యుద్ధం స సద్యో మ్రియతే నరః ।　　౨౫
వామే వా యది వా దక్షే యస్య వాయుః ప్రవర్తతే ।
ఆదౌ తత్పాద ముద్ధృత్య నిర్గచ్ఛే న్నిజమందిరాత్ ॥　　౨౬
గృహం చంద్రేణ నిష్క్రమ్య ప్రవిష్టో భానునా రణే ।
శూన్యాంగే యస్య వా వైరికరస్థోఽపి జయీభవేత్ ॥　　౨౭
స్థాయీచే త్పూరకే గచ్ఛే ద్గృహే చ్చంద్రే జయో భవేత్ ।
యాయీ చ నిర్గమే ద్దేహం భాస్కరేణ జయో భవేత్ ॥ ౨౮

తా. సూర్యునివారమున రాత్రి సూర్యనాడియందు సుఖనిద్రజెంది మరునాడుదయకాలమందు చంద్రనాడిలో మేల్కొని జలతత్త్వమునందు నడుముకట్టి యుద్ధమునకు బోవ ఆబంటు జయమును చేకొనును (౨౪) భానువారమురాత్రి చంద్రస్వరమున నిద్రించి భానునాడియందు మేలుకొని ఆకాశతత్త్వమందు నడుముగట్టి యుద్ధమునకు బోవ వెంటనే చచ్చును (౨౫) సూర్యచంద్రు లేనాడియందున్నారో ఆపాదమును ముందునిచి యిల్లుబయలువెడలిన జయముగలుగును (౨౬) చంద్రస్వరమున నిల్లుబయలు

విడలి సూర్యస్వరమున రణముజొచ్చి శూన్యభాగమున నైరినునిచికొని యుద్ధముచేయ దానుపట్టువడినను జయించును (౨౭) స్థాయియగువాఁడు చంద్రస్వరమునందు పూరకముచేసికొని యిల్లుబయలుదేరిన జయము, వచ్చినవాఁడు సూర్యస్వరమునందు రేచకముచేసికొని యిల్లు బయలువెడలిన జయము గలుగును (౨౮)

సింహే వృషే జయే త్సూర్యే ధ్వజే నాగే చ చంద్రమాః ।
యుద్ధం కుర్యాత్తు భేదం వై యాయిస్థాయినో విచార్యతు॥ ౨౯

తా. సింహవృషభములయందు సూర్యస్వరముండిన జయము, ధ్వజమందును నాగమందును చంద్రస్వరముండిన జయము. యుద్ధముచేయుటకు యాయిస్థాయు లీ భేదమును తెలిసికొనవలయు (౨౯)

యస్యాం దిశి జయోఽస్త్యస్య ప్రభోరితి చ పృచ్ఛతి ।
తదాత్మన స్తు యద్వాయు స్తస్యాం దిశి జయో భవేత్ ॥ ౩౦

తా. రాజునకు ఏదిక్కున జయముగలదు అని యడిగినప్పుడు తనకు ఏ స్వరమున్నదో ఆస్వరముదిక్కున జయముగలదని చెప్పవది (౩౦)

ఆధారస్థానకే జీవ శ్చాదినామ్నో జయో రణే ।
ఆధారే నిర్గమే చూన్యే మ్రియతే ప్రథమో నరః ॥ ౩౧
ఆధారం నాస్తిచేత్ప్రశ్నే సంధిం తత్ర సమాదిశేత్ ।
ఆధారేణ భవే త్సిద్ధం ద్వయో ర్యుద్ధం న సంశయః ॥ ౩౨
సర్వే చ బలినో యోధా యే స్థితా శ్శక్తిమండలే ।
శూన్యస్థ శ్శత్రుసంఘాతః పూరకే యది తే స్థితాః ॥ ౩౩
అన్యథా యే స్థితా స్తేషాం మరణం త్వవిదూరతః ।
తైస్తు సార్థం న గంతవ్యం రణభూమే ర్మనీషిభిః ॥ ౩౪
రథం జయతి భూమ్యాం చ పదాతే ర్విజయో జలే ।
మతంగానాం శ్చ జయే ద్వహ్నౌ వాయౌ తు వాజినాంజయః ॥ ౩౫

తా. ఆధారమందుండి స్వరము జీవముగావచ్చువేళ ప్రశ్న చేయ మొదటిపేరువానికి జయము. ఆధారమందు స్వరము పోవువేళ శూన్యమైనయెడల మొదటివానికి మరణముగలుగును (౩౧) ఆధారములేనివేళ ప్రశ్న చేసినయెడలసంధియగును. ఆధారము సిద్ధించినయెడల ఇద్దరికిని యుద్ధముసిద్ధము (౩౨) బలవంతులగు ఏయోధులు శక్తిమండలము నందుండి పూరకము చేసికొని యుద్ధముచేయుదురో వారందఱును శత్రుసమూహమును పరిహరించి జయమును చేకొందురు (౩౩) శక్తిమండలమును కానకయే యెవరు

రణముచేయుదురో వారికివెంటనే మరణముగలుగును. బుద్ధిమంతులగువారురణభూమికి వారివెంటఁ బోఁజనదు (౩౪) పృథ్వీతత్వమున రథములను, జలమునందు గాలుబంట్లను తేజమున ఏనుఁగులను, వాయువున గుఱ్ఱములనును జయించును.

ద్వంద్వయుద్ధం ప్రవక్ష్యామి శృణు దేవి ! సమాహితా ।
యస్య విజ్ఞానమాత్రేణ త్రైలోక్యే విజయో భవేత్ ॥　　౩౬
మృగబృందే హరి ర్యద్వ న్మేఘబృందేఽనిలోయథా ।
నగబృందే యథా వజ్రం తాం వేళాం కథయా మ్యహమ్ ॥　౩౭

తా. ఓపార్వతీ ! ద్వంద్వయుద్ధ ప్రకారమును జెప్పెద సావధానముగ వినుము ఇది తెలియుటచే ముల్లోకములందును జయముగలుగును (౩౬) మృగ సమూహమునందు సింహమువలెను, మేఘసమూహమున పెనుగాలివలెను, పర్వతములయందు వజ్రముమాడ్కియు అతిజయశీలమైన వేళను జెప్పెద (౩౭)

రవినాడ్యాం త్వగ్నితత్త్వే యథాసౌ కలహం గతః ।
రిపుసైన్యం నిహంత్యాశు వాజివారణమస్తకే ॥　　౩౮
యుద్ధకాలే యదా చంద్ర స్థాయీ జయతి నిశ్చయమ్ ।
ఏవం తు భానువాహే చ యాయీ జయతి నాన్యథా ॥　　౩౯
భానౌ చాగ్రే వాహినీ స్యా త్సోమే స్యా త్పృష్ఠత స్తథా ।
ఏవంచేదమృతా సేనా వ్యత్యయే రక్తవాహినీ ॥　　౪౦

తా. సూర్యనాడియందు తేజస్తత్వమునడుచువేళ రణమొనర్చిన శత్రుసేనలను ఏనుఁగు గుఱ్ఱములమీదనున్నప్పటికిని జయించును (౩౮) యుద్ధకాలమందు చంద్రస్వరముండిన స్థాయిజయించును. సూర్యస్వరముండిన వచ్చినవాఁడు జయించును (౩౯) సూర్యస్వరమందు సేనను ముందర నుంచుకోవలెను. చంద్రస్వరమునందు వెనుక నుంచుకోవలెను ఈక్రమమున నడిచిన సేన చావదు. విపరీతముగనుండిన సేనకు గాయములు చావులు గలుగును. (౪౦)

అధోదృష్టి ర్వామభాగే ఘాతికాం ధారయే ద్బుధః ।
పూరకే సోమవాహే స్యాత్ స్థానా దూర్ధ్వేఽం విఘాతయేత్ ॥
ఊర్ధ్వేదృష్టి ర్దక్షభాగే ఘాతికాం ధారయే ద్బుధః ।
రేచయిత్వా సూర్యవాహే ఘాతయే దసినా హితాన్ ॥　౪౧
పింగళాంతర్గతే ప్రాణే శస్త్రం మాఽగే చ వర్జయేత్ ।
భంగం చ సూచయే చ్ఛ్వాసో నాడీం చైవ విలోకయేత్ ॥౪౩

తా. చంద్రస్వరము నడుచువేళ ఎడమ భాగమందు నధోదృష్టిగలిగి పూరకము చేసికొని కత్తిని పొడువుగ బట్టియుద్ధము సేయవలయు (౪౧) కుడిపార్శ్వమున పొడువుగ కత్తిని సరించి సూర్యస్వరమున రేచకము చేయుమ కత్తిని జళిపించిన జయము కలదు. (౪౨) యుద్ధకాలమునందు సూర్యస్వరము ప్రవేశమైన భంగమగును. సమరమందు శస్త్రమును పట్టరాదు. అప్పుడు నాడిని నిశ్చయింపవలయు (౪౩)

సంక్రమే దనిలో యుద్ధే వామోఽప్యంతగతో భవేత్ ।
జయతే నాత్ర సందేహో యది నాడి చ ఖండితా ॥ ౪౪

తా. యుద్ధకాలమున సంక్రమమై తరువాత చంద్రస్వరము ప్రవేశమైన జయము గలుగును. నాడి ఖండితముగా నున్నను జయమబ్బును (౪౪)

అథ సంగ్రామమధ్యే తు యస్య నాడీ ప్రవాహతే ।
తావ జ్జయ మవాప్నోతి శూన్యే భంగం సమాదిశేత్ ॥ ౪౫

ప్రాణాంతే తు రిపూణాం చ ఛాయాయాం ప్రవిశే న్నరః ।
స్థాయినో దిశి చంద్రస్య సౌర్యాం వై యాయినో జయః ॥ ౪౬

తా. తరువాత యుద్ధము చేయుసమయమున ఏనాడి నడుచునో ఆనాడి నడుచువఱకు జయము కలదు. ఆనాడి శూన్యమైనయెడల భంగమగును (౪౫) ప్రాణాంతమైనను శత్రువులనీడకుబోయి యుద్ధము చేయవలయు. చంద్రస్వరము దక్కిన స్థాయికి జయము. సూర్యస్వరము దక్కిన యాయికి జయము అగును (౪౬)

సంక్రాంతిం సంప్రవక్ష్యామి యుద్ధకాలే యథాస్థితిమ్ ।
చంద్రసూర్యసమావాహ స్సంక్రాంతి రభిధీయతే ॥ ౪౭

తా. ఓపార్వతీ ! సంక్రాంతిని చెప్పెద వినుము. యుద్ధకాలమున సూర్యచంద్రనాడులు రెండును సమముగా ఎప్పుడుకొట్టునో అప్పుడు సంక్రాంతియనబడును (౪౭)

పశ్యే దురసి సంక్రాంతిం స్వస్య హస్తం పరీక్షయేత్ ।
న లగ్నో యదిహా యుద్ధే జ్ఞేయ మస్తమనం బుధైః ॥ ౪౮

సా చ దావానలప్రఖ్యా యావ ద్యుద్ధా చ దృశ్యతే ।
సంగ్రామా చ్చ సమాగత్య మ్రియతే గృహమధ్యతః ॥ ౪౯

తా. ఱొమ్ముమీఁద చేయినునిచికొని చూచిన ఎక్కడ తగులకనుండెనది అస్తమానమనఁబడు (౪౮) ఆసంక్రాంతి కాలాగ్నితోఁదుల్యమై వేడిగా ఎంతవఱకు కనుపించునో అంతవఱకు మనుష్యుఁడు యుద్ధము చేసి యింటికివచ్చి చచ్చును (౪౯)

ద్వయో ర్వాహే తథా పృచ్ఛే దస్తి నాస్తి ద్వయక్షయః।
అతిచారే భవే ద్యుద్ధం భంగ స్స్యా దుపఘాతకః॥ ౫౦

తా. సంక్రమ కాలమునందు తనకు శుభాశుభములు కలవా లేవాయనియడిగిన శుభాశుభములు రెండును లేవనిచెప్పవలెను. అది అతిచారమైనయెడల భంగము గాయము గలుగును (౫౦)

విషువే వైరిణాం దృష్ట్వా యుద్ధే పశ్చా న్నివర్తతే।
రేఖాం కుర్యా ద్ద్వయో ర్మధ్యే లంఘిత స్తు మ్రియే దరిః॥ ౫౧

తా. సంక్రమముగనడుచువేళ వైరితోయుద్ధమునకు వెనుకదీసినయెడల ఇద్దరికిని నడుమ రేఖనుగీచగా ఆరేఖదాటి వచ్చిన పగవాడు మృతిబొందును (౫౧)

యో యం పశ్యతి సంక్రాంతౌ శుభతత్వం యదా నరః।
భటస్య తస్య త్వీశాన్యే సంగ్రామే విజయో భవేత్॥ ౫౨
క్రూరతత్త్వే చ సంక్రాంతౌ స్థాపయే న్నిరృతౌ భటమ్।
చంద్రస్థానం గతే సూర్యే చాగ్నేయాభిముఖో భవేత్॥ ౫౩

తా. ఎవరయినను సంక్రాంతినడుమవేళ చూడఁగా శుభతత్వము నడిచిన ఆ బంటును ఈశాన్యభాగమందుయుద్ధము చేసిన జయము గలుగును (౫౨) సంక్రాంతియందు క్రూరతత్వము నడుచువేళ బంటును నిరృతిస్థానమందుంచవలయు. చంద్రునిలోసూర్యుఁడుండిన ఆగ్నేయాభిముఖముగనుంచవలయు (౫౩)

సూర్యస్థానంగతే చంద్రే వాయవ్యాభిముఖో భవేత్।
తత్రైవ వాయు ర్వక్ర శ్చే త్సూర్య శ్చ వక్రతాం వ్రజేత్॥ ౫౪
ప్రథమే భంగ మాప్నోతి పశ్చా ద్విజయమోచనే।
తేజోవాయూ వక్రగతీ సమరే తు భటస్య చ॥
హస్తే ఘాత మవాప్నోతి తత్తో నేత్రే క్షతం భవేత్॥ ౫౫
కాలదండం వహే ద్వాయుః క్షతం స్యా చ్చతురంగుళమ్।
ఆప స్స్పృష్ట్వా చరే ద్వక్రం జయ స్స్యా ద్భంగఏవ చ॥ ౫౬
వాయు శ్చ సలిలం స్పృష్ట్వా తేజ శ్చ పరిసంవహేత్।
హస్తే క్షతం తతో ఘాత్వా సంగ్రామే విజయో భవేత్॥
ఆకాశేఽగ్నిః పృథివ్యాం చ యదా సంవహతే మరుత్।
భట శ్చ మృతి మాప్నోతి భార్యా వహన్నా పతే ద్రహ॥ ౫౭

కపాలే ఘాత మాకాశే తేజ స్త త్త్వే చ వక్షసి ।
జలే కక్షే క్షితౌ కుక్షౌ వాయౌ పృష్ఠస్థలే క్షతః ॥ ౫౭

తా. సూర్యనాడియందుచంద్రుఁడుండిన వాయువుదిక్కు అభిముఖముగా బంటు నుంచవలయు. అప్పుడు వాయువు వక్రగతిగానుండిన కార్యము వక్రించును (౫౪) మొదట భంగమై వెనుక జయముగలుగును. పట్టుబడినను విడువఁబడును. అప్పుడు తేజో వాయువులు వక్రగతిగానడిచిన బంటుకు చేతినగాని కన్నులయందుగాని గాయము తగులును (౫౫) ఆసూర్యనాడి కాలకండప్రకారమునడిచిన నాలుగంగుళములప్రమాణము గాయము తగులును. ఆనాడి అస్తత్త్వమును ముట్టి వక్రగతిగానుండిన తొలుత జయమై తరువాత భంగమగును (౫౬) ఆసూర్యనాడి జల వాయుతత్త్వములను తాకినడిచిన చేతిన గాయముతగిలి తరువాత యుద్ధమందు జయముగలుగును (౫౭) ఆసూర్యనాడి ఆకాశ తత్త్వముననుండగా అగ్నితత్త్వము పృథివీతత్త్వమునుఎప్పుడుముట్టుచున్నదో అప్పుడుబంటు మరణము నొందును. వానిభార్యయిచ్చునఁబడును (౫౮) ఆసూర్యనాడి ఆకాశ తత్త్వమున నుండిన తలమీఁదను, తేజస్తత్త్వమున రొమ్మునందును, జలతత్త్వమున చంకను, పృథ్వీతత్త్వమున కడుపునందును, వాయువున వీఁపునను గాయము తగులును (౫౯)

సంపూర్ణసంక్రమే పృచ్ఛే త్ప్రశ్నే చ్చంద్రోదయో భవేత్ ।
తదా సర్వార్థసిద్ధి స్స్యా త్సూర్యే హానిం వినిర్దిశేత్ ॥ ౬౦

తా. సంపూర్ణ సంక్రమకాలమందు ప్రశ్నయడిగిన వెంటనే చంద్రస్వరమైన యెడల అప్పుడు సకల కార్యములు సిద్ధించును. సూర్య స్వరమైన హానిగలుగును (౬౦)

ఉభౌ కృష్ణౌ వుభౌ గౌరౌ వుభయో ర్నామ చైకకమ్ ।
ముష్టియుద్ధే జయో యస్య కథయస్వ మమ ప్రభో ! ॥ ౬౧
ముష్టియుద్ధం ప్రవక్ష్యామి వినా శస్త్రేణ ముష్టికామ్ ।
సమాహితా శృణు త్వం హి వయః కాలవిశేషతః ॥ ౬౨
పూర్వే వయసి పూర్వాహ్ణే మధ్యాహ్నే త్వవరో జయేత్ ।
భానునాడీ ప్రవాహే చ గౌరో జయతి నాన్యథా ॥ ౬౩
అపరాహ్ణే వయఃపూర్వే సాయాహ్నే ప్యవరే జయః ।
సోమనాడీ ప్రవాహే చ కృష్ణో జయతి నాన్యథా ॥ ౬౪
పూర్వోత్తరదిశం చంద్రే భానౌ పశ్చిమయామ్యతః ।
పశ్చాత్కృత్వా ప్రకుర్వీత దూతో యుద్ధం వరాననే ! ॥ ౬౫

పూర్వోత్తరదిశం చంద్రే కర్తవ్యం వామసమ్ముఖే ।
సూర్యే పశ్చిమయామ్యే చ పృష్ఠే దక్షిణతో జయః ॥ ౬౬
చంద్ర స్సమ స్తు విజ్ఞేయ స్సూర్య స్తు విషమో మతః ।
పూరకే చ సమ శ్చంద్రో రేచకే విషమో రవిః ॥
అగ్రముష్టి ర్జయే త్సూర్యే చంద్రే చ తదనంతరమ్ ॥ ౬౭

తా. ఇద్దరునలుపు ఇద్దరుఎఱుపు ఇద్దరి పేరును ఒక్కటి ; ముష్టియుద్ధమందు ఎవరుజయింతురు ఇది నాకుజెప్పుము స్వామీ అనిపార్వతి యడుగగ మహేశ్వరుఁడు ఇట్లనిరెను (౬౧) ఓపార్వతీ ! ముష్టి యుద్ధప్రకారము చెప్పెద సావధానముగ వినుము ఆయుధములు లేకయే యుద్ధమొనర్చిన స్వరముల వలనను వయస్సువలనను జయాప జయములు తెలియందగును (౬౨) వయస్సున పెద్దవాఁడు పూర్వాహ్ణమందు జయించును, వయస్సునచిన్నవాఁడు మధ్యాహ్నమునందుజయించును. సూర్యస్వరము నడుచు వేళ ఎఱ్ఱనివాఁడు జయించును (౬౩) మూడవ జామున పూర్వవయస్సువాఁడు జయించును. నాలవజామునపరవయస్సువాఁడుజయించును. చంద్రనాడియందు నల్లనివాఁడు జయించును. (౬౪) తూర్పు ఉత్తరములను చంద్రస్వరమునందును, పడమర దక్షిణములను సూర్యస్వరమునందును వెనుక వేసికొని దూరులు యుద్ధము చేయవలయు (౬౫) చంద్రస్వరమునందు తూర్పు ఉత్తరముల నెడమభాగమునను ఎదురుగను జయముగలుగును. పడమర దక్షిణముల సూర్యునియందు దక్షిణభాగమున వెనుక జయముగలుగును ఈరీతిని జగడమాడవలయు (౬౬) చంద్రుఁడు సముఁడు. సూర్యుఁడు విషముఁడు (బేసి). చంద్రుఁడు పూరకమునందు సముఁడు. సూర్యుఁడు రేచకమునందు విషముఁడు. (౬౭) సూర్యస్వరమున ముందర ముష్టిబట్టినవాఁడు జయించును.

ఈదృశం ఖేలయో ర్ధ్యాతం తద్ జ్ఞానాంతరిక్షేపితః ॥ ౬౮
వసుంధరా చే చ్చత్వారో బల ఇత్యభిధీయతే ।
సలిలం చే ద్ద్వయం జ్ఞేయం జాగర శ్చేతి కీర్తితః ॥ ౬౯
హుతాశన శ్చే త్త్రితయం లిగ ఇత్యభిధీయతే ।
వాయు శ్చే దేక మేవం స్యా త్తథా నందీతి కీర్తితః ॥ ౭౦
బలస్యైవ చతుర్భేదాః పృథ్వీతత్త్వ సముద్భవాః ।
చత్వారోఽష్టౌ ద్వాదశ చ షోడశ ప్రతిపాదితాః ॥ ౭౧
జాగరస్య చతుర్భేదా అప్తత్త్వే చ సముద్భవాః ।
ఏవం తస్య పరిజ్ఞేయం ద్వే షట్ దశచైవ హి ॥ ౭౨

త్రిగస్యాపి చతుర్భేదా స్త్రయ స్సప్త తతఃపరమ్।
ఏకాదశ పంచదశ తేజ స్తత్త్వ సముద్భవాః॥ ౭౩
నందిన స్తు చతుర్భేదా ఏకపంచనవం తతః।
త్రయోదశ తు విజ్ఞేయా వాయుతత్త్వసముద్భవాః॥ ౭౪
ఇత్యుమామహేశ్వర సంవాదే, స్వరచింతామణౌ యుద్ధద్యూత
ప్రకరణంనామైకోనవింశో౽ధ్యాయః. *

తా. పైక్రమమున చంద్రసూర్య స్వరభేదముల దెలిసి ముందువెనుక ముష్టిబట్టి జూదమాడవలయు (౬౮) పృథ్వీతత్త్వమైన నాలుగుఆదాయము. అది బల యనఁబడును. అ ప్తత్త్వమైన రెండు ఆదాయము అది జాగరమనఁబడును (౬౯) తేజ స్తత్త్వమైనమూడు ఆదాయము అది త్రిగయనఁబడును. వాయుతత్త్వమైన ఒకపాలు ఆదాయము అది నంది యనఁబడును (౭౦) బలాదాయము నాలుగు భేదములు అవి పృథ్వీతత్త్వమందుబుట్టినవి, ఆభేదము లెట్లనఁగా ౪,౮,౧౨,౧౬, (౭౧) జాగరమునకు నాలుగు భేదములు గలవు అవి అ ప్తత్త్వమునందు బుట్టినవి ౨,౬,౧౦,౧౬, (౭౨) త్రిగయనునది నాలుగుభేద ములుగలది. అవి తేజ స్తత్త్వమందు బుట్టినవి ౩,౭ ౧౧,౧౫, (౭౩)నంది యనునది నా లుగు భేదములుగలది. అవి వాయుతత్త్వమందు బుట్టినవి ౧,౫,౯,౧౩, అని తెలియునది.

---

## వింశో౽ధ్యాయః.

అథాత స్సంప్రవక్ష్యామి వృష్టిలక్షణ ముత్తమమ్।
చంద్రాదిత్యవిచారేణ జ్ఞాతవ్యం తత్త్వవేదిభిః॥ ౧
చంద్రే చాస్తి జలం బ్రూయా త్సూర్యే నాస్తీతి భాషయేత్।
సంక్రమే చ కృతప్రశ్నే చాల్పవృష్టి శ్చ జాయతే॥ ౨
విలంబం పార్థివే మేఘం జలపూర్ణం మహీతలే।
సద్యోవృష్టి ర్జలే జాతే నాస్తి నై హ్యనలే తథా॥ ౩
భిద్యతే వాయునా మేఘ స్తుషారో వ్యోమ్ని జాయతే।
వామనాడ్యా మిమే భేదా దక్షిణే ధాన్యసంభవః॥ ౪
చంద్రస్య పూరకే చాల్పా రేచకే బహువృష్టిదా।
సూర్యస్య పూరకే హానీ రేచకే అల్పవృష్టిదః॥ ౫
ఆర్ద్రాద్ద్వాదశ నక్షత్రే ప్రవిశే ద్భాస్కరస్థితాత్।
తత్కాలే తు భవే చ్చంద్రే స్థితే వృష్టి శ్చ సర్వదా॥ ౬

సుప్తే చలితవాహేన తథాచైవ జలో గతః ।
స్ఖలితే ధ్వంసమానే చ ఆగతోఽసౌ నివర్తతే ॥ ౭
బుధశుక్రోదయే చాస్తి నాస్తి సౌరికుజోదయే ।
సస్యవృద్ధి స్సుబోద్ధవ్యా ద్వితీయం నాస్త్యథైవహి ॥ ౮

తా. అటుపిమ్మట వృష్టి లక్షణమును జెప్పెద, తత్వవేత్తలగువారు చంద్ర సూర్యస్వరములవలన తెలిసికొనవలయు. (౧)చంద్రనాడియందు ప్రశ్నచేసిన వర్షము కలదు, సూర్యనాడియందు లేదు, సంక్రమమందు కొంచెము వర్షముకలదు అని చెప్పవలయు. (౨) వర్షప్రశ్నయందు పృథ్వీతత్వమైన విలంబముమీఁద వర్షము సంపూర్ణముగ గురియును, జలతత్వమున సద్యోవర్షము, తేజస్తత్వమున వర్షములేదు అని చెప్పవలయు (3) వాయుతత్వమునందు మేఘముతొలఁగిపోవును. ఆకాశ తత్వమున తుంపురులుగలుగును ఇదిచంద్రస్వరఫలము. సూర్యనాడియందు విపరీతఫలమగును.(౪) చంద్రనాడి పూరకమందు అల్పవృష్టి, రేచకమునందు బహువృష్టి గలుగును. సూర్యనాడి పూరకమందు వర్షములేదు, రేచకమునందు అల్పవృష్టిగలుగును. సూర్యనాడి పూరకమందు వర్షములేదు, రేచకమునందు అల్పవృష్టిగలుగును, (౫ సూర్యుఁడున్న నక్షత్రము ఆర్ధము మొదలు ౧౨-వనక్షత్రములో చంద్రుఁడుండినప్పుడు చంద్రస్వరము వేళ ప్రశ్నయడిగిన ఆదినమునందే వర్షముకురియునని చెప్పవలయు,(౬)నాడి, సుప్తము, చలితమునై యుండిన వర్షములేదు, స్ఖలితము ధ్వంసమానము అయినయెడల వచ్చిన వర్షముపోవును బుధశుక్రోదయములయందు వర్షముకలదు. అంగారక శన్యుదయములయందువర్షములేదు వర్షజ్ఞానమునకు ఈరెండుగాక వేరొకక్రమములేదు. ఇట్లే సస్యవృద్ధిని ఎఱుంగవలయు.(౮

సస్యోత్పత్తి స్తు సోమేన నాశ స్సూర్యేణ కథ్యతే ।
కేవలం వహతే చంద్రో హిమవాత స్తదా భవేత్ ॥ ౯
బహూని సంతి ధాన్యాని సుపూర్ణా నాశికా భవేత్ ।
అర్కచారే తు తద్ధాన్యం తదా చోరేణ నీయతే ॥ ౧౦
జ్వలితం స్ఖలితం తోయ మల్పం ధాన్యం తతో భవేత్ ।
అథ శ్చరే దహాంతస్త్వం స్ఫుటితం వలితం భవేత్ ॥ ౧౧
ఉపక్షయం భవే ద్ధాన్యం చోరేణ బహు నీయతే ।
చంద్రసూర్యవిచారేణ విభేదం జాయతే ఫలమ్ ॥ ౧౨

* ఇత్యుమామహేశ్వరసంవాదే, స్వరచింతామణౌ, వర్షలక్షణ సస్యోత్పత్తిప్రకరణం నామ వింశోఽధ్యాయః.

తా. చంద్రస్వరమువలన సస్యోత్పత్తియు, సూర్యస్వరమువలన సస్యనాశము ను తెలియవలయు. చంద్రస్వరమున అతిశైత్యమైన మంచుగాలి అధికముగాగొట్టును(౯) చంద్రనాడి సంపూర్ణముగా గొట్టిన నానాధాన్యములు చక్కగా ఫలించును. అతిచార మైన పండిన ధాన్యము దొంగలచే నపహరింపబడును (౧౦) జలతత్త్వము- జ్వలితము, స్ఖలితము అయినయెడల ధాన్యము కొంచెముగ పండును. జలతత్త్వము అధోముఖముగా నడిచి స్ఫుటితము వలితము అయినయెడల ధాన్యము క్షీణించును, మిగిలిన ధాన్యము దొంగలచేనపహరింపబడును (౧౧) చంద్రసూర్య స్వరములవలన నిట్లు ఫలము భేదించును, నాడి సంక్రమించివచ్చిన ధాన్యమును దొంగ లపహరింతురు (౧౨)

ఏ క విం శో ఽ ధ్యా యః.

అర్ఘవృద్ధి ర్భవే త్సోమే సూర్యే హాని స్తు జాయతే ।
ఉభనాడీ ప్రవాహేన చోరై రాసీయతే ధనమ్ ॥ ౧
సమే చ జ్ఞాయతే చైవ ఫలం స్ఫుటిత మేవ హి ।
స్ఫుటితేవాపి తచ్చైవ జ్వలితే చ గతం భవేత్ ॥ ౨
సుప్తే స్వరూప మాయాతి నాశనం జ్వలితే భవేత్ ।
నాడీ చాత్యంత ముష్ణా చే దగ్నిదాహో భవే ద్ధ్రువమ్ ॥ 3
భానౌ శనౌ యదా సూర్యే చార్ఘహాని స్తు జాయతే ।
గుకా చ ద్విగుణం ప్రోక్తం త్రిగుణం చ తదా భవేత్ ॥ ౪
గవాశ్వమహిషాదీనాం వస్త్రధాన్యాది వస్తునామ్ ।
సర్వేషాం రసధాన్యానాం విక్రయే భానునాడికా ॥ ౫

* ఇత్యుమామహేశ్వరసంవాదే స్వరచింతామణౌ అర్ఘలక్షణం నామైకవింశోఽధ్యాయః. *

తా. చంద్రనాడియందు ప్రశ్నయడిగినవెలయెచ్చును, సూర్యనాడియందు తగ్గును, సంక్రమమునందు అడిగిన ధనమును దొంగలపహరింతురు అనిచెప్పవలయు. (౧) మరియు సంక్రమకాలమునందు ప్రశ్నచేయ స్ఫుటితమైనను జ్వలితమైనను ధాన్యముపోవును ౨) సుప్తమైన ధాన్యస్వరూపము నాశమగును, జ్వలితమై అత్యుష్ణముగానుండిన అగ్నిదాహమగును (3) సూర్యనాడియందు తేజోజలతత్త్వములైనయెడల అర్ఘహాని యగును. చంద్రనాడియందు వాయుతత్త్వమైన ఇనుమడి ముమ్మడి హెచ్చును(౪)ఆవులు గుఱ్ఱములు ఎనుములు వస్త్రములు ధాన్యములు మొదలగువానిని రసధాన్యాదులను సూర్యనాడియందు విక్రయింపవలయు. (౫)

జలాఖేటః కృత శ్చంద్రే వనాఖేట స్తు భాస్కరే ।
పూరకే నిర్గమేచ్చైవ తదాఖేటో మనోహరః ॥ ౧
భానునాడ్యాం పూర్వదిశి కుర్యా దాఖేట ముత్తరే ।
సోమే చ పశ్చిమేచ్చైవ తథాఖేటం చ దక్షిణే ॥ ౨
పృథివ్యాం చ ఖురీ దంతీ వారిణి మీనపన్నగాన్ ।
తథా హుతాశనే వ్యాఘ్రాన్ విహంగాదీన్ ప్రభంజనే ॥ 3

* ఇత్యుమామహేశ్వర సంవాదే, స్వరచింతామణౌ జలాఖేట వనాఖేటలక్షణంనామ ద్వావింశోఽధ్యాయః. *

తా. చంద్రస్వరమున పూరకము చేసికొని నీటివేఁటకుబోవలయు. సూర్యస్వరమున రేచకముచేసికొని యడవివేఁటకు బోవలయు (౧) భానునాడియందు తూర్పు ఉత్తరము ఈదిశలయందును, సోమనాడియందు పడమర దక్షిణము ఈదిక్కులయందును వేఁటకుబోవలయు (౨) పృథివీతత్త్వమునందు గొరిసెలు దంతములుగల జంతువులను, జలతత్త్వమందు చేఁపలను పాములను, తేజమునందు పులులను, వాయుతత్త్వమున పక్షులు మొదలగువానిని వేఁటచేయ మేలగును.

## త్రయోవింశోఽధ్యాయః.

కః కాలః ? క శ్చ రూప శ్చ ? కో దేశ ? స్తస్య కా దిశా ? ।
ప్రార్థయిత్వా మహాదేవం దేవీ వచన మబ్రవీత్ ॥ ౧
కాలః కృష్ణ స్సపింగాక్షో న కాలో మహిషస్థితః ।
చంద్రాదిత్య విచారోఽయం కాలఇత్యభిధీయతే ॥ ౨

తా. స్వామీ ! కాలుఁడనువాఁడెవఁడు ? వానిరూపమెట్టిది? వానిదిఏదేశము ? ఏదిక్కున నుండును ఇదినాకు జెప్పుము అని పార్వతి పరమేశ్వరుని యడుగ నతండిట్లనియె (౧) పార్వతీ ! కాలుఁడనఁగా నల్లనిదేహము పచ్చనికన్నులు గలిగి ఎనుబోతు మీఁద నెక్కియుండు యముఁడుగాఁడు, చంద్రసూర్యుల స్వరగతియే కాలుఁడని చెప్పఁబడును.

సమసప్తకభాను శ్చే జ్జన్మర్క్షే చైవ చంద్రమాః ।
వ్రజ త్యేకస్వరో యస్య వక్ష్యామి తస్య జీవితమ్ ॥ 3

తా. సమసప్తకమునందు సూర్యుఁడును జన్మనక్షత్రమున చంద్రుఁడును ఉండునపుడు ఎవనికి నొకస్వరము కొట్టుచున్నదో వానికి ఆయుః ప్రమాణమును జెప్పెద(3)

తత్పౌషకాలే ప్రహరం చైకం భాను ర్యదా వహేత్ ।
జీవే త్షోడశవర్షాంతం భద్రం దేవి ! న సంశయః ॥ ౪
యామద్వయం రవిః పౌషే కాలే యస్య ప్రవర్తతే ।
చతుర్దశ స్యు ర్వర్షాణాం జీవితం తస్య నై భవేత్ ॥ ౫
చతుష్టయం తు యామస్య యో నై పౌషే దివాకరే ।
తస్య ద్వాదశ వర్షాణి ఆయు రిత్యభిధీయతే ॥ ౬
కాలే తు పౌషకే యస్య అహోరాత్రం సదాగతిః ।
వహతే దక్షిణో యస్య స జీవే ద్దశవత్సరమ్ ॥ ౭
ద్విదినే త్రిదినే చాపి పింగళాయాం సదాగతిః ।
అష్టవర్షం తదా ప్రోక్తం షడబ్దం జీవితం స్మృతమ్ ॥ ౮
చత్వారః పంచ పౌషే చ పింగళాయాం గతో మరుత్ ।
చతుర్థే వత్సరే పూర్ణే తృతీయే మృత్యు మాదిశేత్ ॥ ౯
షడ్దినం వహతే యస్య పౌషే యోగే దివాకరః ।
చతుర్వింశత్యహోహీనం త్రివర్షం తస్య జీవితమ్ ॥ ౧౦
రవి స్సప్తదినం యస్య పౌషయోగే ప్రవర్తతే ।
జీవే దష్టాదశాహాని నవమాసా శ్చ పార్వతి ! ॥ ౧౧
వాయు రష్టదినం యస్య వహతే దక్షిణే రవేః ।
ద్వివర్షం సప్తమాసం చ షడ్దినాని స జీవతి ॥ ౧౨
నవరాత్రం దశాహం చ వహతే యస్య భాస్కరః ।
ద్వివర్షం చ చతుర్మాసా స్స జీవే ద్వత్సరద్వయమ్ ॥ ౧౩
ఏకాదశదినం వాయుః ప్రవిశే ద్యస్య దక్షిణే ।
చతుర్వింశత్యహోహీనం స జీవే ద్వత్సరద్వయమ్ ॥ ౧౪
యదా వై ద్వాదశాహాని వహతే యస్య దక్షిణే ।
వర్ష మష్టాదశాహాని నవమాసా స్స జీవతి ॥ ౧౫
వాయు స్త్రయోదశాహాని వహతే యస్య దాక్షిణః ।
వర్షంచ షడ్దినాని స్యు స్సప్తమాసా శ్చ జీవితే ॥ ౧౬
వాయు శ్చతుర్దశాహాని పౌషయోగే యదా రవిః ।
చతుర్మాసాధికే వర్షే గచ్ఛే ద్వై యమమందిరమ్ ॥ ౧౭

పక్షో యదా వహేత్వేషే యోగే చైవ దినాధిపః ।
దినాధికే వత్సరాంతే నరో యాతి యమాలయమ్ ॥ ౧౭
ఏవహో దక్షిణే మార్గే యస్య షోడశవాసరాః ।
దినద్వాదశహీనే తు వత్సరాంతే మృతిర్భవేత్ ॥ ౧౮
యస్య సప్తదశాహాని పింగళాయాం సమీరణః ।
ఏకాదశసు మాసేషు షడ్దినేషు క్షయో భవేత్ ॥ ౨౦
అష్టాదశదినం యస్య వహతే దక్షిణానిలః ।
స ద్వాదశదినన్యూన దశమాసాశ్చ జీవతి ॥ ౨౧
ఏకోనవింశతిదినం వహతే పింగళా తధా ।
ప్రాప్నోతి చాష్టమే మాసే నిశ్చితం మరణం నరః ॥ ౨౨
యస్య వింశత్యహోరాత్రం వహతే దక్షిణానిలః ।
పౌషకాలం సమారభ్య షాణ్మాసం తస్య జీవితమ్ ॥ ౨౩
ఏకవింశత్యహోరాత్రం వహతే యస్య భాస్కరః ।
ఊనషడ్దివసాణ్మాసా న్నహి జీవంతి మానవాః ॥ ౨౪
ద్వావింశతిదినం యస్య దక్షిణప్రభవోఽనిలః ।
దినద్వాదశసంయుక్త పంచమాసం చ జీవతి ॥ ౨౫
త్రయోవింశతిరాత్రాణి వహతే పింగళా యది ।
పౌషకాలం సమారభ్య పక్షాంతే మరణం ధ్రువమ్ ॥ ౨౬
నవవింశతిరాత్రాణి వహతే యస్య పింగళా ।
దశాహం జీవితం తస్య భవే ద్వై పౌషయోగతః ॥ ౨౭
త్రింశద్దినాని వహతే పౌషయోగే నిరంతరమ్ ।
పింగళా యస్య తస్యాయు రష్టపంచ చ రాత్రయః ॥ ౨౮
ద్వాత్రింశద్దివసా యస్య త్రయస్త్రింశద్దినాని చ ।
సూర్యో వహతి తస్యాయు స్త్రిదినం ద్విదినం భవేత్ ॥ ౨౯
ఏవం క్రమేణ చంద్రో వా యదా ప్రవర్తతే తదా ।
రాజశస్త్ర భయం రోగ శ్శోకకోహాని శ్చ జాయతే ॥ ౩౦

టీ. సమసప్తకమున సూర్యుఁడుండి జన్మనక్షత్రమునచంద్రుఁడుండిన అదిపౌష కాలమనఁబడును ఆకాలమున సూర్యస్వరముఒకజాముసడిచిన పదునాలుసంవత్సరములు

చక్కగ బ్రతుకునని తెలియవలయు. (౪) ఆ పోషకాలమున సూర్యస్వరము రెండుజాములునడిచిన ౧౪ సంవత్సరములు ఆయుస్సు (౫ నాలుగు జాములునడిచిన ౧౨ సంవత్సరములు (౬) అహోరాత్రమునడిచిన పదిసంవత్సరములు ఆయుస్సు (౭) రెండు దినములునడిచిన ౮ వత్సరములును, మూడుదినములునడిచిన ఆరుసంవత్సరములునుఆయుష్యము (౮) నాలుగుదినములు నడిచిన ౪ వత్సరములును, అయిదుదినములు నడచిన మూడుసంవత్సరములునుఆయుష్యము (౯) ఆరుదినములునడిచిన ౨౪ దినములు తక్కువగా 3 సంవత్సరములు బ్రతుకును (౧౦) ఏడుదినములు నడిచిన ౯ నెలలు ౧౮ దినములకు మరణము (౧౧) ఎనిమిది దినములు నడిచిన ౨ వత్సరములు ౭ మాసములు ఆరుదినములు బ్రతుకును, (౧౨) తొమ్మిదిదినములునడిచిన రెండుసంవత్సరములు ౪ నెలలును, పదిదినములు నడిచిన ౨ సంవత్సరములును బ్రతుకును (౧౩) పదునొకండు దినములు నడిచిన ౨౪ దినములు తక్కువగా రెండుసంవత్సరములు జీవించును (౧౪ పంద్రెండు దినములు నడిచిన ౧ సంవత్సరము ౯ నెలలు ౧౮ దినములు బ్రతుకును (౧౫) పదుమూడు దినములు నడిచిన ౧ సంవత్సరము ౭ మాసములు ఆరుదినములు బ్రతుకును (౧౬) పదునాలుగు దినములు నడిచిన ౧ సంవత్సరము ౪ నెలలకు మరణము (౧౭) పదునేను దినములు నడిచిన ఒకఏడు ఒకదినము బ్రతుకును (౧౮) పదునారు దినములు నడిచిన ౧౨ దినములు తక్కువగా ఒకసంవత్సరము బ్రతుకును (౧౯) పదునేడు దినములునడిచిన పది నెలల ఆరుదినములకు మరణము (౨౦) పదునెనిమిది దినములు నడిచిన ౧౨ దినములు తక్కువగా పది నెలలు బ్రతుకును. పందొమ్మిది దినములు నడిచిన ౮ నెలలకుమరణము. ఇరువదిదినములునడిచిన ఆరునెలలుబ్రతుకును. ఇరువదియొక దినమునడిచిన ఆరుదినములు తక్కువగా ఆరునెలలకుమరణము. ఇరువదిరెండు దినములు నడిచిన ౫ నెలల ౧౨ దినములకు మరణము. ఇరువదిమూడు దినములు నడిచిన పదునైదుదినములకు మరణము. ఇరువదితొమ్మిది దినములు నడిచిన పదిదినములు బ్రతుకును, ముప్పదిదినములు నడిచిన పదుమూడుదినములు బ్రతుకును. ముప్పదిరెండుదినములు నడిచిన ౨ దినములును, ముప్పదిమూడు దినములు నడిచిన 3దినములును బ్రతుకును. ఈ క్రమమున పోషకాలమందు చంద్రస్వరము నడిచినయెడల రాజులవలనను శస్త్రములవలనను భయము, రోగపీడ, శోకము, హానియు గలుగునని తెలియవలయు.

అథ వక్ష్యే విశేషేణ కాలజ్ఞానం సురేశ్వరి ! ।
సూర్యచంద్రవిచారేణ కాలమానం సునిశ్చయమ్ ॥ 3౧

మాసాదౌ వత్సరాదౌ చ పక్షాదౌ వా యథా తథా !
జయకాలం పరీక్షేత వాయుచారవశాద్బుధః ॥ 3౨

తా. ఓపార్వతీ! కాలజ్ఞానమును విశేషముగఁ జెప్పెదవినుము. సూర్యచంద్రస్వరవిచారముచే కాలమానమునిశ్చయింపఁదగును, మాసముసంవత్సరముపక్షము మొదలు సూర్యచంద్రస్వర సంచారభేదముచే జయకాలమును నిశ్చయింపఁదగును.

చతుర్యామం చ మాసాదౌ వహత్యేవ సురేశ్వరి! ।
అఖండో భాస్కరో యస్య తస్య మృత్యు ర్వశే ధ్రువమ్॥ ౩౩
చతుర్యామం వహే త్సూర్యో వత్సరాణాం చతుష్టయమ్ ।
దిన మేకం వహే ద్భాను స్త్రీణి వర్షాణి జీవితమ్॥ ౩౪
ద్విదినం వహతే భాను ర్ద్వివర్షం చ స జీవతి ।
త్రిదినం వహతే భాను ష్షణ్మాసం జీవితం భవేత్॥ ౩౫
చతుర్దినం వహే ద్భాను శ్చతుర్మాసం స జీవతి ।
పంచరాత్రం వహే ద్భాను స్తస్యాయుష్యం త్రిమాసకమ్॥ ౩౬
దశాహం వహతే భాను ర్మాస మేకం స జీవతి ।
చతుర్దశదినం భాను ర్వ హే త్పక్షం స జీవతి॥ ౩౭
మాస మేకం యదా యాతి పింగళాయాం ప్రభంజనః ।
దిన మేకం విజానీయా త్తతో యాతి యమాలయమ్॥ ౩౮
అతిచారగతే చంద్రే దినాని పంచసంఖ్యయా ।
తథా జీవతి వర్షేణ వ్యాధిరూపేణ జాయతే॥ ౩౯
వహే దహ్నం పంచదశ షణ్మాసా ద్రోగసంభవః ।
అష్ట వింశదహోరాత్రం మాసేన వ్యాధిపీడనమ్॥ ౪౦
వహే దేకదినం చంద్ర స్తద్దినే మరణం భవేత్ ।
ఏవం విజ్ఞాయ మేధావీ కాలం జయతి లీలయా॥ ౪౧

తా. మాసాదియందు సూర్యస్వరము నాలుగు జాములు అఖండముగా నడిచిన వానికి మరణమనిచెప్పవలయు. నాలుగు జాములు సూర్యస్వరము అతిచారమై నడిచిన నాలుగు సంవత్సరములు ఆయుస్సు. ఒకదినమునడిచిన మూడుసంవత్సరములు, రెండుదినములునడిచిన రెండుసంవత్సరములు, మూడుదినములునడిచిన ఆరునెలలుజీవితము. నాలుగు దినములు నడిచిన నాలుగు నెలలు, ౫ దినములు నడిచిన 3 నెలలు ఆయుస్సు. పదిదినములు నడిచినఒక నెల, పదునాలుగుదినములునడిచిన ఒక పక్షము ఆయుష్యము, ఒక నెల నడిచిన ఒకదినము బ్రతుకును. చంద్రస్వరము అతిచారముగా ౫ దినములు నడిచినఒక సంవత్సరము రోగముతో బ్రతుకును. పదునైదుదినములు చంద్రస్వరము ఎడతెగక నడి

చిన ఆఱు నెలలవఱకును, ఇరువదిదినములు నడిచిన ఒక నెలవఱకును వ్యాధిపీడ కలుగును ఒక దినమంతయు విడువక చంద్రస్వరము నడిచిన ఆదినమువనే మరణము గలుగును ఈ క్రమంబును తెలిసికొనిన బుద్ధిమంతుఁడు లీలగ కాలమును జయించును.

ఏవం రవి శ్చ చంద్ర శ్చ భ వేతా మతిచారగా ।
అధీతే భాస్కరే మృత్యు శ్చంద్రే స్యా ద్వ్యాధిపీడితః ॥ ౪౨
ఆగతం తు యథాకాలం విఘ్నరూపేణ భామిని ! ।
తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జపహోమ సురార్చనైః ॥ ౪౩

తా. ఇట్లు సూర్యచంద్రులు అతిచారమును పొందినయెడల సూర్యునివలనమరణము చంద్రుని వలన వ్యాధిపీడయని తెలియవలయు. ఓపార్వతీ ! ఈరీతినివిఘ్నరూపముగా వచ్చెడికాలమును ఔషధసేవనము దానములు జపములు హోమములు దేవపూజ మొదలగు వానిచే జయింపవచ్చును ఈయపమృత్యువు తొలఁగును.

అథాత స్సంప్రవక్ష్యామి జాగ్రతోఽనిష్టదర్శనమ్ ।
జిహ్వా కృష్ణా భ వే ద్యస్య ముఖం చ కుంకుమారుణమ్ ।
ఈదృశం లక్షణం యస్య తస్య మృత్యు ర్న సంశయః ॥ ౪౪

తా. ఇఁక మరణచిహ్నములను జెప్పెద, ఎవనికి నాలుక నల్లగ ముఖముకుంకుమవలె నెఱ్ఱగనుండునో వానికి నొక సంవత్సరములోపల మరణముగలుగును.

మూలే వృక్షస్య శాఖాయాం స్ఫులింగా వహ్నిసంభవాః ।
ప్రభాంతి మధ్భి ర్మాసై స్స మానవో మ్రియతే ధ్రువమ్ ॥ ౪౫
యస్య రేతో మలం మూత్రం కఫయుక్తం మలం తు వా ।
ఇహైకదా భ వే ద్యస్య అబ్దం తస్యాయు రిష్యతే ॥ ౪౬
యస్య వై భుక్తమాత్రస్య హృదయే వర్ధతే క్షుధా ।
జానీయా ద్వర్షాంతే చ స గతాయు ర్న సంశయః ॥ ౪౭

తా. చెట్టుమొదలునందును కొమ్మయందును నిప్పుతునుకలు రాలుచున్నట్లుగనపట్టిన వాఁడు నెలలు బ్రతుకును. రేతస్సు మలము మూత్రము నురుగుతోఁ గూడిన మలము ఇవి యొకానొకప్పుడు స్వభావ విరుద్ధముగను అనేక విధములుగను గనుపడినను, అన్నమును భుజించిన వెంటనే ఆఁకలి పుట్టినను ఒక సంవత్సరములో మృతిబొందును.

ఇంద్రనీలనిభం వ్యోమ్ని నాగబృందం య ఈక్షతే ।
ఇత స్తతః ప్రసరణం షాణ్మాసం స తు జీవతి ॥ ౪౮

సదా చోదరపూర్ణ స్తు వారిచ్ఛా చ దివానిశమ్ ।
ప్రత్యేకత శ్చతుః పంచ షణ్మాసే తు స జీవతి ॥ ౪౯

వేత్తి నీలాదివర్ణస్య కట్వమ్లలవణస్య చ ।
అకస్మా దన్యథాభావం షణ్మాసేన హి మృత్యుభాక్ ॥ ౫౦

నిజాస్య ప్రతిబింబం హి నీరదాంబుషు దర్పణే ।
ఉత్తమాంగం యో న పశ్యే త్షణ్మాసేన వినశ్యతి ॥ ౫౧

ప్రతాపేన వినిర్ముక్తః క్రుద్ధభాషీ నిరుద్యమః ।
షణ్మాసే చ న సందేహ స్స గచ్ఛే ద్య మశాసనమ్ ॥ ౫౨

సమృద్ధే వా నిధువనే ధ్వాంతాంతే క్షోభిచే న్మనః ।
నిశ్చితం పంచమే మాసి ధర్మరాజాతిథి ర్భవేత్ ॥ ౫౩

కాకవిష్ఠాసమో యస్య పాంసువర్షసమో మలః ।
స్వచ్ఛాయా మన్యథా పశ్యే ద్య స్స జీవతి పంచమమ్ ॥ ౫౪

తా. ఆకసంబున నింద్రనీల సదృశంబులైన సర్పంబుల గుంపు సంచరించుచుండు నట్లు గనుపడిన నాలుగు నెలలు జీవించును. ఎల్లప్పుడు ఉదరముబ్బియుండుటయు అహోరాత్రములు నీరుద్రాగుటయం దిచ్ఛయు గలిగియుండిన ౪ లేక ౫ లేక ౬ నెలలు జీవించును నలుపు పసుపు మొదలగువర్ణములను, కారము పులుసు ఉప్పుగలద్రవ్యములను అకస్మాత్తుగ వ్యత్యయముగ నెఱింగినను ౬ నెలలలోపల మృతిబొందును. తనముఖప్రతిబింబముగాని శరీరముగాని వాననీటియందును అద్దమునందును గనుపడకుండినను ఆఱ్నెలలలోమృతిగలుగును, శక్తియుడిగినట్లుండుటయు ఎప్పుడునుకోపముతో మాటలాడుటయు కార్యములయందు ప్రయత్నము లేకుండుటయు గలిగియుండిన నాలుగు నెలలకు మరణముగలుగును. ఐశ్వర్యముతోఁగూడియుండి నప్పుడు చీకటిలో స్త్రీసంభోగము చేయుటయం దిష్టముకలిగిన నైదుమాసములుజీవించును. మలముకాకవిష్ఠమువలెను ధూళివర్షమువలెను గనుపడినను తననీడవేఱువిధముగ గనుపడినను ఐదునెలలలోపల మృతి పొందును.

అనభ్రాం విద్యుతం దృష్ట్వా దక్షిణాం దిశ మాస్థితామ్ ।
తథైకోపి ధనుర్వాపి జీవితం చ త్రిమాసికమ్ ॥ ౫౫

వర్ణహీన శ్చ కామేన స్వాదునైవ తథైవ చ ।
రహిత శ్చ త్రిభి ర్మాసై స్స గచ్ఛే ద్యమశాసనమ్ ॥ ౫౬

తా. మేఘములేనపుడు మెఱుపును, దక్షిణపుదిక్కున నింద్రధనుస్సును గనుపడిన మూడు నెలలుబ్రతుకును. శరీరమునందుకాంతిలేనివాఁడుగను, కామరహితుఁడుగను రుచి తెలియనివాఁడుగనునుండిన మూడు నెలలకుమీఁద మృతినొందును.

స్థూలంకృశం కృశస్థూలం తదా మా స్యనువర్తతే।
ఘృతే తైలే దర్పణే చ తోయే వా వానరీం తనూమ్॥ ౫౭
యః పశ్యే దశిరస్కంధం మాసా దూర్ధ్వం న జీవతి।
అశక్తిః పాండువర్ణ శ్చ బహునిశ్వాససంయుతః॥ ౫౮
మలం చ పతతే నిత్యం మాస మేకం న జీవతి।
శక్రాయుధం చార్ధరాత్రే దివా గ్రహణకం తథా॥ ౫౯
దృష్టమాత్రేణ సంక్షీణ మాయు ర్జీవిత మాత్మవిత్।
నాసికా వక్రతా మేతి కర్ణయోరపి చోన్నతిః॥ ౬౦
నేత్రే బాష్పం స్రవే ద్యస్య తయో రేవం సమున్నతః।
ఆరక్తమేతి వక్త్రం చ జిహ్వా హ్రిస్వాయతే యదా॥ ౬౧
తదా ప్రాజ్ఞో విజానీయా న్మృత్యుం మాసిక మాప్నుయాత్।
దీపనిర్వాణగంధంచ సుహృద్వాక్య మరుంధతీమ్॥ ౬౨
న జిఘ్రంతి న శృణ్వంతి న పశ్యంతి గతాయుషః।
సూర్యోదయే శివా యస్య క్రోశన్నాయాతి సమ్ముఖమ్॥
విపరీతం పురీషం వా సద్యోమృత్యుం స గచ్ఛతి॥ ౬౩

తా. దేహము అకస్మాత్తుగస్థూలంబైనను కృశించినను ఒక నెలలోపల మరణము గలుగును. నేయి నూనె అద్దము నీళ్ళు వీనియందు తనదేహము వానర దేహమువలె గనుపడినను, శిరములేనట్లు గనుపడినను ఒక నెల మీఁద బ్రతుకఁడు. హఠాత్తుగ దేహమునందు శక్తిలేకుండుట, పాండువర్ణము, మిక్కిలి నిశ్వాసము వచ్చుట, నిత్యము మలము పలుమారు వెడలుట ఇవి గలిగినయెడ నొకమాసము జీవించును. నడిరేయియందు ఇంద్రధనుస్సును పగలుచంద్రగ్రహణంబును గనుపడిన ఆయుఃక్షీణము గలుగునని తెలియునది. ముక్కువంకరయై చెవులు పొడువుగనై కన్నులయందు నీరు స్రవింపుచు కన్నులున్నతములై ముఖమెఱ్ఱగను నాలుక లోపలికీడ్చుకొనియునుండిన నొకమాసములో మరణముగలుగునని తెలియవలయు. దీపమారినప్పుడు వాసన తెలియకుండినను మిత్రులమాటల

తెలియకుండినను మిత్రులమాటలయందసూయగలిగినను, అరుంధతీ నక్షత్రము గనుపడకుండినను, వాసన తెలియకుండినను, ధ్వనివినరాకుండినను ఆయుఃక్షీణమని తెలియవలయు. సూర్యోదయమగునప్పుడు నక్కలరచుచు నెదురుగ పరుగెత్తివచ్చినను మలము విపరీతముగ వెడలినను సద్యోమృతిగలుగును.

## చతుర్వింశోఽధ్యాయః.

అథాత స్సంప్రవక్ష్యామి స్వప్నాధ్యాయ మనుత్తమమ్।
సర్వేంద్రియా ణ్యుపరతౌ మనో హ్యుపరతం యదా॥ ౧
విషయేభ్య స్తదా స్వప్నం నానారూపం ప్రపశ్యతి।
స స్వప్నో ద్వివిధః ప్రోక్త ఇష్టా నిష్టఫల స్తథా॥ ౨

తా. ఓపార్వతీ! అటుపిమ్మట స్వప్నశుభాశుభ ఫలములఁ జెప్పెద, సర్వేంద్రియములు వానివాని వ్యాపారములను చాలించియుండఁగా ఎప్పుడు మనస్సుగూడ వ్యాపారమును జాలించి సుషుప్తిజెందునో అప్పుడు జీవుఁడు పదార్థములవలన నానావిధమగు స్వప్నమును గనుచున్నాఁడు. అది ఇష్టఫలము అనిష్టఫలము అని రెండు విధములు.

నదీ సముద్రతరణ మాకాశగమనం తథా।
భాస్కరోదయనం చైవ ప్రజ్వలంతం హుతాశనమ్॥ ౩
గ్రహ నక్షత్ర తారాణాం చంద్రమండల దర్శనమ్।
హర్మ్య స్యారోహణంచైవ ప్రాసాదశిఖరేఽపివా॥ ౪
ఏవమాదీని సందృష్ట్వా నర స్సిద్ధి మవాప్నుయాత్।
స్వప్నే తు మదిరాపానం వచామాంసస్య భక్షణమ్॥ ౫
కృమి విష్ఠానులేపం చ రుధిరేణా భిషేచనమ్।
భోజనం దధిభక్తస్య శ్వేతవస్త్రానులేపనమ్॥ ౬
రత్నా న్యాభరణాదీని స్వప్నే దృష్ట్వా ప్రసిద్ధ్యతి।
దేవ విప్ర ద్విజ చ్ఛత్ర తుష పంకజ పార్థివాః॥ ౭
శుక్లపుష్పాంబరధరాం ప్రశస్తాభరణాంగనామ్।
వృషభం పర్వతం క్షీరం ఫలివృక్షాధిరోహణమ్॥ ౮
దర్పణామిషమాల్యాప్తి స్తరణం చ మహాంభసామ్।
దృష్ట్వా స్వప్నేఽర్థలాభ స్స్యా ద్వ్యాధిముక్తి శ్చ జాయతే॥
య స్తు పశ్యతి వై స్వప్నే రాజానం కుంజరం హయమ్।
సువర్ణం వృషభం గాం చ కుటుంబం తస్య వర్ధతే॥ ౧౦

తా. నదులను సముద్రమును దాఁటుట, ఆకాశమునందు బోవుట, సూర్యోదయము, మండుచున్న నిప్పు నవగ్రహములు నక్షత్రములు చంద్రమండలము వీనిని గాంచుట, మేడలు రాజగృహములు దేవతాగృహములు వీనిపైనెక్కుట ఇవి మొదలగువానిని స్వప్నమున గాంచిననరుఁడు కార్యసిద్ధిని పొందును, కల్లుద్రావుట, వస మాంసము వీనినితినుట, పురుగులు పురీషము వీనినిశరీరమున బూసికొనుట, రక్తస్నానము, పెరుగన్నమును తినుట, తెల్లనివస్త్రములు తెల్లనిచందనము మొదలగు మైపూఁతలు, రత్నములు ఆభరణాదులు ఇవియు స్వప్నమందుగలిగిన కార్యసిద్ధికరములు. దేవతలు, విప్రులు, ద్విజులు, గొడుగు, పొట్టు. పద్మములు, రాజులు, తెల్లనిపూలను వస్త్రములను మంచియాభరణములను ధరించినస్త్రీ, ఎద్దు, కొండ, పాలు, ఫలవంతమగు వృక్షమునెక్కుట, అద్దము మాంసము పూలమాలికలు వీనినిపొందుట, గొప్పయేళ్ళు చెరువులు నదులు వీనినిదాటుట ఇవి స్వప్నమునందుఁగలిగిన ధనలాభమగును, రోగవిముక్తియునగును. స్వప్నమున రాజు ఏనుఁగు గుఱ్ఱము బంగారు ఎద్దు ఆవు వీనిని జూచిన వానియొక్క కుటుంబము వృద్ధియగును.

ఆరోహణంగోవృషకుంజరాణాంప్రాసాదశైలాగ్రవనస్పతీనాం ।
విష్ఠానులేపోరుదితంమృతంచస్వప్నేష్వగమ్యాగమనంచధన్యం ॥
క్షీరిణం ఫలితం వృక్ష మేకాకీ యః ప్రరోహతి ।
తత్ర స్థస్స విబుధ్యేత ధనం శీఘ్ర మవాప్నుయాత్ ॥ ౧౨

తా. ఆవు, ఎద్దు, ఏనుఁగు, దేవ రాజగృహములు, కొండకొన, వృక్షములు వీనిపై నెక్కుట, మలమును బూసికొనుట, ఏడ్చుట, చచ్చుట, పొందఁగూడని స్త్రీని పొందుట ఇవి స్వప్నమున గలిగిన మంచిది పాలుగలిగిన పండియున్న వృక్షమును ఒంటరిగానెక్కి యచ్చటనుండియే మేల్కొనిన శీఘ్రముగ ధనలాభమగును.

యస్య శ్వేతేన సర్పేణ గ్రస్త శ్చే ద్దక్షిణః కరః ।
సహస్రలాభ స్తస్య స్యా దపూర్ణే దశమే దినే ॥ ౧౩
ఉరగో వృశ్చికోవాపి జలే గ్రసతి యం నరమ్ ।
విజయం చార్థసిద్ధిం చ పుత్త్రిం తస్య వినిర్దిశేత్ ॥ ౧౪
ప్రాసాదం శైల మారుహ్య సముద్రం తరతే నరః ।
అపి దాసకులే జాతో రాజా భవతి వై ధ్రువమ్ ॥ ౧౫
య స్తు మధ్యే తటాకస్య భుంక్తే చ ఘృతపాయసమ్ ।
అఖండే పుష్కరే పత్రే తం విద్యా త్పృథివీపతిమ్ ॥ ౧౬

బలాకాం కుక్కుటీం క్రౌంచీం దృష్ట్వా యః ప్రతిబుధ్యతి ।
కులజాం లభతే అన్యాం భార్యాం చ ప్రియవాదినీమ్ ॥ ౧౭
నిగళై ర్బధ్యతే య స్తు బాహుభ్యాం పాశేన వా పునః ।
పుత్త్రో వా జాయతే తస్య ధనం శీఘ్ర మవాప్నుయాత్ ॥ ౧౮
ఆసనే శయనే యానే శరీరే వాహనే గృహే ।
జ్వలమానే విబుధ్యేత తస్య శ్రీ స్సర్వతోముఖీ ॥ ౧౯
ఆదిత్యమండలం స్వప్నే చంద్రం వా యదిపశ్యతి ।
వ్యాధితో ముచ్యతే రోగా దరోగీ శ్రియ మాప్నుయాత్ ॥ ౨౦
రుధిరం పిబతి స్వప్నే సురాంవాపి తథా నరః ।
బ్రాహ్మణో లభతే విద్యా మితరో లభతే ధనమ్ ॥ ౨౧
శుక్లాంబరధరా నారీ శుక్లగంధానులేపనా ।
ఉపగూహతి వై స్వప్నే శ్రియం తస్య వినిర్దిశేత్ ॥ ౨౨

తా. తెల్లని సర్పముచే కుడిచేయికఱవఁబడిన ౧౦ దినములలోపల సహస్రలాభము గలుగును. పాముగాని తేలుగాని నీటియందుఁగఱచినట్లయిన విజయము అర్థసిద్ధి పుత్రోత్పత్తియుగలుగును. దేవతారాజగృహములు కొండలు వీనిపైనెక్కి సముద్రమును దాఁటినయెడల నీచకులమునందుఁ బుట్టినవాఁడయినను నిశ్చయముగ రాజగును. చెరువునడుమ నేయి పాయసము వీనిని గొప్పతామరాకునందు భుజించిన భూపతియగును. తెల్లకొక్కెరపక్షి ఆఁడుఁగోడి ఆఁడుకొంగ వీనినిచూచి మేల్కొనినయెడల స్వకులమునబుట్టినదియు ప్రియముగ మాటలాడునదియు నగు మఱియొక భార్యను పొందును. గొలుసులతో బంధింపఁబడినట్లును బాహువులు త్రాటిచేఁగట్టఁబడినట్లును స్వప్నమైనయెడల పుత్రుఁడుగలుగు; లేక శీఘ్రముగ ధనమైనను వచ్చును. తన ఆసనము పాన్పు వాహనము శరీరము గృహము ఇవి మండుచుండఁగా నప్పుడే మేల్కొనినయెడల వానికి గొప్పసంపదగలుగు. చంద్రసూర్యమండలముల గాంచిన రోగి రోగవిముక్తుఁ [illegible]గము లేనివాఁడు సంపదనొందును. స్వప్నమున నెత్తురునుగాని కల్లునుగాని బ్రాహ్మణుఁడు త్రాగిన విద్యనుపొందును. ఇతరుఁడైనయెడల ధనమును పొందును.

పాదుకోపానహౌ ఛత్రం లబ్ధ్వా యః ప్రతిబుధ్యతి ।
అసివా విమలం తీక్ష్ణం సాధ్వన్నం తస్య నిర్దిశేత్ ॥ ౨౩
రథం గోవృషసంయుక్త మేకాకీ యః ప్రరోహతి ।
తత్ర స్థ స్స విబుధ్యేత ధనం శీఘ్ర మవాప్నుయాత్ ॥ ౨౪

దధిలాభే భవే దర్థో ఘృతలాభే ధ్రువం యశః।
ఘృతభక్షే ధ్రువం క్లేశో యశ స్తు దధిభక్షణే॥ ౨౫
అగ్నినా వేష్టితో యో వై నగరేఽపిగృహేఽపివా।
గృహే మాండలికో రాజా నగరే పార్థివో భవేత్ ॥ ౨౬

తా. తెల్లనివస్త్రముల ధరించి తెల్లని చందనాదులను పూసికొనిన స్త్రీ తనను కౌఁగలించినయెడల సంపదగలుగును. పావుకోళ్లు పాదరక్షలు గొడుగు ఇవి లభించినట్లు స్వప్నంబై వెంటనే మేల్కొనినను మంచిపదునుగల నిర్మలమైన కత్తిదొరకినట్లయినను మంచిభోజనము గలుగును. ఆవు ఎద్దులు వీనినికట్టినరథమును ఒంటరిగ నెక్కినట్లయి వెంటనేమేల్కొనిన శీఘ్రముగ ధనమును పొందును. పెరుగుదొరకిన అర్థలాభము, నేయిదొరకిన మంచికీర్తిగలుగును, నేతినితినిన కష్టము గలుగును. పెరుగుతినిన కీర్తిగలుగును. తాను గృహమునందు నిప్పులో తగులుకొన్నట్లయిన మండలాధిపత్యము గల రాజగును పట్టణమందు నిప్పులో తగులుకొన్నట్లయిన పృథివీపతియగును.

మానుషాణి చ మాంసాని స్వప్నాంతే య స్తు పశ్యతి।
హరితాని చ పక్వాని శృణు తస్య చ యత్ఫలమ్॥ ౨౭
పద్భక్షణే శతం లాభ స్సహస్రం బాహుభక్షణే।
రాజ్యం శతసహస్రం వా భవే ద్వై శిరభక్షణే॥ ౨౮

తా. పక్వమైన మనుష్యుని పాదముల మాంసమును తినినట్లయిన నూరు లాభమగును. బాహువుల భక్షించినట్లయిన సహస్రలాభము గలుగును. తలను భక్షించినట్లయిన రాజ్యముగాని నూరువేలుగాని లభించును.

సర్వాణి శుక్లాన్యతిశోభనాని కార్పాసభస్మౌదనతక్రవర్జ్యమ్।
సర్వాణి కృష్ణా న్యతినిందితాని గోహస్తి దేవద్విజ వాజివర్జ్యం॥

తా. ప్రత్తి భస్మము అన్నము మజ్జిగ ఇవి తప్ప తక్కిన తెల్లని వస్తువులన్నియు శుభప్రదములు, ఆవు ఏనుఁగు దేవతలు ద్విజులు గుఱ్ఱములు ఇవి తప్ప తక్కిన నల్లని వస్తువులన్నియు అతినిందితములు.

క్షీరం పిబతి యః స్వప్నే సఫేనం దోహదే కృతే।
సోమపానం భవే త్తస్య భోక్తా భోగా ననేకశః॥ 30
దధి దృష్ట్వా భవే త్ప్రీతి ర్గోధూమానాం శ్చ ధనాగమః।
యవాక్ష యజ్ఞాగమం విద్యా ల్లాభ స్సిద్ధార్థకానపి॥ ౩౧

నాగపత్రం లభేత్స్వప్నే కర్పూర మగరుం తథా ।
చందనం పాండురం పుష్పం తస్య శ్రీ స్సర్వతోముఖీ ॥ ౩౨

తా. పితృతర్పణము సరుగుతోఁగూడియుండు పాలను త్రాగినట్లయిన యజ్ఞము నందు సోమపానము చేయువాఁడును, అనేకభోగముల ననుభవించువాఁడు నగును. పెరుగును చూచిన సంతోషముగలుగును. గోధుమలను చూచిన ధనప్రాప్తియగును. యవధాన్యమును జూచిన యజ్ఞప్రాప్తియగును. ఆవాలనుజూచిన మేలుగలుగును. తములపాకు కర్పూరము అగరు చందనము తెల్లనిపుష్పము వీనిని పొందిన నఖండ సంపదగలుగును.

యూప కింశుక వల్మీక పారిభద్రాధిరోహణమ్ ।
తైలకార్పాసరాయాక లోహావాప్తి ర్విపత్తయే ॥ ౩౩
విహారక్షరణం స్వప్నే రక్తవస్త్రవిధారణమ్ ।
స్రోతసాం హరణం నేష్టం పక్వమాంసస్య భోజనమ్ ॥ ౩౪
ఆదిత్యం వాథ చంద్రం వా విగతచ్ఛవికం తథా ।
పతంతం చాథ నక్షత్రం తారకాదీం శ్చ వా యది ॥ ౩౫
అశోకం కరవీరం వా పలాశం వాథ పుష్పితమ్ ।
స్వప్నాంతే య స్తు పశ్యేత నర శ్శోక మవాప్నుయాత్ ॥ ౩౬
నావ మారుహ్య య స్స్వప్నే నదీంచైవ సముత్తరేత్ ।
ప్రవాసం నిర్దిశే త్తస్య శీఘ్రం చ పునరాగమమ్ ॥ ౩౭
రక్తాంబరధరా నారీ రక్తగంధానులేపనా ।
ఉపగూహతి వై స్వప్నే మృత్యుం తస్య వినిర్దిశేత్ ॥ ౩౮
తైలేనాభ్యక్తకాయ స్తు పయసా తు ఘృతేన వా ॥
స్నేహేన వా తథాన్యేన వ్యాధిం తస్య వినిర్దిశేత్ ॥ ౩౯
కేశా యస్యావశీర్యంతే దంతా యస్య పతంతి వై ।
అర్థనాశో భవే త్తస్య పుత్రో వా యది నశ్యతి ॥ ౪౦
ఖరోష్ట్రమాహిషరథ మేకాకీ యః ప్రరోహతి ।
తత్ర స్థ స్స తు బుధ్యేత మృత్యుం శీఘ్ర మవాప్నుయాత్ ॥ ౪౧
కర్ణనాసాకరాదీనాం ఛేదనం పంకమజ్జనమ్ ।
పతనం దంతకేశానాం పక్వమాంసస్యభక్షణమ్ ॥
ఖరోష్ట్రమాహిషయానం తైలాభ్యంగం చ మృత్యవే ॥ ౪౨

తా. స్వప్నమున గంగరావి మోదుగు పారిజాతము ఈ చెట్లమీఁదను పుట్టమీఁది చెట్టుమీఁదను ఎక్కుట, నూనె ప్రత్తి రాయాకవృక్షము ఇనుము వీనిని పొందుట ఆపదను గలిగించును. విహరించుట రక్తవస్త్రమునుధరించుట ప్రవాహములు హరించి నట్లుగుపడుట పక్వమాంస భోజనము, సూర్యచంద్రుల నున్నట్లుండి కాంతిహీనులనుగా జూచుట, నక్షత్రములు క్రిందఁబడుచున్నట్లు గనుపడుట, పుష్పించిన అశోకము గన్నేరు మోదుగు వీనిని జూచుట వీనివలన శోకమును పొందును. ఓడనెక్కి నదులను దాఁటినట్లయిన ప్రయాణముగలిగి శీఘ్రముగ పునరాగమనము గలుగును. ఎఱ్ఱనివస్త్ర మును ధరించి యెఱ్ఱనిచందనమును బూసికొనిన స్త్రీ తనను కౌఁగలించినట్లయిన మృత్యువు కలుగును. నూనె పాలు నెయ్యి వీనిచేతగాని ఇతరములయిన చమురులచేత గాని శరీరమును పూసికొన్నట్లయిన వ్యాధిగలుగును. వెండ్రుకలురాలుట దంతము లూడిపడుట వీనివలన ద్రవ్యనాశముగాని పుత్రనాశముగాని కలుగును. గాడిదెలు ఒంటెలు దున్నపోఁతులు వీనిని గట్టిన రథమును ఒంటరిగా నెక్కినట్లయి యచ్చోట నుండి మేల్కొనిన మృత్యువు గలుగును. చెవులు ముక్కు చేతులు మొదలగు అంగ ములు ఛేదింపఁబడినట్లును, బురదలో దిగినట్లును, గాడిదె, ఒంటె, దున్నపోఁతు వీని పైనెక్కి పోయినట్లును తలయంటుకొనినట్లును స్వప్నమైన మృత్యువు గలుగును.

రోగే ధాతువికారే వా దివాస్వప్నో నిరర్థకః ।
స్వప్నా స్తు ప్రథమే యామే సంవత్సరవిపాకినః ॥ ౪౩
ద్వితీయే చాష్టభి ర్మాసై స్త్రిభి ర్మాసై స్తృతీయకే ।
చతుర్థయామే యు స్స్వప్నో మాసేన ఫలదః స్మృతః ॥ ౪౪
అరుణోదయవేళాయాం దశాహేన ఫలం భవేత్ ।
గోవిసర్జనవేళాయాం సద్యఏవ ఫలం భవేత్ ॥ ౪౫
భవే దేవం చ సుస్వప్నే దుస్స్వప్నే తు తదర్థకమ్ ।
సుస్వప్నదర్శనా దూర్ధ్వం నిద్రాభు ర్న పున ర్భవేత్ ॥ ౪౬
దుస్వప్నదర్శనా దూర్ధ్వం శుద్ధ శ్శాంతిం సమాచరేత్ ।
అనుక్త్వా చ పున ర్నిద్రాం లభే త్తద్దోషశాంతయే ॥ ౪౭
సుస్వప్నం బ్రాహ్మణేభ్య శ్చ నివేద్యాశిష మాప్నుయాత్ ।
న పున శ్శయనం కుర్యా న్న రాత్రౌ త న్నివేదయేత్ ॥ ౪౮

* ఇత్యుమామహేశ్వరసంవాదే, స్వరచింతామణౌ స్వప్నశుభాశుభ ఫలకథనంనామ చతుర్దశోఽధ్యాయః. *

తా. రోగమువలనగాని ధాతువికారమువలనగాని పగటియందుగాని కలిగిన స్వప్నమునకు ఫలములేదు. స్వప్నములు మొదటి జామునందైనయెడల సంవత్సరమునకును, రెండవజామునందైనయెడల ౮ మాసములకును, మూడవజామున నైనయెడల మూడు నెలలకును, నాలవజామునందైనయెడల ఒక మాసమునకును ఫలమునిచ్చును. అరుణోదయకాలమునందైనయెడల ౧౦ దినములలో ఫలముగలుగును. ఆవు దూడను విడుచువేళయయిన యెడల నప్పుడే ఫలముగలుగును, ఇది సుస్వప్ననిర్ణయము. దుస్స్వప్నములైనయెడల పైఁజెప్పిన కాలమునకు సగము కాలములోనగును. సుస్వప్నముగలిగినయెడల తిరుగానిద్రింపఁగూడదు. దుస్స్వప్నములైనయెడల దానిశాంతికొఱకు శుద్ధుఁడై ఎవరితోను చెప్పక మరల నిద్రింపవలయు సుస్వప్నమును ప్రొద్దునలేచి బ్రాహ్మణోత్తములకెఱింగించి వారివలననాశీర్వాదము గొనవలయు. రాత్రియందుఁజెప్పఁగూడదు.

---

## పంచవింశోఽధ్యాయః.

అథ వక్ష్యే మహాదేవి! శాకునం సంగ్రహేణ తే।
ఔషధాని చ యుక్తాని ధాన్యం కృష్ణ మశోభనమ్॥ ౧
కార్పాసం తృణశుష్కం చ కాష్ఠాని చ ధనాని చ।
అంగార గుడతైలం చ ముండాభ్యక్తం చ నగ్నకమ్॥ ౨
అయః పంకం చర్మకేశా వున్మత్త శ్చ నపుంసకః।
చండాలశ్వపచాద్యా శ్చ నరా బంధనపాలకాః॥ ౩
గర్భిణీ స్త్రీ చ విధవా పిణ్యాకాదీని వైమృతమ్।
తుషభస్మకపాలాస్థి భిన్నభాండ మశస్తకమ్॥ ౪
ఏహీంతి పురతశ్శబ్ద శ్శస్యతే న తు పృష్ఠతః।
గచ్ఛేతి పశ్చా చ్ఛబ్దోఽగ్ర్యః పురస్తా త్తు విగర్హితః॥ ౫
క్వ యాసి! తిష్ఠ మాగచ్ఛ కిం తే తత్ర గతస్య చ।
స్ఖలనం వాహనానాం చ శస్త్రభంగ స్తథైవ చ। ౬
శిరోఘాత శ్చ ద్వారాద్యై శ్ఛత్రవాసాదిపాతనమ్।
హరి మభ్యర్చ్య సంస్తుత్య స్యా దమంగళ్యనాశనమ్। ౭
ద్వితీయం తు తతో దృష్ట్వా విరుద్ధం ప్రవిశే ద్గృహమ్॥ ౮

తా. ఓపార్వతీ! ఇఁక శుభాశుభ శకునలక్షణముల సంగ్రహముగఁ జెప్పెద. ఔషధములు మంచిశకునము. నల్లనిధాన్యము, ప్రత్తి, ఎండుగడ్డి, కట్టెలు, ధనము,

కో అవికట్టె, జల్లెము, నూనె, బోడితలకు నూనెయంటుకొన్న మనిషి, దిగంబరుఁడు, ఇనుము, బురద, చర్మము, వెంట్రుకలు. పిచ్చివాఁడు, నపుంసకుఁడు, చండాలుఁడు మొదలగువారు, కారాగృహపాలకులు. గర్భిణీ స్త్రీ, రండ, గానుగపిండి, చావు, పొట్టు, భస్మము, తలపు జ్టెయెముక. పగిలినకుండలు ఇవి యెదురుగవచ్చిన అపశకునములు. మఱియు పోవునపుడు పిలుచుటకూడదు. పొమ్మని చెప్పుట మంచిది. ఎవఁడైనను ముందుండి మరలి పొమ్మని చెప్పుట, ఎక్కడికిఁబోయెదవు ఉండు ఇప్పుడు పోవలదు, ఎందుకుపోవుచున్నావు అని యడుగుట, ఇవి కార్యనాశకరములును మృత్యుహేతువులును అగును. బండిపండుట, చేతిలోని ఆయుధము క్రిందఁబడుట, పోవునపుడు ద్వారబంధము గలన నెత్తిమీఁద దెబ్బతగులుట. గొడుగు పైవస్త్రము క్రిందఁబడుట ఇట్టి యపశకునములు గలిగిన మరలివచ్చి శ్రీహరిపూజగావించి ధ్యానించి కొంతసేపుతాళి బయలు వెడలవలయు, రెండవమారును అపశకునంబయిన యెడల మరలి యింటికిఁ బోవలయును.

(శుభశకునములు) శ్వేతాస్సుమనసశ్శ్వేతాః పూర్ణకుంభో మహోత్తమః
మాంసం మత్స్య దూరశబ్దా వృద్ధ ఏకః పశు స్త్వజః ।
గావ స్తురంగమా నాగా దేవా శ్చ జ్వలితోఽనలః ॥ ౯
దూర్వార్ద్ర గోమయం వేశ్యా స్వర్ణ రూప్యం చ రత్నకమ్ ।
కన్యా సువాసినీ చైవ లాజా బ్రాహ్మణయుగ్మకమ్ ॥ ౧౦
వచాసిద్ధార్థ కౌషధ్యో ముద్గ ఆయుధఖడ్గకమ్ ।
ఛత్రం పీఠం రాజలింగం శవం రుదితవర్జితమ్ ॥ ౧౧
ఫలం ఘృతం దధి పయో హ్యక్షతా దర్శ మాక్షికమ్ ॥
శంఖ ఇక్షు శ్శుభం వాక్యం భక్తవాదిత్ర గీతకమ్ ॥
గంభీరమేఘ స్తనితం తటిత్ తుష్టి శ్చ మానసీ ॥ ౧౨

తా. తెల్లని పుష్పములు శ్రేష్ఠములు. జలపూర్ణభాండములు మిక్కిలి ఉత్తమము, మాంసము, మత్స్యములు, దూరముగా ధ్వనివినుట, ముసలివాఁడు, మేఁక, ఆవులు, గుఱ్ఱములు, ఏనుఁగులు, దేవతలు, మండుచున్ననిప్పు, గరికె, ఆవుపేఁడ, భోగముది, బంగారు, వెండి, రత్నములు, పెండ్లికానిపడుచు, ముత్తయిదువ, పేలాలు, ఇద్దరు బ్రాహ్మణులు, వస, ఆవాలు, మూలికలు, పెసలు, ఆయుధములు, కత్తి, గొడుగు, పీఁటలు, రాజచిహ్నములు, కూడ ఏడ్చువారు లేని పీనుఁగు, పండ్లు, నేయి, పెరుగు, పాలు, అక్షతలు, అద్దము, తేనె, శంఖము, చెఱకు, శుభవాక్యములును, భక్తులు వాయించెడి చతుర్విధవాద్య ఘోషము, ఉరుములు, మెఱుము, మనస్సంతుష్టి ఇవి మంచి శకునములు.

(పిల్లిశకునము) తిర్యగ్గతే తు మార్జాలే కార్యహానిం వినిర్దిశేత్ ॥ ౧౩
మార్జారకలహే చైవ పురతః కలహో భవేత్ ।
గ్రసిత్వా మూషకం యస్తు పురతో హ్యభిగచ్ఛతి ॥ ౧౪
శత్రూణా మజయం చైవ గంతు ర్విజయ మేవ చ ।
కార్యకర్తు ర్మధ్యయానే కార్యనాశం భవే ద్ధ్రువమ్ ।
వక్త్రసంశోధనా త్తస్య స్వజనాగమనం భవేత్ ॥ ౧౫

తా. పోవునపుడు పిల్లి అడ్డముగపోయిన కార్యహానియగును. పిల్లులు ఎదురుగ పోరాడిన కలహమగును. ఎలుకను నోటగఱచికొని ఎదురుగ వచ్చిన తనకు జయమును శత్రువులకపజయమునగును. తానుచేయుకార్యమునకు నడుమ పిల్లిపోయిన కార్యనాశమగును. ముఖము తుడుచుకొనుచుండిన బంధువులు వత్తురు.

(కాకిశకునము) యాతుః కాకోఽనుకూలస్తు క్షేమః కర్మక్షమోభవేత్ ॥ ౧౬
న త్వర్థసాధకో జ్ఞేయః ప్రతికూలో భయావహః ।
సమ్ముఖేఽభ్యేతి విరువన్ యాత్రాఘాతకరో భవేత్ ॥ ౧౭
వామః కాకః స్మృతో ధన్యో దక్షిణో ఽర్థవినాశకృత్ ।
వామోఽనులోమగ శ్శ్రేష్ఠో మధ్యమో దక్షిణః స్మృతః ॥ ౧౮
ప్రతిలోమగతి ర్వామో గమనప్రతిషేధకృత్ ।
అమేధ్యపూర్ణవదనః కాక స్సర్వార్థసాధకః ॥ ౧౯
ప్రోషితాగమకృ త్కాకః కుర్వ న్ద్వారి గతాగతమ్ ।
రక్తం దగ్ధం గృహే ద్రవ్యం క్షిపన్ వహ్నినివేదకః ॥ ౨౦
న్యసే ద్రక్తం పురస్తా చ్చ నివేదయతి బంధనమ్ ।
పీతం ద్రవ్యం తథా రుక్మ రూప్య మేవ తు పార్వతి ! ॥ ౨౧
యచ్చై చ్ఛోపనయే ద్ద్రవ్యం తస్య లబ్ధిం వినిర్దిశేత్ ।
ద్రవ్యం వాపనయే ద్యత్తు తస్య హానిం వినిర్దిశేత్ ॥ ౨౨
పురతో ధనలబ్ధి స్స్యా ద్దామమాంసస్య ఛర్దనే ।
భూలబ్ధి స్స్యా న్మృదః క్షేపే రాజ్యం రత్నార్పణే మహత్ ॥ ౨౩

తా. మనిషి ప్రయాణమై పోవునపుడు కాకి అనుకూలమైన యెడల క్షేమము కార్యసాఫల్యము నగును. ప్రతికూలమయినయెడల భయావహమును కార్యనాశము నగును. అరచుచు నెదురుగవచ్చిన ప్రయాణమునందు దెబ్బతగులును. కాకి ఎడమనుండి

(పిల్లి శకునము) తిర్యగ్గతే తు మార్జాలే కార్యహానిం వినిర్దిశేత్ ॥ ౧౩
మార్జారకలహేచ్చైవ పురతః కలహో భవేత్ ।
గ్రసిత్వా మూషకం యస్తు పురతో హ్యభిగచ్ఛతి ॥ ౧౪
శత్రూణా మజయం చైవ గంతు ర్విజయ మేవ చ ।
కార్యకర్త్రో ర్మధ్యయానే కార్యనాశం భవే ద్ధ్రువమ్ ।
వక్త్రసంశోధనా త్తస్య స్వజనాగమనం భవేత్ ॥ ౧౫

తా. పోవునపుడు పిల్లి అడ్డముగపోయిన కార్యహానియగును. పిల్లులు ఎదురుగ పోరాడిన కలహమగును. ఎలుకను నోటగఱచికొని ఎదురుగ వచ్చిన తనకు జయమును శత్రువుల కపజయమునగును. తాను చేయుకార్యమునకు నడును పిల్లిపోయిన కార్యనాశమగును. ముఖము తుడుచు కొనుచుండిన బంధువులు వత్తురు.

(కాకిశకునము) యాతుః కాకోఽనుకూలస్తు క్షేమః కర్మత్వమోభవేత్ ॥ ౧౬
న త్వర్థసాధకో జ్ఞేయః ప్రతికూలో భయావహః ।
సమ్ముఖేఽభ్యేతి విరువన్ యాత్రాఘాతకరో భవేత్ ॥ ౧౭
వామః కాకః స్మృతో ధన్యో దక్షిణో ఽర్థవినాశకృత్ ।
వామోఽనులోమగ శ్శ్రేష్ఠో మధ్యమో దక్షిణః స్మృతః ॥ ౧౮
ప్రతిలోమగతి ర్వామో గమనప్రతిషేధకృత్ ।
అమేధ్యపూర్ణవదనః కాక స్సర్వార్థసాధకః ॥ ౧౯
ప్రోషితాగమకృ త్కాకః కుర్వ న్ద్వారి గతాగతమ్ ।
రక్తం దగ్ధం గృహే ద్రవ్యం క్షిపన్ వహ్ని నివేదకః ॥ ౨౦
న్యసే ద్రక్తం పురస్తా చ్చ నివేదయతి బంధనమ్ ।
పీతం ద్రవ్యం తథా రుక్మ రూప్య మేవ తు పార్వతి ! ॥ ౨౧
యచ్చై చ్ఛోపనయే ద్ద్రవ్యం తస్య లబ్ధిం వినిర్దిశేత్ ।
ద్రవ్యం వాపనయే ద్యత్తు తస్య హానిం వినిర్దిశేత్ ॥ ౨౨
పురతో ధనలబ్ధి స్స్యా ద్దామమాంసస్య ఛర్దనే ।
భూలబ్ధి స్స్యా న్మృదః క్షేపే రాజ్యా రత్నార్పణే మహత్ ॥ ౨౩

తా. మనిషి ప్రయాణమై పోవునపుడు కాకి అనుకూలమైన యెడల క్షేమము కార్యసాఫల్యము నగును. ప్రతికూలమయినయెడల భయావహమును కార్యనాశము నగును. అరచుచు నెదురుగవచ్చిన ప్రయాణమునందు దెబ్బతగులును. కాకి ఎడమనుండి

తా. స్త్రీపురుషులు పరస్పరము పరిశుద్ధము లగు శుక్రశోణితములు కలవారయి నయెడల తేజోబలంబులతోఁగూడిన మంచిసంతానము కలవారయ్యెదరు.

(శుద్ధశుక్రార్తవలక్షణము.) శుక్రం శుక్లం గురుస్నిగ్ధంమధురం బహులం
ఘృతమాక్షికతైలాభం సద్గర్భాయార్తవం పునః॥ [బహు।
లాక్షారసశశాస్రాభం ధౌతం య చ్చ విరజ్యతే॥ ౩

తా. తెల్లగ బరువుగ చిక్కనగ మధురముగ విశేషముగ అధికముగ నుండి నదై నేయి తేనె నూనె వీనివలె జిగటగనుండు శుక్రము శుద్ధమైనదనియు మంచి గర్భమునకు కారణమైనదనియు తెలియవలయు—లక్కకుందేటినెత్తురు వీనితోఁదుల్యంబై వస్త్రమునుదికిన వెనుక కనుపడని యార్తవము శుద్ధంబును సద్గర్భహేతుభూతంబు నని తెలియవలయు.

(దుష్టశుక్రార్తవలక్షణము.) వాతపిత్తశ్లేష్మదుష్టం కుణపగ్రంథిపూతికం।
పూయక్షీణమూత్రవిష్ఠారేతాంస్యుత్పాదనేఽహితాః॥ ౪
రక్తేన చ త్రిభి ర్దోషైః పృథగ్ద్వంద్వై శ్చ సర్వతః।
దుష్టం త దార్తవం చైవ మబీజం భవతి ధ్రువమ్॥ ౫

తా. వాతపిత్తశ్లేష్మ ప్రకోపములచే జెడినదియు, పీనుఁగు వాసనగలదియు, గడ్డలతోఁగూడినదియు, కంపుగలదియు చీమువంటిదియు, స్వల్పమైనదియు, మలమూత్రముల వాసనవంటి వాసనకలదియునగు రేతస్సు సంతానమునకు కారణముకాజాలదు. వాతపిత్తశ్లేష్మ రక్తదోషములలో నొకదానిచేగాని ఒకదానితో నొకటిచేరుటచేగాని అన్నిదోషములచేగాని చెడినయార్తవము గర్భమును నిలుపజాలదు.

(దుష్టశుక్రచికిత్స) పాయయేత్తం నరం సర్పి ర్భిష క్కుణపరేతసి।
ధాతకీపుష్పఖదిర దాడిమార్జునసాధితమ్॥ ౬
పాయయే దథవా సర్పి స్సాలసారాదిసాధితమ్।
గ్రంథిభూతే శఠీసిద్ధం పాలాశేవాపి భస్మని॥ ౭
పరూషక వటాదిభ్యాం పూయప్రఖ్యే చ సాధితమ్।
విట్ప్రభే పాయయే త్సిద్ధం చిత్రకోశీరహింగుభిః॥ ౮

తా. ఆరెపువ్వు చండ్రబంక దానిమ్మచెక్క మద్దిచెక్క వీని కలకములోగాని లేక గుగ్గిలపు కలకములోగాని ఆవునేతిని కలిపి నీరిగురువఱకు కాచిత్రాగినయెడ పీనుఁగువాసనగల శుక్రదోషము పోవును. కచోరరసములోగాని మోదుగ భస్మములోగాని ఆవునేయి కలిపి కాచిత్రాగిన గ్రంథులుగల శుక్రదోషముపోవును. ఈత ద్రాక్ష

గుముడు లేక దాడిమచెక్క మొరలి ఇందుపగింజలు కరకతాడియుసిరికలు మజ్జి అత్తి రావి జువ్వి ఇప్ప అంబాళము మద్ది మామిడి నేరేడు ప్రేంకణము అతిమధురము కటు కరోహిణి అశోకము కడపరేగు నల్లతుమికి అందుగు లొద్దుగు తెల్లలొద్దుగు జీడి మోదుగు వీనిరసములో ఆవునేయినికలిపిత్రాగిన చీముచాసనగల శుక్రదోషమునివర్తించును చిత్రమూలము వట్టివేరు ఇంగువ వీనిరసములో ఆవునేయిని కలిపి కాచి పానముచేసిన మలగంధ శుక్రదోషము పోవును.

(దుష్టార్తవచికిత్స) గ్రంథిభూతే పిబేత్పాఠాం త్ర్యూషణంవృక్షకానిచ।
దుర్గంధే పూయసంకాశే మజ్జతుల్యే తథార్తవే।
పిబే ద్భద్రశ్రియః క్వాథం చందనక్వాథ మేవ చ॥ ౯

తా. గ్రంథులుగల యార్తవదోషమునందు అగరుసొంటిమూలము సొంటి పిప్పలి మిరియాలు చింతబెరడు వీనినినలియగొట్టి కషాయముకాచి త్రాగవలయు, చీమువలెను క్రొవ్వువలెను ఉండెడియార్తవదోషమునందును దుర్గంధముగల యార్తవదోషమునందును చందనము రక్తచందనము (లేక-గోరోచనము) వీని కషాయములు త్రాగవలయు

శుద్ధే శుక్రార్తవే సత్వ స్స్వకర్మక్లేశచోదితః।
గర్భ స్సంపద్యతే యుక్తివశా దగ్ని రివారణౌ॥ ౧౦

తా. వాతాదులచే దుష్టములుగాక శుద్ధములై యధిష్ఠానభూతములైన శుక్రార్తవములయందు జీవుఁడు తనపూర్వజన్మార్జిత శుభాశుభరూపకర్మములచేతను అవిద్యాస్మితా రాగద్వేషాభినివేశములచేతను ప్రేరితుండై యుక్తిసామర్థ్యమువలన అరణియందు అగ్నిప్రవేశించునట్లు గర్భరూపముగ ప్రవేశించుచున్నాఁడు.

స్త్రీయశుక్లాధికాన్నారీ పుంస శ్శుక్లాధికా త్పుమాన్।
ఉభయో శ్చ సమానే తు క్లీబ శ్శుక్రార్తవే పునః॥ ౧౧
వాయునా బహుశో భిన్నే యథాస్వం బహ్వపత్యతా।
తస్మా చ్ఛుక్లవిశుద్ధ్యర్థం వృష్యం స్నిగ్ధం చ భక్షయేత్॥ ౧౨

తా. స్త్రీయొక్క ఆర్తవాధిక్యమువలన కన్యకయు, పురుషుని శుక్రాధిక్యమువలన బురుషుఁడును, శుక్రార్తవములు సమానముగ నుండిన నపుంసకుండును బుట్టును. శుక్రార్తవములు గర్భములోపల వాయువుచే ననేకవిధములుగ భేదింపఁబడినయెడల ననేకులు గలుగుదురు. కావున శుక్లవృద్ధియగుటకు వృష్యములును స్నిగ్ధములు నగు నౌషధముల సేవింపవలయు.

(మరియొకవిధము) స్త్రీపుంసయో స్సుసంయోగేయద్యాదౌ విసృజేత్పు
శుక్రం తతః పుమాన్ వీరో జాయతే బలవాన్ దృఢః ॥ [మాన్
అథ చే ద్వనితా పూర్వం విసృజే ద్రక్తసంయుతమ్ ।
తతో రూపాన్వితా కన్యా జాయతే దృఢసంహతా ॥ ౧౪

తా. స్త్రీపురుషులు కలిసినపుడు ముందుగా పురుషుఁడు శుక్రమును విడిచిన శూరుఁడును బలవంతుఁడును ధైర్యవంతుండునగు కొమరుఁడును, ముందుగా స్త్రీ ఆర్తవముతో విడిచిన రూపవతి యగు కుమార్తెయు కలుగును; కావుననే కొన్ని పురుషగర్భములు కొంచెము తల్లిపోలిక గలవిగను, కొన్ని స్త్రీ గర్భములు కొంచెముతండ్రిపోలిక గలవిగను గానంబడుచుండును.

(పురుషుఁడుండవలసినరీతి)స్నాతస్స్రగ్గంధధృక్ప్రీతో౽నాధ్మాతఃక్షుధితో౽పివా
సకామాం సానురాగ శ్చ వ్యవాయం పురుషో వ్రజేత్ ।
ఋతుకాలాభిగమనం కుర్యా త్పర్వాణి వర్జయేత్ ॥ ౧౫

తా. పురుషుఁడు స్నానమొనర్చి చందన కుసుమాది పరిమళద్రవ్యముల ధరించి సంతోషయుక్తుఁడై ఆఁకలిచేఁ బీడింపఁబడక అధికభక్షణముచే కడుపుబ్బరములేనివాఁడై యనురాగముతో మన్మథోద్రేకముగల స్త్రీని ఋతుస్నానదినము మొదలు ౧౬ రాత్రులు చతుర్దశి అష్టమి అమావాస్య పౌర్ణమి రవిసంక్రాంతి ఏకాదశి మొదలగు వ్రతదినములు వీనినివర్జించి పొందవలయు.

పరదారా న్న గచ్ఛేత మనసాపి కదాచన ।
పరదారగతిః పుంసా ముభయత్రాపి భీతిదా ॥ ౧౬
ఇతి మత్వా స్వదారేషు ఋతుమత్సు బుధో వ్రజేత్ ।
అతృప్తస్సన్ యథా దారే పుమాన్ కామయతే పరామ్ ॥౧౭
తథా భర్తరి చాతృప్తా పర మిచ్ఛతి కామినీ ।
ఇత్యాత్మనోపమాం కృత్వా స్వదారనిరతో భవేత్ ॥ ౧౮

తా. పరదారగమనము ఇహపరముల రెండింటియందును భీతిప్రదము గావున పురుషుఁడు మనస్సుననైనఁ దలఁచఁగూడదు. ఇది తెలిసి తనభార్యలతో ఋతుకాలములందు భోగింపవలయు. తన భార్యయందు తనివినొందక యన్యభార్యల నిచ్ఛయించిన మెడల, స్త్రీయు పతియందు తృప్తిలేకుండిన అన్యపురుషుని బొందునని తనదృష్టాంతమునే తలఁచికొని యెల్లప్పుడు స్వదారపరుఁడై యుండవలయు.

అతి స్త్రీసంప్రయోగా చ్చ రక్షే దాత్మాన మాత్మవాౕ ।
శూలకాస జ్వరశ్వాస కార్శ్య పాండ్వామయక్షయాః ॥ ౧౯
అతివ్యవాయా జ్జాయంతే రోగా శ్చాక్షేపకాదయః ।
ఆయుష్మంతో మందజరా వపుర్వర్ణ బలాన్వితాః ।
స్థిరోపచితమాంసా శ్చ భవంతి స్త్రీషు సంయుతాః ॥ ౨౦

తా. మనుష్యుఁడు స్త్రీలయొక్క విశేషసంబంధమువలన తనను రక్షించుకొనవలయు. అధిక స్త్రీసేవవలన శూల దగ్గు జ్వరము ఉబ్బసము కృశింపు పాండురోగము క్షయము ఆక్షేపకాదివాతరోగములును గలుగును. నియమముగాఁ గూడువారికి దీర్ఘాయుష్యము గలిగి ముదిమివేగరాకుండును. శరీరమునకు కాంతి బలము గలుగును. దృఢమై వృద్ధిబొందింపఁబడిన మాంసముగలవారు నగుదురు.

త్రిభిస్త్రిభి రహోభి ర్హి సమీయా త్ప్రమదాం నరః ।
సర్వేష్వృతుషు ఘర్మేషు పక్షాత్పక్షా ద్వ్రజే ద్బుధః ॥ ౨౧

తా. గ్రీష్మఋతువునందుతప్ప తక్కిన ఋతువులయందుమూడేసిదినములకొక్కతూరియు, వేసంగిదినములయందు ౧౫ దినములకొక్క తూరియు స్త్రీని పొందవలయు.

రజస్వలా మకామాం చ మలినా మప్రియాం తథా ।
వర్ణవృద్ధాం వయోవృద్ధాం తథా వ్యాధిప్రపీడితామ్ ॥ ౨౨
హీనాంగీం గర్భిణీం ద్వేష్యాం యోనిదోష సమన్వితామ్ ।
సగోత్రాం గురుపత్నీం చ తథా ప్రవ్రజితామపి ॥ ౨౩
సంధ్యాపర్వ స్వగమ్యాం చ తథా మధ్యందినేషు చ ।
లజ్జాసమావహే దేశే వివృతే శుద్ధ ఏవ చ ॥ ౨౪
క్షుధితో వ్యాధిత శ్చైవ క్షుబ్ధచిత్త శ్చ మానవః ।
వాత విణ్మూత్రవేగీ చ పిపాసు రతిదుర్బలః ॥ ౨౫
తిర్యగ్యోనా వయోనౌ చ ప్రాప్తశుక్రవిధారణమ్ ।
దుష్టయోనౌ విసర్గం తు బలవా నపి వర్జయేత్ ॥ ౨౬
స్థిత ఉత్తానశయనే విశేషేణైవ గర్హితమ్ ।
క్రీడాయా మపి మేధావీ హితార్థీ పరివర్జయేత్ ॥ ౨౭

తా. రజస్వలను, కామములేనిదానిని, మలినముగనున్న దానిని, ఇష్టములేనిదానిని, ఎక్కువ వర్ణముగల దానిని, ఎక్కువ వయస్సుకలదానిని, వ్యాధిపీడితురాలిని, అవయవ

లోపము గలదానిని, గర్భిణిని, ద్వేషయుక్తురాలిని, యోనిదోషముగలదానిని, సగోత్రను, గురుభార్యను, సన్యసించిన దానిని, సంధ్యాకాలములందు పర్వదినములయందు మధ్యాహ్నకాలములందు లజ్జగలిగెడి స్థలములయందు అశుభ్రమైన స్థలములయందు, ఆఁకలి రోగము చలచిత్తమును గలవాఁడును వాతవిణ్మూత్రవేగముగలవాఁడును దప్పిగొన్నవాఁడును అతిదుర్బలుఁడునై, పశ్వాదియోనులను రజస్వలలుగాని కన్యలయోనులయందును రోగదుష్టయోనులయందును బలవంతుఁడైనను శుక్రవిసర్జనము జేయఁదగదు. రేతస్సును విశేషముగవదలుట, పతనకాలమున రేతస్సునరికట్టుట, వెల్లకిలపరుండి రేతస్సును విడుచుట వీనిని హితమునుగోరువాఁడు క్రీడలయందైనను చేయఁగూడదు.

రజస్వలాం ప్రాప్తవతో నరస్యానియతాత్మనః ।
దృష్ట్యాయుస్తేజసాం హాని రధర్మశ్చ తతో భవేత్ ॥ ౨౮
లింగినీం గురుపత్నీం చ సగోత్రా మథ పర్వసు ।
వృద్ధాం చ సంధ్యయోశ్చాపి గచ్ఛతో జీవితక్షయః ॥ ౨౯
గర్భిణ్యాం గర్భపీడా స్యా ద్వ్యాధితాయాం బలక్షయః ।
హీనాంగీం మలినాం ద్వేష్యాం కామం వంధ్యా మసంవృతే ॥ ౩౦
దేశేఽశుద్ధే చ శుక్రస్య మనసశ్చ క్షయో భవేత్ ।
క్షుధితః క్షుబ్ధచిత్తశ్చ మధ్యాహ్నే తృషితోఽబలః ॥ ౩౧
స్థితస్య హానిం శుక్రస్య వాయోః కోపం చ విందతి ।
అతిప్రసంగా ద్భవతి శోష శ్శుక్రక్షయావహః ॥ ౩౨
వ్యాధితస్య రుజా ప్లీహా మృత్యుర్మూర్ఛా చ జాయతే ॥
ప్రత్యూష స్యర్ధరాత్రే చ వాతపిత్తే ప్రకుప్యతః ॥ ౩౩
తిర్యగ్యోనా వయోనౌ చ దుష్టయోనౌ తథైవ చ ॥ ౩౪
ఉచ్చారితే మూత్రితే చ రేతసశ్చ విధారణే ।
ఉత్తానేన భవే చ్ఛీఘ్రం శుక్రాశ్మర్యాస్తు సంభవః ॥
సర్వం పరిహరే త్తస్మా దేత ల్లోకద్వయేఽహితమ్ ॥ ౩౫

తా. పురుషుఁడు నియమములేక రజస్వలా స్త్రీనిపొందినయెడల దృష్టి ఆయువు తేజస్సునశించుటయేగాక చేసిన పుణ్యంబును నశించును. వేషధారిణులగుదూతిస్త్రీలను గురుభార్యను, సగోత్రను, పర్వకాలములందును, తనకంటెనెక్కువవయస్సుకలదానిని సంధ్యాకాలములందును రతియొనర్చువానికి ఆయువుక్షీణించును. గర్భిణినిపొందుటవలన గర్భపీడ, వ్యాధిగ్రస్తురాల్రిని పొందుటవలన బలక్షయము గలుగును. అవయవలోపము

మాలిన్యము ద్వేషమునుం గలదానిని, కేవలము గొడ్డుబోతు అయినదానిని,ఆవరణములేని చోటనుఅపరిశుద్ధస్థలమునను గూడిన శుక్రము మనస్సు క్షయించును. ఆఁకలి చలచిత్తము వీనితోను మధ్యాహ్నకాలమునను రతియొనర్చినదప్పిగొన్నవాఁడై బలములేనివాఁడగును. మఱియుశుక్లమునకు హాని వాతప్రకోపమునుగలుగును. అతిమైథునముచే శుక్లమునునశింప జేయు శోషపుట్టును. వ్యాధితుఁ డొనర్చిన ప్లీహారోగము మూర్ఛ మృతియుఁ గలుగును. ప్రాతఃకాలమున నర్ధరాత్రంబున నొనర్చిన వాతపిత్తములు ప్రకోపించును. పశ్వాదియోనులను రజస్వలకాని యోనియందును రోగయుక్తయోనియందును ఒనర్చిన ఉపదంశ రోగము వాతప్రకోపము శుక్లక్షయమును అగును. మిక్కిలి శుక్రవిసర్జనముచేయుట, మాఁతించుట, రేతస్సు నడ్డగించుట, వెల్లగిలఁబరుండి శుక్రమునువిడుచుట వీనివలన శుక్రము రాళ్ళవలె నగును కావున నిహపరముల కహితములగువానిని విడువవలయు.

దుష్టా న్యాచరతే యాతు నాభినందతి తత్కథామ్ ।
ఐక్యం ద్విషద్భి ర్వ్రజతి గర్వం వహతిచోద్ధతా ॥ ౩౬
చుంబితా మార్ష్టి వదనం దత్తం న బహు మన్యతే ।
స్వపి త్యాదౌ ప్రసుప్తాపి తథా పశ్చా ద్విబుధ్యతే ॥ ౩౭
స్పృష్టా ధునోతి గాత్రాణి గాత్రం చ విరుణద్ధి యా ।
ఈష చ్ఛృణోతి వాక్యాని ప్రియాణ్యాపి పరాఙ్ముఖీ ॥ ౩౮
న పశ్య త్యగ్రదత్తం తు జఘనం చ నిగూహతి ।
దృష్టే వివర్ణవదనా మిత్రే ష్వథ పరాఙ్ముఖీ ॥ ౩౯
తత్కామితాసు చ స్త్రీషు మధ్యస్థేవ చ లక్ష్యతే ।
జ్ఞాతమండనకాలాపి న కరోతి చ మండనమ్ ।
యా సా విరక్తా తాం త్యక్త్వా సానురాగాం స్త్రియం భజేత్ ॥

తా. చెడ్డపనులుచేయుట, మంచిమాటల నంగీకరింపకుండుట, పెనిమిటి యొక్క విరోధులతోఁగలిసియుండుట, మదించి గర్వముగలిగియుండుట, పెనిమిటి ముద్దుపెట్టుకొనిన తుడిచికొనుట, పతియిచ్చినవస్తువుల లక్ష్యపెట్టకుండుట, పెనిమిటికి ముందునిద్రించుట, పెనిమిటి నిద్రలేచిన పిమ్మట తాను నిద్రలేచుట, తాకినయెడల శరీరమును విదిలించుట, శరీరమును దాచికొనుట, ప్రియవాక్యముల జెప్పినను పెడ చెవులబెట్టి కొంచెమువినుట, పతి ప్రియమైనవస్తువును ముందునిచినను చూడకుండుట, జఘన ప్రదేశమును మరుగుపరచుట, పతిచూచినప్పుడు మొగమునందు వికాసములేనిదైయుండుట, పతిస్నేహితులయందు ప్రీతిలేకుండుట, పతియొక్క ఇష్టురాండ్రయం

యందు మధ్యస్థురాలుగనుండుట, అలంకరించుకొనవలసిన సమయము తెలిసియు భూషణాదులచే నలంకరించుకొనకుండుట ఈ లక్షణములుగల ప్రీతిరహితలైన స్త్రీలను పురుషుఁడు వదలి అనురాగముగల స్త్రీలను పొందవలయు.

(పతివ్రతా స్త్రీలక్షణము) దృష్ట్వైవ హృష్టా భవతి వీక్షితే చ పరాఙ్ముఖీ।
దృశ్యమానా తథా న్యత్ర దృష్టిం క్షిపతి చంచలామ్॥ ౪౧
తథా ప్యపావర్తయితుం నైవశక్నో త్యశేషతః।
వివృణోతి తథాంగాని స్వస్యా గుహ్యాని యాని చ॥ ౪౨
గర్హితం చ తథై వాంగం ప్రయత్నేన నిగూహతి।
తద్దర్శనే చ కురుతే బాలాలింగనచుంబనమ్॥ ౪౩
ఆభాష్యమాణా భవతి సత్యవాక్యా తథైవ చ।
స్పృష్టా పులకితై రంగై స్స్వేదేనైవ చ భజ్యతే॥ ౪౪
కరోతి చ తథా దేవి! సులభద్రవ్యయాచనమ్।
తతః స్వల్పమపి ప్రాప్య కరోతి పరమాం ముదమ్॥ ౪౫
తత్ప్రేషితం చ హృదయే విన్యస త్యపి చాదరాత్।
ఆలింగనై శ్చ గాత్రాణి లింపతీవా మృతేన యా॥ ౪౬
సుప్తే స్వపి త్యథాదౌ చ తథా తస్య విబుధ్యతే।
ఊరూ స్పృశతి చాత్యర్థం సుప్తం చైనం విబుధ్యతే॥ ౪౭

తా. పతిని చూచినపుడే సంతోషించును, పతిచూచినప్పుడు తలవంచికొనును ఇవతలవతల చూచు వ్యాజంబున పతినిజూచును, రతికాలమున కుచాద్యవయవములను వెల్లడిచేయును, ప్రయత్నపూర్వకముగ మదనసదనమును సిగ్గుచే మూసికొనును. పతితో నాలింగనచుంబనాదిసౌఖ్యముల ననుభవించును. పతితో యథార్థముగ మాటలాడుచుండును. పతికి శక్యము లగుద్రవ్యములనె యడుగును. పతిస్వల్పముగనిచ్చినను మిక్కిలి సంతోషమును పొందును. పతి పంపినవస్తువుల నత్యాదరముతో గ్రహించును. పతి ఆలింగనము చేసినప్పుడు అమృతముపూసికొన్న ట్లెంచును. మగఁడు నిద్రించిన పిదప తాను నిద్రించును. మగఁడు లేవకమునుపు తానులేచును. పిదప మగనిని తొడతాఁకి నిద్రలేపును. ఇట్లు చేయునది పతివ్రతయనఁబడును. కావున స్త్రీలిట్లు పతిభక్తిగలిగి యుండవలయు.

(స్త్రీయుండవలసినక్రమము.) యువతిరపివిహాయ ప్రాతికూల్యంస్వనాథం
వచనహృదయకాయైః పూజయే దిష్టదేవమ్,

గృహావసతి మథాసౌ చింతయేద్భర్తృవాచా
ప్రతిదిన మభిమృష్టం వేశ్మ కుర్యాత్సుశోభమ్ ॥ ४८

తా. స్త్రీ ప్రతికూలురాలుగాక, త్రికరణశుద్ధిగా భర్తను దేవునిగాభావింపవలయు. మగని యనుమతిప్రకారము గృహకృత్యములఁ జేయవలయు. ప్రతిదినము ఇలును గోమయాదులచే నలికి ముగ్గులు పెట్టి శోభాయుక్తముగఁ జేయవలయు.

సకృదపి కులటాభి ర్యోగినీభిఃక్షుకీభి-
ర్నటవిటఘటితాభి స్సంస్పృజే న్నైవ సాధ్వీ,
రుచిర మిద మముష్మై పథ్యమేవం నవేతి
ప్రతిదిన మపి భర్తు ర్భోజనేచ్ఛాం విదధ్యాత్ ॥ ४९

తా. వ్యభిచార స్త్రీలతోడను, మంత్రవాదినులతోడను, బిచ్చపువాండ్రతోడను, నటవిటులతోఁజేరియుండు స్త్రీలతోడను సహవాస సంభాషణాదులఁజేయఁదగదు ప్రతిదినమును తనభర్తయొక్క అభిప్రాయమెఱింగి రుచికరపదార్థముల వండవలయు.

క్వచిదపి నిభృతే వా ద్వారి వా నైవతిష్ఠే-
చ్చిర మథ గిర మస్మై విప్రియాం న ప్రయచ్ఛేత్,
న విరలజనదేశే మంత్రయే న్నిష్కుటే వా
పురుషమపి న పశ్యే న్మంత్రహేతుం వినా చ ॥ ౫౦

తా స్త్రీ, నిర్జన ప్రదేశమందుఁగాని తలవాకిటఁగాని యొకప్పుడును నిలువఁగూడదు. భర్తకిష్టముగాని మాటలనెప్పుడును బలుకఁగూడదు. జనములేనిచోటఁగాని ఇంటిపెరఁటి తోఁటలయందుఁగాని అన్యపురుషులతో సంభాషింపఁగూడదు. ఒక ఆలోచనలేనిది స్వపురుషునితోఁగూడ పలుమాఱు మాటలాడుట పలుమాఱు చూచుటయుఁ గూడదు.

అనుమతి ముపలభ్యా ధిష్ఠితా న్యత్ర యాయా-
చ్ఛయన మనువిదధ్యా ద్భర్తు రుత్థాన మగ్రే,
గతవతి దయితే తు క్వాపి మాంగల్యమాత్రా
ణ్యుపచితగురువిప్రా ధారయే న్మండనాని ॥ ౫౧

తా. పతివ్రతయైన స్త్రీ వివాహ గోష్ఠీ దైవోత్సవాదుల కెచ్చటికైనపోవలసినప్పుడు మగని యాజ్ఞను పొంది వదినెలు మొదలగు పతిబాంధవులతోఁగూడినదై పోవలయు. మగఁడుశయనించినపిదప తానుశయనించి మగనికంటెముందుగ తానులేవవలయును. భర్తదేశాంతరమునకుఁ బోయియున్నపుడు మాంగల్యముతప్ప తక్కినయాభరణముల ధరింపక గురువులయందు బ్రాహ్మణులయందును భక్తిగలిగియుండవలయు.

(రజస్వలాలక్షణము.) క్షామప్రసన్నవదనాంస్ఫురచ్ఛ్రోణిపయోధరాం ।
ప్రస్తాక్షికుక్షిం పుంస్కామాం విద్యా దృతుమతీం స్త్రియమ్ ॥

తా. మిగుల వాడని నిర్మలమైన ముఖము, అదురుచున్న కటిప్రదేశము స్తనములును, జారిన నేత్రములు కడుపునుగలిగి, పురుషేచ్ఛగల స్త్రీని ఋతుమతిగా నెఱుంగవలయు. ఇది స్త్రీకి గర్భగ్రహణకాలమని చెప్పుదురు.

పద్మం సంకోచ మాయాతి దినేఽతీతే యథాతథా ।
ఋతౌ వతీతే యోని స్సా శుక్రం నాతః ప్రతీచ్ఛతి ॥ ౫౩
మాసేనోపచితం కాలే ధమనీభ్యాం తదార్తవమ్ ।
ఈషత్కృష్ణం విగంధం చ వాయు ర్యోనిముఖా న్నుదేత్ ॥ ౫౪
మాసిమాసి రజ స్త్రీణాం రసజం స్రవతి త్ర్యహమ్ ।
వత్సరా ద్ద్వాదశా దూర్ధ్వం యాతి పంచాశతః క్షయమ్ ॥ ౫౫

తా. కమలములు సాయంకాలము కాఁగానే ముకుళించునట్లు ఋతుకాలము కడచిన వెనుక యోని ముకుళించును గావున అప్పుడు శుక్రమును గ్రహింపదు. మాసమువఱకు వృద్ధిఁబొందిన యార్తవము కొంచెము నలుపువన్నె గలిగి గంధరహితమై వాయుప్రేరణమువలన రెండునాడులమూలముగా యోనిద్వారమును పొందును. స్త్రీలకు ౧౨ వ వత్సరము మొదలుకొని ప్రతిమాసమునందును మూడుదినములు స్రవించు రక్తము ఏబది వత్సరములకుఁ బిమ్మట క్షయమునొందును.

(ఋతుమతీధర్మములు) తతఃపుష్పేక్షణా దేవకల్యాణధ్యాయినీ త్ర్యహం ।
మృజాలంకారరహితా దర్భసంస్తరశాయినీ ॥ ౫౬
క్షైరేయం యావకం స్తోకం కోష్ఠశోధనకర్షణమ్ ।
పర్ణే శరావే హస్తే వా భుంజీత బ్రహ్మచారిణీ ॥ ౫౭

తా. స్త్రీ ఋతువైనది మొదలు మూఁడుదినములు శుభమునుధ్యానించుచు స్నానము అలంకారమునులేనిదై దర్భలపైఁ బవ్వళింపవలయు. (భర్తను చూడకుండవలయు) పాలతోమిశ్రమైన శాల్యన్నమును కొంచెముగ ఆకు మూకుడు హస్తము వీనిలో దేనియందైన భుజింపవలయు. కోష్ఠశోధనము కర్షణము మైథునము వీనిని చేయఁగూడదు.

దివాస్వాపా త్స్వాపశీలో హ్యంజనా దంధకో భవేత్ ।
రోదనా ద్వై వికృతదృక్ స్నానా ద్దుఃఖ్యనులేపనాత్ ॥ ౫౮

తైలాభ్యంగా త్కుష్ఠరోగీ కునఖీ నఖకర్తనాత్ ।
ప్రధావనా చ్చంచల స్స్యా ద్ధసనా చ్ఛ్యావవర్ణతా ॥ ౫౯
దంతోష్ఠతాలుజిహ్వాషు ప్రలాపీ బహుభాషణాత్ ।
శ్రవణా దతిశబ్దస్య బధిరో హ్యావలేఖనాత్ ॥ ౬౦
ఖలతి ర్మారుతాయాససేవనా దున్మదీ భవేత్ ।
తస్మా ద్రజస్వలై తాని త్రిదినేషు వివర్జయేత్ ॥ ౬౧

తా. రజస్వలయయిన స్త్రీ పగలునిద్రించిన నిద్రాస్వభావము గలవాఁడును, కాటుక పెట్టుకొనుటవలన గ్రుడ్డివాఁడును, ఏడ్చుటవలన వికారపుఁ జూపుగలవాఁడును, స్నానముచేయుటవలనను, చందనాదులగు మైపూఁతలవలనను ఎల్లప్పుడు దుఃఖించు స్వభావముగలవాఁడును, తలయంటికొనుటవలన కుష్ఠురోగముగలవాఁడును, గోళ్లు తీయుటవలన పుప్పిగోళ్ళు కలవాఁడును, పరుగెత్తుటవలన చంచలచిత్తుఁడును, నవ్విన యెడల నల్లనిదంతములు పెదవులు దౌడలు నాలుకయుఁ గలవాఁడును, అధికముగ మాటలాడుటవలన ప్రేలెడువాఁడును, గొప్పధ్వనినివినిన చెవిటివాఁడును, వ్రాయుట వలన దుశ్చర్మము గలవాఁడును, గాలిలో తిరుగుట శ్రమకరకార్యములొనర్చుట వీని వలన పిచ్చివాఁడు నగుపుత్రుఁడు కలుగును గనుక పైజెప్పిన కృత్యములను రజస్వలా స్త్రీ మూఁడుదినములును వర్జింపవలయు.

చతుర్థేఽహ్ని తత స్స్నాత్వా శుక్లమాల్యాంబరా శుచిః ।
ఇచ్ఛంతీ భర్తృసదృశం పుత్త్రం పశ్యే త్పురః పతిమ్ ॥ ౬౨
పూర్వం పశ్యే దృతుస్నాతా యాదృశం నర మంగనా ।
తాదృశం జనయే త్పుత్త్రం భర్తారం దర్శయే దతః ॥ ౬౩

తా. పిమ్మట నాలుగవదినమున స్నానముచేసి తెల్లని వస్త్రములను పుష్పమును ధరించి శుచిర్భూతురాలయి పతిసమానుఁడగు పుత్రునిఁగోరుచున్నదై ముందుగ భర్తను చూడవలయు, ఏలయనఁగా - స్నానముచేసినతోడనే ముందుగనెట్టిపురుషునిఁ జూచునో వానివంటి పుత్రునికనును కాఁబట్టి ముందుగా పతినే చూచునది.

ఋతు స్తు ద్వాదశనిశాః పూర్వా స్తిస్ర శ్చ నిందితాః ।
ఏకాదశీ చ యుగ్మాసు స్యా త్పుత్త్రోఽన్యాసు కన్యకా ॥ ౬౪

తా. స్త్రీలకు ఋతువయినది మొదలు ౧౨ దినముల పఱకు ఆర్తవము కనుపడుచుండుటవలన నది ఋతుకాలమనఁబడును, వానిలో మొదటి మూఁడుదినములు ఏకాదశి ఇవి నిందితములు. సరిదినములయందుఁ గూడిన పుత్రుఁడును బేసిదినములయందుఁ గూడిన కన్యకయు జనించును.

ఉపాధ్యాయోఽథ పుత్త్రీయం కుర్వీత విధివ ద్విభమ్ !
నమస్కారపరాయా స్తు శూద్రాయా మంత్రవర్జితమ్ ॥ ౬౫

తా. పిదప ఉపాధ్యాయుఁడు యథాశాస్త్రముగ పుత్రజననసూచకమైన కర్మము జేయించవలయు. శూద్రులకు మంత్రవర్జితముగఁ జేయించవలయు.

ఊనద్వాదశవర్షాయా మప్రాప్తః పంచవింశతిమ్ ।
యద్యాధత్తే పుమాన్ గర్భం కుక్షిస్థ స్స విపద్యతే॥ ౬౬
జాతో వా న చిరం జీవే జ్జీవే ద్వా దుర్బలేంద్రియః ।
తస్మా దత్యంతబాలాయాం గర్భాధానం న కారయేత్ ॥ ౬౭

తా. ౧౨ ఏండ్లకులోఁబడిన స్త్రీయందు ౨౫ వత్సరంబులకులోఁబడిన పురుషుఁడు గర్భాధానముచేసిన యాగర్భము కుక్షియందే ఆపదనొంది స్రవించును. ఒకవేళ గర్భమునిలిచి శిశువు జనించినను బహుకాలము జీవింపదు. జీవించినను ఇంద్రియపటుత్వములేకుండును కావున మిక్కిలి బాల్యముగల స్త్రీయందు గర్భాధానము చేయఁగూడదు.

(మతాంతరమునందు) పూర్ణషోడశవర్షా స్త్రీ పూర్ణవింశేన సంగతా ।
శుద్ధే గర్భాశయే మార్గే రక్తే శుక్రేఽనిలే హృది ॥ ౬౮
వీర్యవంతం సుతం సూతే తతో న్యూనాబ్దయోః పునః ।
రోగ్యల్పాయు రధన్యో వా గర్భో భవతి నైవవా ॥ ౬౯

తా. ౧౬ సంవత్సరములునిండిన స్త్రీ ౨౦ సంవత్సరములునిండిన పురుషునితోఁ గలిసినయెడల గర్భాశయము మార్గము రక్తము శుక్రము వాయువు ఇవిశుద్ధంబై మంచి బలముగల కొమరుఁడు గలుగును. పైజెప్పినట్లుగాక తక్కువ వయస్సు కలవారయినయెడల రోగము అల్పాయువునుగల శిశువుగాని, పాపియయిన శిశువుగాని పుట్టును. గర్భము కలుగకనయిన పోవును.

సంతోఽప్యాహు రపత్యార్థం దంపత్యో స్సంగతిం రహః ।
ఇచ్ఛేతాం యాదృశం పుత్త్రం తద్రూపచరితాం శ్చ తౌ ।
చింతయేతాం జనపదాన్ తదాచారపరిచ్ఛదౌ ॥ ౭౦

తా. స్త్రీపురుషులకు ఏకాంతమునందు సంగమము సంతానార్థమని సత్పురుషులు చెప్పెదరు. స్త్రీపురుషులు ఎటువంటి పుత్రునిఁ గోరెదరో వానివంటి రూపచారిత్రములను దేశములను వాని యాచారవేషములను ధ్యానింపవలయు.

నరం విశేషా త్క్షీరాజ్యై ర్మధురౌషధసంస్కృతైః।
నారీం తైలేన మాషైశ్చ పిత్తలై స్సముపాచరేత్॥ ౭౧

తా. పురుషులు విశేషముగ మధురౌషధములచే సిద్ధము చేయఁబడిన పాలు నేతు స్త్రీలు రక్తవృద్ధికరము లగు నూనె మినుములను ఆహారమునందుఁజేర్చికొనవలయు.

కర్మాంతే చ పుమా౯ సర్పిః క్షీరశాల్యోదనాశితః।
ప్రాగ్దక్షిణేన పాదేన శయ్యాం మారుహ్య ఋత్వికాజ్ఞయా॥ ౭౨
ఆరోహేత్ స్త్రీ తు వామేన తస్య దక్షిణపార్శ్వతః।
తైలమాషోత్తరాహారా సానురాగా శుభాన్వితా॥ ౭౩

తా. పుత్రీయ కర్మాంతమున పురుషుఁడు నేయి పాలు కలసిన శాల్యన్నమును భక్షించి పురోహితుని యాజ్ఞా ప్రకారము ముందు కుడికాలుచేతి పాన్పు నెక్కవలయు. స్త్రీ-నూనె మినుములు వీనిని భోజనమునందుఁజేర్చికొని భుజించి భర్తకు కుడి పార్శ్వమున నెడమపాదముచే నెక్కవలయు.

సాంత్వయిత్వా తతోఽన్యోన్యం సంవిశేతాం ముదాన్వితౌ।
ఉత్తానా తన్మనా యోషి. త్తిష్ఠే దంగై స్సుసంస్థితైః।
తథాహి బీజం గృహ్ణాతి దోషై స్స్వస్థానసంస్థితైః॥ ౭౪

తా. పిమ్మట స్త్రీపురుషు లొకరినొకరు ప్రియవాక్యములచే నూరడించికొని సంతోషయుక్తులై పరుండవలయు. స్త్రీ-భర్తయందే మనస్సుగలదై బాగుగ నుంపఁబడిన యవయవములుగలదై వెల్లకిలఁబరుండవలయు. అట్లగుటచే స్వస్థాన స్థిత వాతాదిదోషములచే బీజమునుగ్రహించును కావున స్త్రీ రతికాలమున కామాతిరేకముచే క్రీడా భేదములతోను పురుషాయితబంధములతోను రమించుట సత్సంతానముగోరు వారికిఁ దగదనుట.

యో భార్యాయా మృతౌ మోహా దంగనేవ ప్రవర్తతే।
తతః స్త్రీచేష్టితాకారో జాయతే షండసంజ్ఞితః॥ ౭౫
ఋతౌ పురుషవద్వాపి ప్రవర్తేతాంగనా యది।
తత్ర కన్యా యది భవేత్ సా భవే న్నరచేష్టితా॥ ౭౬

తా. పురుషుఁడు తనభార్యయందు ఋతుకాలమున మోహావిష్టుఁడై యుపరతి యొనర్చిన స్త్రీయొక్క చేష్టలు ఆకారమునుగల వీర్యరహితుఁ డగు పుత్రుఁడుగలుగును వీఁడు షండుఁడనఁబడును. స్త్రీ తనపురుషునితో ఋతుకాలమున నుపరతిసల్పుటచే కన్యకజనించిన పురుష చేష్టలు గలిగియుండును. అనఁగా పురుషునివలె స్వతంత్రముగ వ్యవహరించునదియు, కామశాంతినొందక చర్మమయలింగ ధారిణు లగు స్త్రీలతో

సంభోగము చేయునదియు నగుననుట. ఇందుకు జ్యోతిశ్శాస్త్రమున నిట్లు చెప్పఁబడినది. "శ్లో॥ శుక్రాసితౌ యది పరస్పరభాగసంస్థౌ శౌక్రే చ దృష్టిపథగా వుదయేఘటాంశాః । స్త్రీణా మతీవ మదనాగ్నిమదప్రవృద్ధిః స్త్రీభి స్సమం చ పురుషాకృతిభీ రమే చ్చ" అని.

(గర్భిణీలక్షణము) స్తనయోః కృష్ణముఖతా రోమరాజ్యుద్గమ స్తథా ।
అక్షిపక్ష్మాణి చాప్యస్యా స్సమ్మీల్యంతే విశేషతః ॥ ౭౭
అకామత శ్ఛర్దయతి గంధా దుద్విజతే శుభాత్ ।
ప్రసేక స్సదనం చాపి గర్భిణ్యా లింగ ముచ్యతే ॥ ౭౮

తా. చనుమొనలయందునలుపు, నూగారు స్పష్టమగుట, కనుఱెప్పలు పలుమాఱు మూతలుపడుట, వేవిళ్ళుగలుగుట, నోటియందు నీళ్ళూరుట, ఒడలు చిక్కుట ఇవి గర్భిణిలక్షణములని యెఱుంగవలయు.

(గర్భిణీ స్త్రీ చేయరాని పనులు) అతివ్యవాయ మాయాసం భారంప్రావరణం గురు ।
అకాలజాగర స్వప్న కఠినోత్కటకాసనమ్ ॥
శోకక్రోధ భయోద్వేగ వేగశ్రద్ధావిధారణమ్ ।
ఉపవాసాధ్వతీక్ష్ణోష్ణ గురువిష్టంభిభోజనమ్ ॥ ౮౦
రక్తం నివసనం శ్వభ్రకూపేక్షాం మద్య మామిషమ్ ।
ఉత్తానశయనం యచ్చ స్త్రియో నేచ్ఛంతి త త్త్యజేత్ ॥ ౮౧
తథా రక్తస్రుతిం శుద్ధిం వస్తి మామాసతోఽష్టమాత్ ।
ఏభి ర్గర్భ స్స్రవే దామః కుక్షౌ శుష్యే న్మ్రియేత వా ॥ ౮౨

తా. గర్భముధరించినది మొగలు మైథునము, ఆయాసకరములగుపనులు, బరువుమోయుట, మైశాల్యము బరువునుగల వస్తువులనెత్తుట, రాత్రిమేలుకొనుట, పగలు నిద్రించుట, కఠినములుగ మిట్టపల్లములుగనుండు ఆసనములపైఁ గూర్చుండుట, వ్యసనము క్రోధము భయము దిగులుజెందుట, మలమూత్రముల నడ్డగించుట, ఉపవాసముండుట, మార్గసంచారము, తీక్ష్ణములును ఉష్ణములును గురుత్వము కలవియు, మలబద్ధకరములు నగువస్తువుల భుజించుట, వస్త్రములేకుండుట, లోఁతుగలపల్లములనుబావులను చూచుట, మద్యమాంసములను సేవించుట, వెల్లకిలఁబరుండుట, మఱియు అనుభవముగల స్త్రీ నిషేధించినకార్యములను చేయుట, రక్తమునుతీయుట, కాయశుద్ధి, ఎనిమిదవమాసమునందు తప్ప తక్కినమాసములయందు వస్తికర్మను చేయించుకొనుట, ఈ కార్యములవలన గర్భము అసంపూర్ణమై స్రవించును, లేక కుక్షియందే శుష్కించును లేక చచ్చినను జచ్చును కావున పైఁజెప్పినకార్యములను గర్భిణీ స్త్రీ వర్జింపవలెను.

ఇంద్రియార్థాం స్తు యాన్ యాన్ సా భోక్తు మిచ్ఛతి గర్భిణీ ।
గర్భబాధాభయా త్తాం స్తాన్ భిష గాహృత్య దాపయేత్ ॥
సా ప్రాప్తదౌహృదా పుత్త్రిం జనయేత గుణాన్వితమ్ ।
అలబ్ధదౌహృదా గర్భే లభేతాత్మని వా భయమ్ ॥ ౮౪
యేషుయేష్వింద్రియార్థేషు దౌహృదే వై విమానానా ।
ప్రజాయేత సుతస్యార్తి స్తస్మిం స్తస్మిం స్తథేంద్రియే ॥ ౮౫

తా. వైద్యుఁడగువాఁడు గర్భిణీ స్త్రీకోరిన త్వ క్చక్షు ర్జిహ్వా శ్రోత్రఘ్రాణేంద్రియములకు ప్రీతికరములయిన యుపచారములఁజేయవలయు. అందువలన సుగుణాన్వితుఁడగుపుత్రుఁడు గలుగును. అట్లుచేయకుండిన గర్భిణీ స్త్రీకిగాని గర్భస్థశిశువునకుఁగాని బాధ కలుగును. గర్భిణికి ఏయే ఇంద్రియముల భోగములయందుఁ గలిగినయిచ్ఛ నెరవేరకుండునో గర్భస్థ శిశువునకును ఆయా యింద్రియమునందు బాధ గలుగును. (త్వగింద్రియమునకు భోగములు వస్త్రాలంకారాదులు, చక్షురింద్రియమునకు దేవోత్సవ రాజదర్శనాదులు, శ్రోత్రమునకు గాన కథాదులు, జిహ్వకు రుచికరపదార్థములు, ఘ్రాణమునకు పరిమళవస్త్వామోదము అని తెలియవలయును )

రాజసందర్శనే యస్యా దౌహృదం జాయతే స్త్రియాః ।
అర్థవంతం మహాభాగం కుమారం సా ప్రసూయతే ॥ ౮౬
దుకూలపట్టకౌశేయభూషణాదిషు దౌహృదాత్ ।
అలంకారైషిణం పుత్త్రిం లలితం సా ప్రసూయతేః ౮౭
ఆశ్రమే సంయతాత్మానం ధర్మశీలం ప్రసూయతే ।
దేవతాప్రతిమాయాం తు ప్రసూతే పార్షదోపమమ్ ॥ ౮౮
దర్శనే వ్యాళజాతీనాం హింసాశీలం ప్రసూయతే ।
గోధామాంసాశనే పుత్త్రిం సుషుప్సుం ధారణాత్మకమ్ ॥ ౮౯
గవాం మాంసే చ మలినం సర్వక్లేశసహం తథా ।
మాహిషే దౌహృదా చ్ఛూరం రక్తాక్షం లోమసంయుతమ్ ॥
వరాహమాంసా త్స్వప్నాళుం శూరం సంజనయే త్సుతమ్ ।
మార్గా ద్విక్రాంతజంఘాలం సదా వనచరం సుతమ్ ॥ ౯౧
సృమరా ద్విగ్నమనసం నిత్యభీతం చ తైత్తిరాత్ ।
అతోఽనుక్తేషు యా నారీ సమభిధ్యాతి దౌహృదమ్ ।
శరీరాచారశీలైస్సా సమానం జనయిష్యతి ॥ ౯౨

తా. గర్భిణీస్త్రీకి రాజునుజూడ వేడ్కగలిగెనేని ద్రవ్యవంతుఁడును పుణ్యచరిత్రుఁడు నగుకొమరుఁడు గలుగును. సన్ననిచీరెలు పట్టుచీరెలు అలంకారములు వీనియందిచ్ఛగలిగినయెడల అలంకారాదులయందు కోరికగలవాఁడును సుందరుఁడు నగుపుత్త్రుఁడు గలుగును. మునులయాశ్రమంబులఁ జూచుటకుఁగాని యందువసించుటకుఁగాని కోరికవొడమిన ఇంద్రియనిగ్రహము ధర్మస్వభావమునుగలవాఁడును, దేవతాప్రతిమాదులయం దిచ్ఛకలిగిన సభానాయకుఁడగు పుత్త్రుఁడును, సర్పాది క్రూరజంతువులఁ జూడఁగోరిన హింసాస్వభావము గలవాఁడును, ఉడుము మాంసమునందు కోరిక గలిగిన నిద్రించుస్వభావము చెడ్డకోపమును గలవాఁడును, ఆవుమాంసమునం దాశగలిగిన సకలబాధల ననుభవించువాఁడును అపరిశుద్ధుఁడు నగుపుత్త్రుఁడును, దున్నపోఁతు మాంసమునందుఁ గోరికగలిగిన శూరుండును ఎఱ్ఱని కన్నులు వెంట్రుకలును గలవాఁడును, పందిమాంసమునందు కోరికగలిగిన విశేషనిద్ర శౌర్యమును గలవాఁడును, జింకమాంసమునందు కోరికగలిగిన కడువడిగ నడుచువాఁడును అరణ్యసంచారము చేయువాఁడును, దుప్పిమాంసమునందిచ్ఛగలిగిన దుఃఖించుస్వభావము గలవాఁడును, తిత్తిరిపిట్ట మాంసమునం దిచ్ఛగలిగిన సదా భయపడువాఁడు నగుపుత్త్రుఁడు గలుగును. కావున నీచెప్పిన వానికంటె నితరములైన కోర్కెలు గలిగిన వానికనుగుణమైన శరీరాచార స్వభావములుగల పుత్త్రుఁడు గలుగును.

(స్త్రీ పుం నపుంసక యమళగర్భ లక్షణము.)

ఉన్నతే దక్షిణే కుక్షౌ గర్భేచ పరిమండలే ।
స్తనే చ దక్షిణే చైవ ప్రాక్పయోదర్శనం భవేత్ ॥ ౯౩
దక్షిణాక్షిమహత్త్వం చ పున్నామద్రవ్యకాంక్షిణీ ।
తథా స్వప్నోపలబ్ధిశ్చ సుప్రసన్నముఖీ సదా ॥ ౯౪
పుత్త్రం సూతేఽన్యథా కన్యాం యాచేచ్ఛతి నృసంగతిమ్ ।
నృత్తనాదిత్రగాంధర్వ గంధమాల్యప్రియా చ యా ॥ ౯౫
క్లీబం తత్సంకరే తత్ర మధ్యం కుక్షే సమున్నతమ్ ।
యమళా పార్శ్వద్వయోశ్చైవ కుక్షౌ ద్రోణ్యామివ స్థితే ॥ ౯౬

తా. గర్భిణీస్త్రీయొక్క గర్భము గుండ్రముగనుండి కుడిపార్శ్వమున ఉన్నతమైయుండుట, ముందుగ కుడిచన్నున పాలు గనుపడుట, కుడికన్ను పెద్దదగుట, ఏనుఁగు గుఱ్ఱము మామిడి మొదలగు పురుషజాతి ద్రవ్యములయందిచ్ఛగలుగుట, అట్లే స్వప్నమున పుంద్రవ్యములఁ గాంచుట, ఎల్లప్పుడు ప్రసన్నముఖురాలుగనుండుట, ఈ లక్షణములు గలిగియుండిన పుత్త్రునిగనును. వీనికి విపరీతలక్షణములుగలిగి పురుషసంగమమునందును, నాట్యవాద్యగానములయందును, చందన పుష్పమాలికలయందును ఇచ్ఛ

గలిగనేని స్త్రీనికనును. పైఁ జెప్పిన లక్షణములన్నిసంకరమైయుండిన నపుంసకుఁడు గలుగును. రెండుపార్శ్వములున్నతమై నడుముతూముపలెనుండిన కవలురు జనింతురు.

(గర్భిణీస్త్రీ యుండవలసిన క్రమము.)

శుద్ధా శుద్ధాంబరా నిత్యతుష్టా లంకారసంయుతా ।
శుభకృత్యేషు సక్తా చ గురురక్తా పరాఙ్ముఖీ ॥ ౯౭

భయకృద్దర్శనేచైవ దుర్గంధాఘ్రాణనే తధా ।
శృణ్వతీ పుణ్యచరితం భోజ్యోష్ణం భుంజతీ లఘు ॥ ౯౮

అక్లిన్న మన్నం చాశుష్క మపర్యుషిత మేవ చ ।
పుణ్యస్థలేషు చరతీ బహిర్గమనవర్జితా ॥ ౯౯

అకుర్వ త్యసకృ త్తైలాభ్యంగాదీని నిషేవతీ ।
ద్రవం చ మధురం స్నిగ్ధం సత్కృతం దీపనే హితమ్ ॥ ౧౦౦

మృద్వాస్తరణపర్యంకా ధిష్ఠితా గర్భిణీ సదా ।
భవే దాప్రసవా దేవ మన్యథా గర్భపీడనమ్ ॥ ౧౦౧

తా. గర్భిణీస్త్రీ నిత్యము స్నానాదులచేఁ బరిశుద్ధురాలై తెల్లనివస్త్రమును ఆభరణములను ధరించి యెల్లప్పుడు సంతోషయుక్తురాలై శుభకార్యములయం దాసక్తి గురుభక్తియుఁ గలిగియుండవలయు. భయమును బుట్టించు పదార్థములఁజూచుట, దుర్గంధము నాఘ్రాణించుటయు కూడదు. భయాపహములుగాని పుణ్యకథల వినుచుండవలయు. నీళ్ళలోవేసినది ఎండినది చద్దియగు అన్నమును వదలి కొంచెముష్ణముగనుండెడియన్నమును, ద్రవములును స్నిగ్ధములును జాఠరాగ్నిదీపనములు నగునన్నపానములతోభుజించవలయు. అపరిశుద్ధములును భయోత్పాదకంబులు నగు స్థలములవదలి పుణ్యస్థలములయందు సంచరించవలయు. బైటతిరుగుటకూడదు. పలుమారు అభ్యంగము నలుఁగుపెట్టుకొనుట మొదలగు శ్రమకరకార్యములఁ జేయఁగూడదు. మెత్తని పరుపులు దిండ్లు మొదలగునవి గలిగి కించి దున్నతమైన మంచముమనందు పరుండవలయు. ఇట్లు చేయనియెడల గర్భమునకు పీడగలుగును.

ఆహారం గర్భిణీనాం చ ప్రథమే మధురం తథా ।
ద్వితీయే శీతలం చైవ తృతీయే ద్రవసంయుతమ్ ॥ ౧౦౨

క్షీరేణ షష్టికాన్నం చ చతుర్థే దధిసంయుతమ్ ।
పంచమే క్షీరయుక్తం చ షష్ఠే సర్పిషాయుతమ్ ॥ ౧౦౩

పృథక్పర్ణ్యాది సంసిద్ధం సప్తమే తు పిబేద్ఘృతమ్ ।
ప్రశస్తశ్చాష్టమే కోలకషాయే తు బలాద్వయమ్ ॥ ౧౦౪
శతపుష్పీ పయో మాంసం దధి తైలం ఘృతం తథా ।
లవణం మదనం చైవ మధుమిశ్రం నిరూహయేత్ ॥ ౧౦౫
శస్తశ్చ నవమే మాసే స్నిగ్ధమాంసరసోదనమ్ ।
బహుస్నిగ్ధయవాగుం వా పూర్వోక్తం చానువాసనమ్ ॥ ౧౦౬
తత ఏవ పిచుం చాస్యా యోనౌ నిత్యం నివాసయేత్ ।
గర్భిణీం నవమే మాసే సూతికాగార మావిశేత్ ॥ ౧౦౭

తా. గర్భిణీస్త్రీలకు మొదటినెలలో మధురపదార్థయుక్తాహారమును, రెండవ నెలలో శీతలాహారమును, మూడవనెలలో ద్రవముగనుండు ఆహారమును, అరువదిదినములలో ఫలించిన వరియన్నమునుపాలతోడను, నాలుగవనెలలో పెరుగన్నమును, ఐదవనెలలో పాలుఅన్నమును, ఆఱవనెలలో నేయికలిపిన యాహారమునుఇప్పించవలయు ఏడవనెలలో, కోలపొన్న-మయ్యాకుపొన్న - చిన్నములక-పెద్దములక - కలిగొట్టు-దుందిలము-తక్కాలి-నేలగుమ్ముడు-పల్లేరు-మారేడు ఈమూలికల కషాయముతోఁ గాచిన నేతినిప్పించవలయు. ఎనిమిదవనెలలో రేఁగుపండ్లకషాయములో, చిన్నముత్తవపులగము పెద్దముత్తవపులగము పెద్దసదాప పాలు మాంసము పెరుగు నూనె నేయి ఉప్పు మ్రంగకాయ తేనె ఈవస్తువుల రసమును కలిపి నిరూహవస్తికర్మను చేయించవలయు, మఱియు, పాలు మధుర కషాయద్రవ్యములు వీనిచేఁగాఁచఁబడిన తైలముచే అనువాసనవస్తికర్మను చేయించవలయు. తొమ్మిదవనెలయందు అన్నమును స్నిగ్ధమగు మాంసముతోడ భుజింపఁజేయవలయు. లేక మిక్కిలి స్నిగ్ధమైన గంజినిగాని త్రాగించవలయు. అనువాసనవస్తికర్మగూడ చేయించవలయు. చమురులో తడిపినప్రత్తిని యోనియందు ధరింపఁజేయుచుండవలయు. ఈమాసముననే గర్భిణినిసూతికాగృహమునందుఁ బ్రవేశింపఁజేయవలయు.

(గర్భస్రావమునకుచికిత్స) మధుకం శాకబీజం చ పయస్యా సురదారు చ ।
అశ్మంతకః కృష్ణతిలా స్తామ్రవల్లీ శతావరీ ॥ ౧౦౮
వృక్షాదనీ పయస్యా చ లతాచోత్పలశారిబా ।
అనంతా శారిబా రాస్నా పద్మా మధుక మేవ చ ॥ ౧౦౯
బృహతీద్వయ కాశ్మర్య క్షీరిశుంగా స్త్వచో ఘృతం ।
పృశ్నిపర్ణీ బలా శిగ్రు శ్వదంష్ట్రా మధుపర్ణికా ।
శృంగాటకం బిసం ద్రాక్షా కశేరు మధుకం సితా ॥ ౧౧౧

సప్తైతా న్స్వయసాయోగా నర్థశ్లోకసమాపనాః ।
క్రమా త్సప్తసు మాసేషు గర్భే స్రవతి యోజయేత్ ॥ ౧౧౧

తా. ప్రథమాది సప్తమమాసపర్యంతము గర్భస్రావము కలిగినయెడల, ప్రథమ మాసమునందు అతిమధురము- టేకువిత్తులు- క్షీరకాకోళి-దేవదారు ఈదినుసుల చూర్ణమును పాలతోడ త్రాగించవలయు. రెండవ మాసమున గలిగిన, అశ్మంతకము-నల్లనువ్వులు-మంజిష్టితీఁగె- చల్లపిల్లిగడ్డలు వీనిచూర్ణమును, మూడవ మాసమున ముయ్యాకుపొన్న-క్షీరకాకోళి- నల్లకలువ-సుగంధిపాల వీనిచూర్ణమును, నాలుగవమాసమున తిప్పతీఁగె-సగంధిపాల-సన్నరాస్నము- తామర-అతిమధురము వీనిచూర్ణమును, ఐదవనెలయందు చిన్నవాకుడు-పెద్దవాకుడు-గుమ్ముడు-మఱ్ఱిమొదలగు పాలుగల వృక్షములయొక్క ఈనెలు పట్టలు వీనిచూర్ణమును నెయ్యిని, ఆఱవనెలయందు-కోలపొన్న-చిట్టాముట్టి-మునగపట్ట- పల్లేరు-గుమ్ముడు వీనిచూర్ణమును, ఏడవనెలయందు-పరికెగడ్డ-తామరతూండ్లు- ద్రాక్షపండు-తుంగముస్తెలు- అతిమధురము-చక్కెర వీనిచూర్ణమును కర్షమెత్తుచొప్పున పాలలోఁగలిపి త్రాగించిన గర్భస్రావాదులు నివర్తించును.

కపిత్థబృహతీబిల్వ పటోలేక్షునిదిగ్ధజైః ।
మూలై శ్శృతం ప్రయుంజీత క్షీరం మాసే తథాష్టమే ॥ ౧౧౨
నవమే శారిబా నంతా పయస్యా మధుయష్టిభిః ।
యోజయే ద్దశమే మాసే సిద్ధం క్షీరం పయస్వినా ।
అథవా యష్టిమధుకం నాగరామరదారుభిః ॥ ౧౧౩

తా, ఎనిమిదవ నెలయందు, వెలగ-పెద్దములక- మారేడు-చేదుపొట్ల- చెఱకు-వాకుడు ఈదినుసుల వేళ్ళను నలియఁగొట్టి పాలలో వేసి యుడకబెట్టి యాపాలను త్రాగించవలయు. తొమ్మిదవనెలయందు సుగంధిపాల-తిప్పతీఁగె- క్షీరకాకోళి-అతిమధురము వీనితోఁగాఁచఁబడిన పాలను త్రాగించవలయు. ౧౦ వ నెలయందు క్షీరకాకోళితోఁగాని, లేక, అతిమధురము సొంటి దేవదారు వీనితోఁగాని కాఁచఁబడిన పాలను త్రాగించవలయు.

(పుట్టినశిశువునకుపచారము) శిశోర్జాతస్యవక్త్రంచసైంధవేనససర్పిషా ।
సువిశోధ్య ఘృతాక్తం చ పిచుం మూర్ధ్న్యవధారయేత్ ॥
ఆకృష్య నాభినాళం చ హ్యంగుళాష్టప్రమాణతః ।
బధ్వా సూత్రేణ సంఛేద్య బధ్నీయాచ్చ శిశో ర్గళే ।
సూత్రశేషం కుమారాంగం సువిశుధ్య జలేన తు ॥ ౧౧౪

సౌవర్ణం మధు సర్పి శ్చానంతా బ్రాహ్మీరసేన తు.।
అగ్రేణానామికాంగుళ్యా లేహయే ద్బాలకం తతః॥     ౧౧౬
వాట్యాలకేనచాభ్యక్తం క్వాథేన క్షీరశాఖినామ్।
కపిత్థపత్రసిద్ధేన సుఖోష్ణేన హి వారిణా।
స్నాపయిత్వా యథాకాలం మృదుమంచే తు శాయయేత్॥

తా. జనించిన శిశువునకు సైంధవలవణమును నేతిలోకలిపి నోటరుద్ది కర్పూరము గలిపిన నేతియందు ప్రత్తిపింజను తడిపి శిశువుయొక్క శిరస్సుపైనుంచవలయు. నాభినాళమును ఈడ్చి దారముతో కట్టి రెనిమిదిఅంగుళములు విడిచి ఛేదించి మిగిలిన దారమును శిశుకంఠమునకు వదులుగ కట్టవలయు, తరువాత పరిశుద్ధమైన చన్నీళ్లతో శరీరమును తుడిచి, తేనె-నెయ్యి-నల్లసుగంధిపాల-మండూకబ్రహ్మి వీని రసములయందు కొంచెము సువర్ణభస్మమును కలిపి పవిత్రపువ్రేలికొనగణుపుతో శిశువునకు నాకించవలయు. పిమ్మట తలకు చిట్టాముదముపూసి వాతాదుల ప్రకోపము నెఱింగి మఱ్ఱిమొదలగు పాలుగలవృక్షముల కొమ్మలనుగాని వెలగాకును గాని వేసి కాచఁబడినసుఖోష్ణముగనుండు జలముచే స్నానముసేయించి మృదుశయ్యపైఁబరుండఁ బెట్టవలయు.

భర్త్సనా ద్బాలక స్త్రస్త స్సహసా ప్రతిబోధనాత్।
వాతాదీనాం విఘాత స్స్యా చ్ఛీఘ్రాపహరణా త్తథా॥  ౧౧౮
ఉత్క్షేపణా ద్భయే బాల శ్చ కుబ్జ స్స్యా దుపవేశనాత్।
తస్మా దేతాని వర్జ్యాని నిత్యం బాలహితార్థినా॥      ౧౧౯

తా. బాలుని బెదరించినను అకస్మాత్తుగ నిద్రలేపినను భయపడును. తటాలున లేవనెత్తినను మీఁదికెగురవేసినను శిశువునకు వాతాది దోషములు చెడును. కూర్చుండఁబెట్టినయెడల మరుగుజ్జుతనము గలుగును, కావున నిట్టిపనులను బాలుని మేలుకోరువారు చేయఁగూడదు.

(దాదిలక్షణము) స్తన్య మల్పం యదా మాతు స్తదా ధాత్రీం ప్రకల్పయేత్।
తుల్యవర్ణా మరోగాం చ నాతివృద్ధాం న బాలికామ్॥
నాతిదీర్ఘాం న ఖర్వాంచ సుశీలాం సుగుణై ర్యుతామ్।
నాతిస్థూలాం నాతికృశాం శుద్ధ స్తన్యా మలోలుపామ్॥  ౧౨౧
జీవద్వత్సా మలంబోష్ఠీ మలంబోర్ధ్వ స్తనీం తథా।
అవ్యంగా మ వ్యశోకాం చ దోగ్ధ్రీ మక్షుద్రకర్మిణీమ్॥ ౧౨౨

సద్గోత్రజాం వత్సలాం చ బాలారోగ్యవివృద్ధయే।
ఊర్ధ్వస్తనీ హ్యారాళం చ కుర్యా ద్వక్త్రిం శిశో స్తథా।
నాసాముఖం లంబకుచా సంఛాద్య మరణం దిశేత్॥ ౧౨౩

తా. ప్రసవించిన స్త్రీకి చనుబాలు కొఱవడినయెడల స్వజాతిగలదియు రోగము లేనిదియు, మిక్కిలి ముసలితనము బాల్యమును లేక మధ్యయౌవనము గలదియు, మిక్కిలి పొడుగు పొట్టి లావు సన్నము నుగాక సమానముగ నుండునదియు, మంచిస్వభావము నడవడిక గుణములును గలదియు, పరిశుద్ధమయిన చనుబాలు గలదియు, ఆశ లేనిదియు బిడ్డలుగలదియు వ్రేలాడని పెదవులు గలదియు, వ్రేలాడక ఊర్ధ్వగతములు గాక సమానముగనుండెడి చన్నులుగలదియు, వికృతాంగములు వ్యసనములు లేనిదియు, మంచికార్యములఁ జేయునదియు, గొప్పవంశమునఁ బుట్టినదియు, ప్రేమకలదియు నగుదాదిని బాలుని ఆరోగ్యముకొఱకు ఏర్పరచవలయు. అదాది ఊర్ధ్వస్తని అయినయెడల బాలుని ముఖమునకు వక్రతగలుగును లంబకుచ అయినయెడల బిడ్డయొక్క ముక్కు మొగములు కప్పఁబడి శ్వాసనిరోధముగలిగి తన్మూలముగ శిశుప్రాణమున కపాయముగలుగును.

(పరిశుద్ధస్తన్య లక్షణము.) శుద్ధస్తన్యం విజానీయా చ్ఛీతలం విమలం
శుభ్రం క్షిప్తం జలే యద్వా ప్యేకీభావం గతం హి తత్॥ [ద్రవం
అఫేనిలం చావివర్ణ మతంతు న నిమజ్జతి।
తథా నోత్ప్లవతే చాపి బాలస్యారోగ్యదాయకమ్॥ ౧౨౫

తా. చల్లగ నిర్మలముగ ద్రవముగ తెల్లగ, నీటిలో వేసినపుడు నీళ్ళతో ఐక్యమును జెంది పైకితేలక లోపలమునుగక, నురుగుకట్టక వికృతవర్ణమును జెందక తీఁగలు పాఱకయుండు స్తన్యము పరిశుద్ధమైనది. బాలుని కారోగ్యమునిచ్చును.

(బాలవ్యాధి నెఱుగునుపాయము) అఙ్గప్రత్యఙ్గదేశే తురుజాయత్రాస్యజా
ముహుర్ముహు స్స్పృశతి తం స్పృశ్యమానే చ రోదితి॥ [యతే॥
నిమీలితాక్షో మూర్ధస్థే శిరో రోగే న ధారయేత్।
వస్తిస్థే మూత్రసంగార్తో రుజా తృష్యతి మూర్ఛతి॥ ౧౨౬
విణ్మూత్రసంగవైవర్ణ్య ఛర్ద్యాధ్మానాంత్రకూజనైః।
కోష్ఠే దోషా న్విజానీయా త్సర్వత్రస్థాం శ్చ రోదనైః॥ ౧౨౭

తా. శిశువునకు ఏయంగమునందు బాధయుండునో ఆయంగమును మాటిమాటికి తాఁకుచు, ఇతరు లాయంగమును దాఁకిన నేడ్చుచుండును, శిరమునందు రోగము గలిగినయెడల కన్నులుమూసికొనును. తలవంచుకొనును. పొత్తికడుపునందుఁ గలిగిన

మూత్రము రాక బాధకలుగును. మఱియు దప్పి మూర్ఛయుఁగలుగును. కోష్ఠము (లోఁగడుపు)నందు బాధకలిగినయెడల మలమూత్రములు రాకుండును. దేహకాంతి చెడును. వాంతి కడుపుపొంగు ప్రేఁగులరచుటయుఁ గలుగును. విశేషముగ నేడ్చుచుండిన శరీరమంతట బాధయని తెలిసికొనునది.

(బాలునిఔషధప్రమాణము.) విడంగఫలమాత్రం తు జాతమాత్రస్య భే
అనేనైవ ప్రమాణేన మాసి మాసి ప్రవర్ధయేత్ ॥ [షజం ।

తా. శిశువునకు ఔషధమును వాయువిడంగ ప్రమాణముచొప్పున నొకనెలవఱకు ఇప్పించవలయు. పిమ్మట రెండవనెలమొదలు సంవత్సరమువఱకు ప్రతినెలకు ఒక్కొక్క వాయువిడంగము చొప్పున హెచ్చించుకొనవలయు.

రసలోహాదిభైషజ్యం మహతాం య జ్జ్వరాదిషు ।
యుంజ్యా త్తదేవ బాలానాం తత్ర మాత్రా కనీయసీ ॥ ౧౩౦

తా. పెద్దవాండ్లకు జ్వరాదిరోగములయందు రసలోహాదులనొసంగునట్లు బాలునికిని ఆ రసలోహాదులను మిక్కిలి కొంచెముగ నిప్పింపవచ్చును.

యేషాం గదానాం యే యోగాః ప్రవక్ష్యంతే భిషగ్వరాః ।
తేషు తత్కల్కసంలిప్తౌ పాయయేత శిశుం స్తనౌ ॥ ౧౩౧

ఏకం ద్వే త్రీణి చాహాని వాత పిత్తకఫజ్వరే ।
స్తన్యపాయాహితం సర్పి రితరాభ్యాం యథార్థతః ॥ ౧౩౨

న చ తృష్ణాభయా దత్ర పాయయేత శిశుం స్తనౌ ।
విరేకవస్తివమనా న్యృతే కుర్యా చ్చ నాత్యయాత్ ॥ ౧౩౩

తా. పాలుత్రాగుచుండెడి శిశువునకురోగమునుపట్టి వైద్యులొసంగిన యౌషధములను ద్రవయుక్తములనుగజేసి దాదిచనుమొనలకు పూసి వాతజ్వరమునందు ౧ దినమును, పిత్తజ్వరమునందు ౨ దినములును, కఫజ్వరమునందు ౩ దినములును, పాలుకుడిపించవలయును, అన్నము దినునట్టి శిశువునకాయౌషధంబుల ఘృతములోఁగలిపి త్రాగించవలయు, శిశువు జ్వరముతోఁగూడి యుండునపుడు స్తన్యపానముచేయించిన దప్పిగలుగును గావున నట్లుచేయకూడదు. రోగములు విశేషించి యున్నపుడు మాత్రము వస్తివిరేకవమనాదులఁ జేయించవలయు, సామాన్యరోగములయందు జేయఁగూడదు.

సిద్ధార్థకో వచా మాంసీ హ్యపామార్గ శ్శతావరీ ।
క్షీరకాకోలికా బ్రాహ్మీ శారిబా కుష్ఠసైంధవమ్ ॥ ౧౩౪

హారిద్రా పిప్పలీ చైవ సర్వైస్సిద్ధం ఘృతం హితమ్ ।
స్తనంధయాయ దాతవ్యం క్షీరాన్నాదాయ వై ఘృతమ్ ॥
వచామధూకత్రిఫలాపిప్పలీచిత్రకై స్తథా ।
సాధితం చైవ దాతవ్య మన్నాదాయ తథా ఘృతమ్ ॥ ౧౩౬
దశమూలక్షీరదారుమధుద్రాక్షామరీచకైః ।
కాలానుసారీద్విబ్రాహ్మీవిడంగై శ్చ సుసాధితం ।
ఆయురారోగ్యమేధా శ్చ భవేయు ర్వై శిశో స్తదా ॥ ౧౩౭

తా. తెల్లఆవాలు-వస- జటామాంసి- ఉత్తరేణి-చల్లపిల్లిగడ్డలు- పిన్నపాల- మండూకబ్రహ్మి-సుగంధిపాల- చెంగల్వకోష్టు- సైంధవలవణము - మానిపసుపు-పిప్పళ్లు వీనికషాయములో నేయిపోసి నీరిగురువఱకు కాచి యాఘృతమును పాలుద్రావెడి శిశువున కొసంగవలయు వస-అతిమధురము - కరకతాడియుసిరికలు- పిప్పళ్లు- చిత్రమూలము వీనికషాయమునందు ఘృతమునుపోసి పైయట్లుకాచి పాలుత్రాగుచు అన్నము దినుచుండెడి శిశువున కిప్పించవలయు, కోలపొన్న- ముయ్యాకుపొన్న- చిన్నములక- పెద్దములక-పల్లేరు- మారేడు-తక్కలి-దుందిలము- నేలగుమ్మడు-కలిగొట్టు- ఆవుపాలు-దేవదారు-తేనె-ద్రాక్ష- మిరియాలు-గ్రంథితగరము- మండూకబ్రహ్మి- సరస్వతిఆకు వాయువిళంగాలు వీని కషాయములో నేతినిపోసి నీరిగురువఱకు కాచి అన్నమును దినుచుండెడి శిశువున కిప్పించవలయు. ఇట్లు చేసిన బాలునికి ఆయుస్సు ఆరోగ్యము మేధ బలము ఇవి వృద్ధిబొందును.

సౌవర్ణం శౌక్తికం చూర్ణం కుష్ఠం మధు ఘృతం వచా ।
మత్స్యాక్షక శ్శంఖపుష్పీ మధు సర్పి శ్చ కాంచనమ్ ॥ ౧౩౮
అర్కపుష్పీ మధు ఘృతం చూర్ణితం కనకం వచా ।
హేమచూర్ణాని కైడర్య శ్శ్వేతదూర్వా ఘృతం మధు ॥ ౧౩౯
చత్వారోఽభిహితాః ప్రాశ్యా అర్ధశ్లోకసమాపనాః ।
కుమారాణాం వపుర్మేధాబలబుద్ధివివర్ధనాః ॥ ౧౪౦

తా. సువర్ణభస్మము - ముత్యపుచిప్పపొడి - చెంగల్వకోష్టు- వస ౧ యోగము పొన్నగంటి- శంఖపుష్పి- దేవకాంచనము ౨ వ యోగము, కోలపాల- స్వర్ణభస్మము- వస ౩వ యోగము, సువర్ణభస్మము-తెల్లగరికె ౪ వ యోగము ఈ దినుసులచూర్ణమును తేనెలోను నేతిలోనుకలిపి శిశువులకిప్పించినయెడల మేధా బల బుద్ధులు శరీరంబును వృద్ధిజెంది ఆరోగ్యము గలుగును.

---

(వృష్యకరౌషధములు.) అథ వక్ష్యే విశాలాక్షి! వృష్యయోగా ననుత్త
గోక్షురేక్షురబీజాని వాజిగంధా శతావరీ ॥ (మాః ।
ముసలీ వానరీబీజం యష్టి నాగబలా బలా ।
ఏషాం చూర్ణం దుగ్ధసిద్ధం గవ్యే నాజ్యేన భర్జితమ్ ।
సితయా మోదకం కృత్వా భక్ష్యం వాజీకరం పరమ్ ॥ ౧౪౩

తా. ఏనుఁగుపల్లేరువిత్తులు - గొలిమిడివిత్తులు - పెన్నేరుగడ్డలు - చల్లపిల్లిగడ్డలు - నేలతాడిగడ్డలు - దురదగొండివిత్తులు - యష్టిమధుకము - బీఱ-సహదేవి (ముత్తవపులగము) వీనిని సరిపాళ్లుగఁ దెచ్చి చూర్ణముచేసి పాలలోనుడకబెట్టి ఆవునేతవేయించి తెల్లచక్కెరగలిపి లడ్డుచేసి భక్షించిన ధాతుపుష్టికలుగును-ఈచూర్ణమునకు ౮ పాళ్లు పాలు, చూర్ణమునకు సమముగ నేయి, అన్నిటికి రెండింతలు తెల్లచక్కెరయుఁ గలిపి జఠరాగ్నిబలమునెఱింగి తగునట్లేర్పరచి భక్షింపవలయు.

(చిట్టాముట్టి వేళ్ళు, గొలిమిడివిత్తులు, పల్లేరుకాయలు, పిల్లిపీఁచరవేళ్ళు వీనిని సమభాగములుగ ఆవుపాలతోనూరి పుచ్చుకొనిన శుక్రవృద్ధియగును (౨) యష్టి మధుకము ౪ మాడలయెత్తు, ఆవునెయ్యి ౧ మాడయెత్తు ఈ రెంటిని కలియనూరి, నేయి తేనె వీనితో పుచ్చుకొనిన శుక్రవృద్ధియగును (౩) ఆవు నేయి ౫౦ తులములు, పంచదార ౧౦౦ తులములు, తేనె ౬ తులములు. నీళ్ళుపావెత్తు, గోధుమపిండి ౪౫ తులములు వీనినికలిపి, పిప్పలి, పిరంగిచెక్క, ద్రాక్షపండ్లు వీనినిచేర్చి భక్షించిన వీర్యవృద్ధి యగును. (౪) పిల్లిపీఁచరవేళ్ళు మెత్తగానూరి దానికి పదిపాళ్ళు హెచ్చుపాలతో వండి తేనె పంచదార నెయ్యి పిప్పళ్ళు వీనిని కలిపి భక్షించిన శుక్రవృద్ధియగును. (౫) రాజనపుపిండి, మినపపిండి, గోధుమపిండి ఇవి కలిపి పూరీలుచేసి ఆవునేతితో వండి భక్షించినను, పాలలో పంచదారకలిపి త్రాగినను వీర్యవృద్ధియగును. (౬) మంచి గోధుమపిండి, ఏలకులు, లవంగములు. పచ్చకర్పూరము, మిరియపుపొడి వీనిలో నేయి నీళ్ళుపోసి మర్దించి యుండలుజేసి నేతిన వేయించి .పంచదారపాకములో వేసి తీసి భక్షించినను, గోధుమపిండి ఆవునేయి పాలు పంచదార వీనితో సిద్ధముచేసిన భక్ష్యముల భుజించినను శుక్రవృద్ధి యగును.)

అథ వక్ష్యే మహాదేవి! వశీకరణమూలికాః ।
విష్ణుక్రాంతా చ సర్పాక్షీ సహదేవం చ రోచనా ॥ ౧౪౪
అజాదుగ్ధేన సంపిష్టం తిలకో వశ్యకారకః ॥ ౧౪౫

తా. ఓపార్వతీ! ఇఁక వశ్యమూలికలఁ జెప్పెద.విష్ణుక్రాంత- సర్పాక్షి - సహదేవి గోరోచనము వీనిని మేఁకపాలతో నూరి తిలకముపెట్టుకొనిన జనులువశమగుదురు.

ప్రియంగు కుంకుమం కుష్ఠం మోహినీ తగరం ఘృతమ్ ।
తిలకో వశ్యకృ త్తచ్చ రోచనా ర క్తచందనమ్ ॥ ౧౪౬
నిశా మనశ్శిలా తాళం ప్రియంగుసర్షపా స్తథా ।
మోహినీ హరితా క్రాంతా సహదేవీ శిఖా తథా ॥ ౧౪౭
మాతులుంగరసైః పిష్టం లలాటే తిలకో వశే ॥ ౧౪౮

తా. ప్రేంకణము, కుంకుమపువ్వు, చెంగల్వకోష్టు, కోలపాల, గ్రంథితగరము, నెయ్యి (ఇది ౧ యోగము), గోరోచనము, ర క్తచందనము, మానిపసుపు, మణిశిల, తాళకము, ప్రేంకణము, ఆవాలు, కోలపాల, పచ్చాకు, విష్ణుక్రాంతము, సహదేవి, నెమలిజుట్టుచెట్టు వీనిని మాదీఫలరసముతో నూరి లలాటమున తిలకముధరించిన జనులు వశమగుదురు.

చందనం నాగపుష్పం చ మంజిష్ఠా తగరం వచా ।
లోధ్ర ప్రియంగు రజనీ మాంసీతైలం వశంకరమ్ ॥ ౧౪౯

తా. చందనము, నాగకేసరాలు, మంజిష్టి, గ్రంథితగరము, వస, లొద్దుగు, ప్రేంకణము, పసుపు, జటామాంసి వీని తైలమును లేపనము చేసికొనిన జనులు వశమగుదురు.

(పురుషసాముద్రికము.) పుంసాం చ లక్షణం వక్ష్యే స్త్రీణాం చైవ శుభా శుభమ్ ।
ఏకాధికో ద్విశుక్ల శ్చ త్రిగంభీర స్తథైవ చ ॥ ౧౫౦
త్రిస్థిర స్త్రిప్రలంబ శ్చ త్రిభి ర్వ్యాప్నోతి య స్తథా ।
త్రివళీమాం స్త్రివినత స్త్రికాలజ్ఞ శ్చ సువ్రతే ! ॥ ౧౫౧
త్రితామ్ర స్త్రిషు చ స్నిగ్ధో విపుల శ్చ తథా త్రిషు ।
చతుర్లేఖ స్తథా య శ్చ తథైవ తు చతుస్సమః ॥ ౧౫౨
చతుష్కిష్కు శ్చతుర్దంష్ట్రి శ్శుక్లకృష్ణ స్తథైవ చ ।
చతుర్గంధ శ్చతుర్హ్రస్వ సూక్ష్మదీర్ఘ శ్చ పంచసు ॥ ౧౫౩
షడున్నతో ఽష్టవంశ శ్చ స ప్తస్నేహో నవామలః ।
దశపద్మో దశవ్యూహో న్యగ్రోధపరిమండలః ।
చతుర్దశసమద్వంద్వ షోడశాక్ష శ్చ శస్యతే ॥ ౧౫౪

తా. ఓ పార్వతీ ! ఇంక స్త్రీ పురుషుల శుభాశుభలక్షణములఁ జెప్పెద, పురుషుఁడు ధర్మార్థ కామంబులతోఁగూడిన ముఖ్య మగు ధర్మము గలిగి యుండవలయు. కనుపాపలు తప్ప తెల్లగ్రుడ్డునందును దంతములయందును, ధావళ్యము గలిగి యుండవలయు. చెవులు నాభి వీనియందు లోఁతు, గంభీరస్వరమును గలిగియుండవలయు. ఈర్ష్యలేమి, దయ, ఓర్పు, మంగళాచారయుక్తత, ఆచారము, కోరిక, ఆకార్ప

న్యాయము, శ్రమమునేర్చు, శౌర్యము ఇవి గలిగియుండవలయును. కనుబొమ్మలు భుజములు వృషణములును నిడుపలై యుండవలయును. దిక్కులయందు పరాక్రమముచేతను, దేశములయందు కీర్తిచేతను, జాతియందు సంపత్తుచేతను వ్యాపించి యుండవలయును, ఉదరమునందును కంఠమునందును అస్పష్టముగ నిడుదలైన మూడు ముడతలు గలిగియుండవలయును. దేవ బ్రాహ్మణ గురువులకు నమ్రుఁడై యుండవలయును, ధర్మార్థ కామముల కాలము నెఱింగియుండవలయును. కనుఁగొనలు గోళ్ళు అఱకాళ్ళు అఱచేతులు ఇవి యెఱ్ఱగను, పాదరేఖలు వెంట్రుకలు మేఢ్రము ఇవి నున్నగ మెరుగుగను నుండవలయును. ఱొమ్ము నుదురు ముఖము విశాలముగనుండవలయును, అఱచేతులు అఱకాళ్ళు ధ్వజచ్ఛత్రాదిలాంఛనములతోఁ గూడియుండవలయును. మఱియు, లలాటము పాదములు చేతులు వీనియందు నాలుగేసి రేఖలుండవలయును. వ్రేళ్ళు హృదయము వీఁపు కటిప్రదేశము ఇవిసమముగనుండవలయును. మఱియు భుజములు మోకాళ్ళు తొడలుపిక్కలునుసమముగ నుండవలయును. దేహప్రమాణము ౯౬ అంగుళముల పొడువుగలిగియుండవలయును, నాలుగు కోరపండ్లు చంద్రప్రకాశము గలిగియుండవలయును, మీసములు కనుపాఁపలు కనుబొమలు వెంట్రుకలు ఇవి నల్లగనుండవలయును. ముక్కు నోరు దేహము చంకలు వీనియందు దుర్గంధము లేకుండవలయును. శిశ్నము మెడ పిక్కలు ఇవి పొట్టిగనుండవలయును. వ్రేలిగణుపులు గోళ్ళు వెంట్రుకలు పండ్లు చర్మము ఇవిసూక్ష్మములుగ, దౌడలు, నేత్రములు, ముక్కు, ఱొమ్ము ఇవిదీర్ఘములుగనుండవలయును. ఱొమ్ము, చంక, ముక్కు, పొట్ట, భుజశిరము, ముఖము (ముచ్చిలిగుంట) ఇవి ఉన్నతములుగ నుండవలయును. వీఁపుఎముక, శరీరము, కాలివ్రేళ్ళు, చేతివ్రేళ్ళు, బాహువులు, ముక్కు, నేత్రములు, చెవులు, శిశ్నము, ఇవిపొడువుగ నుండవలయును, (శిశ్నమునకు పొడువనఁగా వంకరలేకుండుట), చర్మము, వెంట్రుకలు, దంతములు, రోమములు, నేత్రములు, గోళ్ళు, వాక్కు ఇవి మెరుగుగలిగి నున్నగ నుండవలయును. కన్నులు, ముక్కుపుటములు, చెవులు, మేఢ్రము, గుదము, ముఖము, వీనియందు మలములేకుండవలయును. నాలుక, పెదవులు, దౌడలు, కన్నులు, హస్తములు, పాదములు, అఱచేతులు, అఱకాళ్ళు, శిశ్నాగ్రము, నోరు ఇవి పద్మాకారము గలిగియుండవలయును. హస్తములు, పాదములు, మెడ, చెవులు, ఱొమ్ము, శిరస్సు, లలాటము, ఉదరము, వీఁపు ఇవివిశాలములై యుండవలయును. భుజము చాఁచినపుడు భుజముయొక్క నడిమిభాగము (అనఁగా మోచేయి) కొనభాగము మొదటిభాగము ఇవి ఉన్నతమై సమానముగ నుండవలయును. పాదములు, చీలమండలు, పిఱుదులు, ప్రక్కలు, గజ్జలు, వృషణములు, స్తనములు, చెవులు, పెదవులు, తొడలు, పిక్కలు, చేతులు, బాహువులు, కన్నులు, ఇవి యెచ్చుతక్కువలులేక సమానముగ నుండవలయును. ౧౮ విద్యలు రెండుకన్నులునుగల పురుషుఁడు షోడశాత్ముఁడనఁబడును. శరీరము వేడిగను పైకిఁ గనఁబడుచున్న నరములుగలదిగను కండలేనిదిగను దుర్వాసన

గలదిగనుండిన మంచిదికాదు. దీనికి విపరీతముగ నుండునది శ్రేష్ఠమైనది. నిర్మలమైన దృష్టియు, మధురమైనవాక్కును, మదపుటేనుఁగు నడకయు, రోమకూపములందొక్కొక రోమముండుటయు మహాపుణ్యావంతుని లక్షణములు.

(స్త్రీసాముద్రికము,) శస్తా స్త్రీ చారుసర్వాంగీ మత్తమాతంగగామినీ
గురూరుజఘనా చైవ మత్తపారావతేక్షణా ॥ ౧౫౫
సునీలకేశీ తన్వంగీ విలోమాంగీ మనోహరా ।
సమభూమిస్పృశౌ పాదౌ సంహతౌ చ స్తనౌ తథా ॥ ౧౫౬
నాభిః ప్రదక్షిణావర్తా గుహ్యా మశ్వత్థపత్రవత్ ।
గుల్ఫౌ నిగూఢౌ మధ్యేన నాభి రంగుష్ఠమానికా ।
జఠరం న ప్రలంబం చ రోమరూక్షా న శోభనా ॥ ౧౫౭
నర్క్ష వృక్షనదీనామ్నీ న సదా కలహప్రియా ।
న లోలుపా న దుర్భాషా శుభా దేవాదిపూజితా ॥ ౧౫౮
గండై ర్మధూకపుష్పాభై ర్న సిరాళా న లోమశా ।
న సంహతభ్రూకుటిలా పతిప్రాణా పతిప్రియా ॥ ౧౫౯

*ఇత్యుమామహేశ్వరసంవాదే స్వరచింతామణౌ శకునాదికథనంనామ పంచవింశో ఽధ్యాయః.*

తా. సుందరములగు సర్వాంగములును, మదపుటేనుఁగు నడకవంటి నడకయు ఘనమైన నితంబమును, నల్లని వెండ్రుకలును, మిక్కిలి లావు లేక సన్నమై రోమరహితమయి మనోహరముగ నుండు శరీరమును, సమభూమియందునిలిచిన బాగుగ నడగులు గన్పట్టునట్టి పాదంబులును, గొప్పవై ఒకటినొకటి నొరయుచున్న చన్నులును ప్రదక్షిణమగు సుడిగల బొడ్డును, రావియాకుంబోలిన భగమును నడుమ పల్లముగఁ చీలమండలును, బొటనవ్రేలి ప్రమాణముగల నాభియు, వ్రేలాడని కడుపును, రోమములచే కప్పఁబడని శరీరమునుగల స్త్రీ శుభకరురాలగును, నక్షత్రములు, వృక్షములు, నదులు వీని నామధేయములును ఎల్లపుడు కలహమునందాశయు అత్యాశయు దుర్భాషలును లేనిదియు, ఒకటినొకటి కలిసికొనని కనుబొమలును, ఇప్పపువ్వునుబోలి నిగనిగలాడుచెక్కిళ్ళను, పైకి నరములు రోమములును తెలియని దేహమునుగలదియు, పతియందత్యంత ప్రేమయును, భర్తను ప్రాణములతో సమానముగఁ జూచునదియు శుభకరురాలు.

---